# మహాభారత విమర్శనము



## ప్రథమ భాగము



మహాకవి. సరస్వతీపుత్ర పుట్టపర్తి నారాయణాచార్యులు

# మహాభారత విమర్శనము
## ప్రథమ భాగము



'మహాకవి' 'సరస్వతీపుత్ర'

పద్మశ్రీ

డాక్టర్ పుట్టపర్తి నారాయణాచార్యులు






తిరుమల తిరుపతి దేవస్థానము వారి
ఆర్థిక సహాయముతో ప్రచురితము

# పీఠిక

జగమంతయు వ్యాసోచ్ఛిష్ట మన్నారు పెద్దలు. ఎన్ని మహా పర్వత శిఖరములనైనను - యెన్ని మహాసముద్రముల నైనను నూహింపవచ్చును. కాని - వ్యాసుని మేధస్సు నూహించుట కష్టము. అతని సృష్టి-యెంత విస్తృతమో అంత గంభీరము. ఎంత గంభీరమో - అంత విస్తృతము. అందుకే పూర్వు లాతని నారాయణ స్వరూపు డనిరి. భగవద్వ్యాస రచితములని చెప్పబడు వానిలో గొన్ని వారిని గాకపోవచ్చును. స్కాందపురాణములో చాల భాగ మాతనిది గాదనియే యనిపించును. ఆతని రచనము లనిపించువానిలో గూడ నతని కూర్పెంతయో - తరువాతి వారి చేర్పెంతయో - యిదమిత్థమని తేల్చుట - "గగనం గగనాకార" ముగా నుండును. అనేక ప్రతులలో ననేకములగు క్రొత్త శ్లోకములు వచ్చును. నేను నా దగ్గఱనున్న ప్రతినిబట్టియే యీ రచనమునకు బూనుకొన్నాను. నే నుద్ధృతీకరించిన శ్లోకములు గొన్నింటిలో లేకపోవచ్చును. మఱికొన్నింటిలోఁ గ్రొత్తశ్లోకము లుండవచ్చును. అన్ని ప్రతులను దెప్పించికొని పరీక్షించుటకు నా కార్థికస్తోమత లేదు. ఆయువును లేదు. నాకే కాదు మరెవ్వరికిని సాధ్యము గాదని నా యనుమానము. క్షమింపుడు.

వ్యాసుని రచన చాల ప్రౌఢమైనది. ఓజోగుణ మెక్కువ. వాల్మీకివాణి ప్రసన్న లలితము. ఆ కథ నర్థము చేసికొనుటయు సులభమే. భారతమున ననేక సమస్యలు. సమస్యలకన్నను గ్లిష్టమైనది యాతని రచన. ఏదో నాశక్తి కొలది యుపాసించినాను. భారతమున గొన్ని ప్రతులలో - వస్త్రాపహరణకథయే లేదట - వస్త్రాపహరణమే భారతయుద్ధమునకు బ్రచోదకశక్తి. దానినే గాదన్నచో నిక భారతయుద్ధము నూహించుటయే కష్టము. నాయీ విమర్శనములు సర్వసమ్మతములుగ నుండవలెనను పేరాస నాకు లేదు. దానిలో నా రాగద్వేషములు ప్రతిఫలించి యుండవచ్చును. కొన్ని యెడల నా దృష్టి

సంకుచితమైయుండవచ్చును. పాఠకులు నా యీ దౌర్బల్యములను సహృదయతతో క్షమింపవలెను.

నేనీ గ్రంథమును రచించి చాల సంవత్సరములైనది. అనేక కాల మీ రచన మూలబడియుండెను. ఇది వెలుగు జూచునను నాశగూడ నాకుండలేదు. దైవ మెప్పు డెప్పు డేపని చేయునో యూహించుట కష్టము. మిత్రులు, సహృదయులు, శ్రీ పాలుట్ల పాలంకయ్యగారి యుదారహృదయము - యీ పుణ్య కార్యమునకు బూనుకొన్నది. భాషాభిమానులు సహృదయ ధనికులైన శ్రీ ఈదర వేంకట్రామయ్య గారీ గ్రంథమును బ్రచురించు మహాకార్యమునకు బూనికొనిరి. వారిరువురకు నా నమోవాకములు.

మహాభారతముపై గృషియొనర్చిన మేధావు లెందరో గలరు. వారిలో నొక్కొక్క రొక్కొక్క మహాపర్వతము. నావంటి యల్పజ్ఞునకు వారితో సామ్యము లేదు. చాలవఱకు వారి కృషి నంతయు నేనీ గ్రంథమున వాడుకొన్నానియే చెప్పవచ్చును. ఈ రచనమున నా ప్రత్యేకత యేమియు లేదు. వారి భావముల నొక మాలగా గూర్చి - మీయెదుట నుంచితినంతే. మహారాష్ట్రులెందఱో మహాభారతముపై విమర్శనము లొనర్చినారు. వారిలో ముఖ్యముగ "హరిదానుబాళాశాస్త్రి" గారి పేరు చెప్పవలసియున్నది. వారికి నా ప్రత్యేక కృతజ్ఞత.

గ్రంథము ముందున్నది. సహృదయులు చదివి - సౌజన్యముతో విమర్శించినచో ధన్యుడను.

కడప - పుట్టపర్తి నారాయణాచార్యులు

25-1-65

# విషయ సూచిక

నారాయణం నమస్కృత్య
నరంచైవ నరోత్తమమ్
దేవీం సరస్వతీం వ్యాసం
తతో జయ ముదీరయేత్.

వ్యాసం వశిష్ఠ నప్తారం
శక్తేః పౌత్ర మకల్మషమ్
పరాశరాత్మజం వందే
శుకతాతం తపోనిధిమ్.

ధర్మమూలం జగత్సర్వం
ధర్మశ్చ శ్రుతి మూలకః
భారతం పంచమో వేదః
శ్రుతి సర్వస్వ విస్తరః.

"ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
అధ్యాత్మవిదులు వేదాంత మనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని
కవివృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమని
యైతిహాసికు లితహాస మనియు
పరమపౌరాణికుల్ బహుపురాణ సముచ్చ
యంబని మహిఁ గొనియాడు చుండ

వివిధ వేదతత్త్వవేది వేదవ్యాసుఁ
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణు సన్నిభుండు విశ్వజనీనమై
పరఁగుచుండఁ జేసె భారతంబు."



# సాహితీ సహస్రఫణి

అటు పటుతర గద్య పద్యోక్తుల జలధులను మధిస్తూనే, యిటు మృదు మధుర బంధురంగా, పదాలను సంధించగల ప్రజ్ఞగలవారు-పుట్టపర్తివారు. అటు భారత ప్రాచీన వైభవ కాంతుల తేజస్సులకు, ముగ్ధ హృదయులవుతూనే-యిటు సర్వధర్మాతీత మానవతా గాయత్రీ మంత్రాన్ని ప్రపంచ జనావళికి . ఉపదేశించగల అపర విశ్వామిత్రుడీ పుట్టపర్తివారు. స్వామీ శివానందుల వారిమాటల్లో సాహిత్య దర్పణకారుడు, ఉత్కళ దేశీయుడైన విశ్వనాధ కవిరాజులా 'చతుర్దశ భాషా విలాసినీ మనోహరుడు'గా వెలుగొందుతూనే మరోవైపు జ్యోతిష వ్యాకరణాలంకార శాస్త్ర పాండితీ ప్రకర్షతో 'సహఫణి'లా ప్రకాశించగల విద్వన్మణి పుట్టపర్తి. వీటితోపాటు సంగీత నాట్య విద్యలలోనూ అనన్య సామాన్యమైన ప్రజ్ఞాధురీణతను ప్రదర్శించగల బహుముఖీనమైన పాండితీ మూర్తి మత్వం పుట్టపర్తి వారిది. ఓ జీవితకాలంలో ఒక పండితుడు, యింతటి విశ్వరూపాన్ని ప్రదర్శించటం-"న భూతోన భవిష్యతి". సాహిత్యవేత్తగా వారి రచనలలో కనబడే చిక్కదనం, చారిత్రక పరిశోధకునిగానూ అనుభవానికి రావటం అద్వితీయం. వాగ్గేయకారునిగా వారి రచనలలో జాలువారేకమ్మదనానికీ-భాషా శాస్త్రవేత్తగా వారి ప్రసంగాలలో తొంగి చూచే కఠిన తపస్సు తాలూకు కరుకుదనానికీ పోలికే వుండదు. వజ్ర సమంగా తోచేవారి సమీక్షా ధోరణి నవనీత కోమలంగా అనుభూతమయ్యే వారి కవితాత్మక దృష్టి-దక్షిణ, ఉత్తర ధృవాలని ఒకచోటచేర్చటం సాధ్యమే ననిపిస్తాయి సుమా!

కవిగా, వాగ్గేయకారునిగా విమర్శకునిగా, పుట్టపర్తి భారతీయ సాహిత్య సువిశాల క్షేత్రంలోనే నిరుపమానులు. ఇన్ని రంగాలలోనూ పరిపక్వతను సాధించిన మహామేధాశాలులు మరి ఒకరు కనిపించటం దుర్లభమే.

డెబ్భై ఐదు సంవత్సరాల జీవన యాత్రలో అంతకు రెండింతల రచనల్ని వెలువరించి భారతీయ సాహిత్యక్షేత్రంలో 'నారాయణ గహనవనాన్ని' వ్యాపింపజేసిన పుట్టపర్తి వారి ముద్రిత రచనలలో యీ 'మహాభారత విమర్శనము' పండితోత్తముల

ప్రశంసలనందుకున్న గ్రంధరాజనం.

పూర్వ సాహిత్య సురభిళాలను గ్రోలి, నవ్యసాహిత్య సీమలలో విహరించి, అన్య భాషా సాహిత్య చందన లేపనంతో పులకించి, సంగీత రసాస్వాదనలో మునిగి, నాట్యాభినయ భంగిమలలో తేలి, కావ్య వచన రచనాటవులలో చిక్కి, భక్తి సూత్రాధారంతో భగవత్సాన్నిధ్యానికి చేరుకున్న అపర భాగవతోత్తములు . మా అయ్యగారి మహాభారత విమర్శనము గ్రంధ పునర్ముద్రణకై తిరుమల తిరుపతి దేవస్థానం ఆర్థికసహాయాన్ని అందజేయటానికి అంగీకరించటం, నా అదృష్టం. కారణాంతరాల వల్ల, ముద్రణ సకాలంలో జరగకపోయినా, నా అభ్యర్థనమేరకు, మరింత గడువును పొడిగించి, పుస్తక ముద్రణలో సహకరించిన తి.తి.దే. ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగారికీ, సంపాదకులు శ్రీ ఎన్. ఎస్. రామమూర్తిగారికీ కృతజ్ఞతాంజలులు. గ్రంధముద్రణలో తగుసూచనలూ. సలహాలనిచ్చి. ఓరూపం వచ్చేలా చేసిన 'రచన' జర్నలిజం కళాశాల ప్రిన్సిపాల్, డాక్టర్, గోవిందరాజు చక్రధర్ గారికీ, అందంగా ముద్రించిన ' ఆకృతి ఆఫ్‌సెట్ ప్రింటర్స్ వారికీ, గ్రంధవిక్రయ భారాన్ని సహృదయంతో, అయ్యగారిపట్ల గౌరవాదారాలతో అంగీకరించిన 'విశాలాంధ్ర' శ్రీ రాజేశ్వరరావుగారికి నా వినయాంజలులు. ముఖ్యంగా గ్రంథముద్రణలో సహకరించిన మా అన్నయ్య శ్రీమాన్ పుట్టపర్తి అరవింద్, కీ మా వదినె కుం.సౌ. రాజ్యలక్ష్మికి నా శుభాకాంక్షలు. అఖండ ప్రతిభా సంపన్నులు, పరమభాగవతోత్తములు 'పుట్టపర్తి' వారి కుమార్తెగా జన్మించి, ఈ మహోత్కృష్ట రచనను మళ్ళీ తెలుగు సాహితీలోకానికి అందించే మహద్భాగ్యం దక్కటం నా పురాకృత జన్మ విశేషం.

- పుట్టపర్తి నాగపద్మిని

# పుట్టపర్తివారి మహాభారత విమర్శనము

డాక్టర్ అక్కిరాజు రమాపతిరావు, హైదరాబాద్

" నేనీ గ్రంథమును రచించి చాలా సంవత్సరము లయినది. అనేకకాల మీరచన మూలబడి యుండెను. ఇది వెలుగు జూచునను నాశ గూడ నాకుండ లేదు " లని పీఠికలో చెప్పుకున్నారు ఆచార్యులవారు.

శ్రీ ఆచార్యులవారు సంస్కృతం, ఇంగ్లీషు, ఇతర భారతీయ బాషలలో వచ్చిన మహాభారత వ్యాఖ్యానాలూ విమర్శలూ అన్నీ అవలోడనం చేసి ఈ గ్రంథాన్ని రచించినట్లు తెలుస్తున్నది. మహాభారత కాలం నాటి రాజకీయ, సాంఘిక, మత, నైతిక సరిస్థితులను ప్రతిభావంతంగా ఈ గ్రంథములో సమీక్షించారు ఆచార్యుల వారు. హిందూ మతం ఉత్కృష్టతను గూర్చి తెలుసుకోదలచినవారు ఈ గ్రంథాన్ని తప్పక చదవాలి. భారతీయ సమాజాన్ని అనుశాసించే ఉన్నతాదర్శా లెటువంటివో, వారు ఆశించిన జీవిత పరమీర్థము ఎటువంటిదో, దాని ఉత్థాన పతనావస్థల చరిత్ర ఎటువంటిదో మహాభారతం ఆధారంగా ఈ విమర్శన గ్రంథంలో ఆచార్యులవారు నిరూపించారు.

వారు పలు భారతీయ భాషలలో మహాపండితులు కాబట్టి పరమ మనోజ్ఞమైన భావుకతా పరసీమలకు వారు చేరుకోగలిగారు. . ఈ గ్రంథం ఆచార్యుల వారి ప్రసన్నధారా మధురమైన శైలికి నిలయం. ఆదునిక తెలుగువచన శైలీ నిర్మాతలలో ఆచార్యులవారికి చెప్పుకోదగిన స్థానముంది వారి కాకువు, వారి అధిక్షేపణ, మృదుహాసోజ్జ్వలలలిత పదవిన్యాస శైలి ఈ గ్రంథంలో హృదయంగమం.

" మహాభారతం కురుపాండవుల యుద్ధగాథ మాత్రమే గాదు. అది ఆర్యుల తత్త్వజ్ఞాన, ధర్మశాస్త్ర, నీతిశాస్త్ర, రాజ్యశాస్త్రముల పేటిక. వ్యవహారశాస్త్ర , కామశాస్త్రముల సమావేశము. మన సంస్కృతి యొక్క సర్వస్వము. మన జ్ఞానకోశము " అంటారు ఆచార్యులవారు. ప్రపంచ సాహిత్యంలో ఇటువంటి గ్రంథం ఇంకొకటి లేదు అంటారు వారు. భారతదేశంలో మధ్యయుగాలలో విలసిల్లిన భక్తిపంథాకు మహాభారత విజ్ఞానమే జన్యభామి అని సిద్ధాంతీకరించారు అచార్యులవారు.

శ్రీకృష్ణ తత్త్వాన్ని పరమ మనోజ్ఞంగా ఆవిష్కరించారు. మహారాష్ట్ర భాషలో ఉన్న గీతా వ్యాఖ్యానాలనన్నిటినీ పరిచయం చేశారు.రామాయణ, మహాభారతాలు భారతీయ జనజీవనంపై చూపిన ప్రభావాన్ని పుస్తకానుప్రసక్తంగా ప్రస్తావించారు..

మహాభారతానికి సంబంధించిన వివిధ విషయాల పరిశీలన ఆచార్యులవారి ఈ గ్రంథంలో నిస్తులంగా, అమితాశ్చర్యజనకంగా కనిపిస్తుంది . పాశ్చాత్య సాహిత్యకులు, విమర్శకులు, తత్త్వవేత్తలు మహాభారతాన్ని గురించి చేసిన అపవ్యాఖ్యానాలు, పడిన పొరపాట్లు, వెలిబుచ్చిన అసంగతాభిప్రాయాలు ప్రస్తావించి వాటికి మరి ప్రత్యాఖానం చేయలేని సమాధానాలు చెప్పారు ఆచార్యులవారు. భారతంలో పొంది పొసగనట్లు కన్పించే అంశాలను శ్రీ ఆచార్పులవారు ఎంతో సమర్థంగా సమన్వయించారు. ఇక విదేశీయుల స్వదేశాయుల దురర్థకమైన వ్రాతలను ఖండించారు.

భారతదేశంలో చిరకాల వ్యవస్థితమైనది ప్రజాసత్తాకమేనని అత్యంతాహ్లాదకరమైన ఆధారాలతో మహా భారతంలోని అనేక సన్నివేశాలను చూపుతూ నిరూపించారు ఆచార్యులవారు. అంతేకాద

భారతీయ రాజ్యవ్యవస్థపై పౌర జాన పదులకున్న నియంత్రణను అద్భుతంగా ఆవిష్కరించారు. ఇటువంటి వ్యవస్థ అశోకుడి కాలం వరకు అమలులో ఉన్నట్లు చారిత్రక ప్రమాణాలు చూపారు. ప్రజల సమ్మతితోనే పన్నులు పెంచవలసిందే కాని రాజు తనంతట తానుగా అధికంగా పన్నులు వసూలు చేయకూడదనటానికి నిదర్శనాలు భారతం శాంతి పర్వం ద్వారా వివరించారు.

మహా భారతేతివృత్తం కల్పితమనీ, చారిత్రం కాదనే వాదనలను ఆచార్యులవారు విశ్వసనీయమైన ఉపపత్తులతో ఖండించారు. మహాభారత యుద్ధం జరగటానికీ, ఆనాటి సామాజిక రాజకీయ జీవనంలో పతనావస్థ కలగటానికీ గణరాజ్య వ్యవస్థ దెబ్బతినడమేనని సోపపత్తికంగా వ్యాఖ్యానించారు. పురాణ చరిత్ర కాలం నుంచీ భారతదేశంలో గణ రాజ్యాలు అంటే రిపబ్లిక్‌లు మాత్రమే ఉండేవనీ వీరంతా కలిసి ఒక సమ్రాట్టును ఎన్నుకొనే వారనీ సమాఖ్య వ్యవస్థగా దేశమంతా శాంతి భద్రలతో, ప్రజా సౌకర్యానికి ప్రముఖ స్థానం ఇచ్చి అలరారుతూ ఉండేదనీ నిదర్శనాలతో విశ్లేషించి చూపారు శ్రీ ఆచార్యులవారు. ఈ ప్రజా సత్తాక గణరాజ్య వ్యవస్థకు జరాసంధుడు, శిశుపాలుడు, కంసుడు, దుర్యోధనుడు విఘాతం కలిగించడం వల్లనే భారత యుద్ధం అనివార్యమైందని అయా సంఘటనలద్వారా నిరూపించి చూపారు శ్రీ ఆచార్యులవారు. శ్యాంతి పర్వంలో భీష్ముడు ధర్మరాజుకు విచ్ఛిత్తి దేశ విపద్దశకు కారణమవుతున్న సత్యాన్ని విపులంగా వ్యాఖ్యానించారు పుట్టపర్తి వారు.

పుట్టపర్తి వారి మహాభారత విమర్శనంలో మెచ్చుకోదగిన విషయం ఏమంటే ఆయా పాత్రల ఆంతరిక చిత్తవృత్తులను ఆయా సన్నివేశాల ఆధారంగా పారదర్శకంగా నిరూపించి ధర్మాధర్మాల పర్యవసానాన్ని కళ్ళకు కట్టినట్లు చూపించడం. ఆధునికులలో కొందరు విమర్శకులు కౌరవుల పట్ల అమిత ఔదార్యాన్ని ప్రదర్శించడం, ఆపద్ధర్మ సన్నివేశాలను దుర్మేధావిలసనంతో వ్యాఖ్యానించడం, పాండవులను దోషులుగా నిరూపించడానికి ద్రావిడ ప్రాణాయామానికి పూనుకోవడం పుట్టపర్తి వారు నిర్ద్వంద్వంగా విస్పష్టంగా సూటిగా సరళంగా పరాస్తం చేశారు.

కర్ణుడి పాత్రోన్మీలనాన్ని అమిత సానుభూతితో రూపుకట్టించారు. ధృతరాష్ట్రుడి దుర్మార్గాన్ని కాదనడానికి వీలులేని ప్రమాణాలతో నిరూపించారు. ధృతరాష్ట్రుడి వల్లనే భారత యుద్ధమనే మహా సంక్షోభం అనివార్యం కాలేక పోవడాన్ని గొప్ప న్యాయాధిపతి తిరుగులేని తీర్పులాగా ప్రకటించారు.

ఆచార్యులవారి మహాభారత విమర్శనంలో కర్ణుడి దైవదుర్విపాకాన్ని విపులంగా, పరమకారుణికంగా వర్ణించారు. ప్రధాన పాత్రలన్నిటిలో కర్ణుణ్ణి అత్యంత ప్రధానపాత్రగా అతడి ఔదార్యాన్ని, సత్య సంధతను, దానగుణాన్ని విశ్లేషించి చూపారు. భీష్మ ద్రోణుల పాత్రల విశ్లేణం అద్భుత మనిపిస్తుంది, సంస్కృత భారతం చదవడానికి సామర్థ్యం లేని వారికి మహోపకారం చేశారు ఆచార్యులవారు. ఆ ప్రధాన పాత్రల స్థానాన్ని కూడా ఎంతో ప్రతిభావంతంగా విశ్లేషించారు.

ప్రసక్తాను ప్రసక్తంగా ఆధునిక ప్రపంచంలోని అనేక విప్లవ సిద్ధాంతాలతో మహాభారత తాత్త్విక దర్శనాన్ని పోల్చి నిగ్గు తేల్చడం శ్రీ ఆచార్యులవారి మహా ప్రతిభకు గీటురాయిలా ఈ విమర్శ గ్రంథం కనపడుతుంది.

శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులవారి మహాభారత విమర్శనం యుగ యుగాల భారతీయ సంస్కృతిని వివరించే విశిష్ట గ్రంథం.

శ్రీమతే నారాయణాయ

# మహాభారత విమర్శనము

ధ్యానమ్

శ్లో॥ అభ్రశ్యామ: పింగజటా బద్ధ కలాప:
ప్రాంశు ర్దండీ కృష్ణ మృగత్వక్పరిధాన:
సర్వాన్ లోకాన్ ప్లావయమాన: కవిముఖ్య:
పారాశర్య: పర్వసు రూపం వివృణోతు॥

## సదస్యులకు నమస్కారము

మహాభారతము, వ్యాసభగవానుని యవతారము. భతవత్తత్వము నర్థమొనర్చికొను టెంత యసాధ్యమో, భారతము నర్థము చేసికొనుటయు నంతే. నీటికొలఁది లోతు, బుద్ధికొలఁది పరిశ్రమ. మహాభారతమును నేనెట్లధ్యయన మొనర్చికొన్నానో, వివరించుటయే యీ యుపన్యాసముల సారాంశము. నా యభిప్రాయములు అందఱు నంగీకరింపవలెనను మొండి పట్టుదల నాకు లేదు. ఈదృష్టితో, సాహితీపరులు, భారతము నందలి పాత్రలను బర్యాలోచింపు డనుటకే, నా యీ ప్రయత్నము. నా ప్రయత్నములో నెన్నియో లోపము లుండవచ్చును. రసికశిఖామణులైన తమరు వాని నన్నింటినీ, మన్నింపవలెనని, మఱిమఱి ప్రార్థన.

## గ్రంథ విస్తృతి

మహాభారతము లక్ష శ్లోకముల గ్రంథము. ఇంతటి గ్రంథము నొకడే రచించియుండుట యసంభవమనియు, దీనిలో ననేకుల చేతులు గలసియుండు ననియు విమర్శకులందురు. కేవలము గ్రంథము పెద్ద దైనంత మాత్రముననే

దానిని బలువురు వ్రాసియుండవలె ననుట తర్కసహమైన విషయముగాదు. చరిత్రయు దీని కంగీకరింపదు. మహారాష్ట్ర వాఙ్మయమందు 'దాసోపంత్‌గోసాని' ప్రసిద్ధుఁడేగదా! వీరు ఇంచుమించు ఏకనాథ మహారాజుల సమకాలికులు! 'దాసోపంత్' 'గీతార్ణవ' మనెడు నొక గ్రంథమును వ్రాసెనట! దాని పరిమితి యొక లక్ష యిరువదియైదువేల పదములు. ఇంతేగాక, 'పదార్ణవ' మనెడు మఱియొక గ్రంథము గూడ వారు రచించిరి. దానిపరిమితియుఁ బై దానియంతే! ఇట్టి బృహద్గ్రంథములే గాక సంస్కృత మహారాష్ట్రములలో వారు రచించిన పుస్తకములు కొల్లలు. ఈ విషయము మహారాష్ట్ర వాఙ్మయ చరిత్రమున 'ఏకనాథ కాల ఖండమందు' స్పష్టముగఁ జెప్పఁబడినది. మొన్నమొన్నటి ప్రాచీనకాలమందే, రెండున్నర లక్షల పదసంఖ్యగల మహాగ్రంథములను నిర్మాణమొనర్పశక్తిగల వారుండిరట! మఱి వ్యాసభగవానుని వంటి దివ్యప్రతిభాన్వితుఁడైన మహావ్యక్తి లక్ష శ్లోకముల గ్రంథమును వ్రాసెననుట యెందుకు నమ్మకపోవలెనో నా కర్థము గాలేదు.

భారతదేశము యొక్క సాంస్కృతిక వాఙ్మయమున మహాభారతమున కున్న స్థానము చాల గొప్పది. 'బ్రహ్మయజ్ఞ' మనెడు నొక యాహ్నిక క్రియ గలదుగదా! దానిలో మహాభారతమును బఠింపవలెనని పల్కుదురు. ఋగ్వేదమునకుఁ దరువాత నీ గ్రంథమునకున్న గౌరవము మరి దేనికిని లేదు. ప్రపంచమందలి గ్రంథములలో నింత విస్తృతిగలదియు మఱియొకటి లేదు. పాశ్చాత్య గ్రంథములలో "ఇలియడ్", "ఓడిస్సీ" యీ రెండును పరిమాణమున గొప్పగ్రంథము లందురు. ఈరెంటిని గలిపినను వానికంటెను శరీరమున నెనిమిది రెట్లు మహాభారతము; రామాయణమున కన్నను నాలుగంతలు గొప్పది. ఇంతేగాదు, హరివంశమునందు జెప్పఁబడిన 'ఖిలపర్వములు' కొన్ని యున్నవి. వానిని గూడ మహాభారతమున గలిపి లెక్కవేసినచో దాని శరీర మింకను బెరుగును. మహాభారతము కేవల

మొక గొప్ప కావ్యము మాత్రమే గాదు; అది మన "సాహితీసర్వస్వము". మన సంస్కృతి యొక్క చరిత్ర. ఈ యభిప్రాయమునే డా॥ వింటర్ నిడ్జ్ అను మహాశయులు తమ "History of Indian Literature" అను గ్రంథమున నిట్లు వాక్రుచ్చిరి.

"It is only in a very restricted sense that we may speak of the Mahabharat as an "Epic" and a 'poem'. Indeed in a certain sense the Mahabharat is not one Poetic Production as all, but rather a whole literature."

## గ్రంథము యొక్క స్వరూపము

మహాభారతమునఁ జెప్పబడినది కేవల కురుపాండవ యుద్ధమేనని కొంద రందురు. కాని, ప్రాచీనుల యభిప్రాయ మది గాదు. ఈనాఁడు ప్రచారమునకు వచ్చిన యూహ యిది. కురుపాండవ యుద్ధము మహాభారత రచనమున కొక నిమిత్తము మాత్రమే! దాని నాధారమొనర్చికొని వ్యాసభగవానుఁడు గ్రంథమున నాటి యార్య రాష్ట్రములనన్నిటిని బేర్కొనెను. వాని స్వరూపస్వభావములనన్నిటిని వివరించెను. మహాభారతమునకుఁ బ్రాచీనుఁడైన టీకాకారుఁడు నీలకంఠుఁడు. అతఁడు తన వ్యాఖ్యాన ప్రారంభమున నిట్లు బలికెను:

"ఇహ ఖలు భగవాన్ పారాశర్యః పరమకారుణికో మంద్ర మధ్యమమతీ ననుగ్రహీతుం చతుర్దశవిద్యాస్థానరహస్యా న్యేకత్ర ప్రదర్శయిషు ర్మహాభారతాఖ్య మితిహాసం ప్రణేష్యన్ ప్రారిప్సితస్య గ్రంథస్య నిష్ప్రత్యూహపరిపూరణాయ ప్రచయగమనాయ చ కృతం మంగళం శిష్యశిక్షాయై శ్లోకరూపేణ నిబధ్న న్నర్థాత్తత్ర ప్రేక్షావత్ప్రవృత్త్యంగ మభిధేయాది దర్శయతి."

పైదాని తాత్పర్య మిది. "వ్యాసభగవానుఁడు పరమకారుణికుఁడు. అతనికి సమాజమందున్న మానవు లందరిపైనను దయగల్గినది. అందుచే పరమదయాళువైన వ్యాసుఁడు వారి యుపయోగము కొఱకై పదునాలుగు విద్యల యొక్క

సర్వరహస్యముల నీ గ్రంథమున వివరించెను. ఇదియే మహాభారత నిర్మాణమునకు మూలకారణము. వ్యాసభగవానుఁడు మహాభారతము యొక్క మొదటి యధ్యాయమున, దాను జెప్పఁబోవు గ్రంథము యొక్క స్వరూపమును వివరించెను. ఆ ఘట్టమును జదివినచో భారతము యొక్క గౌరవమెంతటిదో మన కర్థమగును. ఆ శ్లోకము లివి:-

"తస్యాఖ్యాన వరిష్ఠస్య విచిత్ర పద పర్వణః

.... ..... ....

.... .... ....

నిరుక్త మస్య యో వేద స్సర్వపాపైః ప్రముచ్యతే"

(మహాభారతము, ఆది, మొదటి అధ్యాయము)

"యో విద్యా శ్చతురో వేదాన్ సాంగోపనిషదో ద్విజః

......

......

సాధో రివ గృహస్థస్య శేషా స్త్రయ ఇవాశ్రమాః

(మహాభారతము, ఆది. రెండవ అధ్యాయము)

పై శ్లోకములవలనఁ దేలినదేమి? మహాభారతము కురుపాండవుల యుద్ధగాథ మాత్రమే గాదు. అది యార్యుల తత్త్వజ్ఞాన, ధర్మశాస్త్ర, నీతిశాస్త్ర, రాజ్యశాస్త్రముల పేటిక. వ్యవహారశాస్త్ర, కామశాస్త్రముల సమావేశము. మన సంస్కృతి యొక్క సర్వస్వము. ఇంతయేల? మన జ్ఞానకోశము. ఇట్టి జ్ఞానకోశము యొక్క మహత్త్వమును నిస్సారమైన నాపలుకులతో విమర్శింపబూనుకొనుట పరిహాసభాజనమే గాదు - అపరాధము గూడ. ఈ యపరాధమునకు నన్ను మీరు క్షమింపవలెను. జ్ఞానదేవుఁడు "భావార్థదీపిక" యను తన భగవద్గీతా వ్యాఖ్యానమున మహాభారత గ్రంథ గౌరవము నిట్లు వర్ణించెను. "అది సకల కౌతుకములకును జన్మస్థానము. వివేక

తరువులు బెరిగిన యుద్యానవనము. సర్వసుఖములకును మూలము. జ్ఞానమునకు సముద్రము. పరిపూర్ణమైన నవరస సుధాబ్ధి. అది భూలోకమునకు దిగిన వైకుంఠము. సర్వవిద్యలకును మూలపీఠము. సమస్తములైన శాస్త్రములకును నొరపిడి రాయి. ధర్మములకుఁ బుట్టినిల్లు. సజ్జనుల జిహ్వా కలంకారము. శారదాదేవి యొక్క లావణ్యరత్నభాండారము. బాలభానుని యొక్క కాంతులు విరిసినంతనే మూఁడులోకములును స్పష్టముగ బ్రకాశించునుగదా! అట్లే వ్యాసుని మేధాశక్తి వికసించినంతనే దాని కాంతితో లోకమే ప్రకాశింపనారంభించెను. ఈ గ్రంథ మద్వితీయమైనది. సర్వపవిత్రమైనది. మాంగల్యధామము. దీని నవధరింతురుగాక!" (జ్ఞానేశ్వరి, అధ్యా.1). మహాభారత మనె డీగ్రంథరాజమందు ఆర్యుల రాష్ట్రదృష్టి, జీవనదృష్టి సమగ్రముగ వివరింపఁబడినది. వారి యాదర్శములలోని యాథార్థ్యము దిఙ్మాత్రముగ సూచింపఁబడినది. ఈ మహాగ్రంథము యొక్క మాధుర్యము విలక్షణము. ప్రౌఢి యనర్గళము. అందుకే యిది యనేక సహస్రవర్షములనుండి భారతీయుల హృదయములపై తన ప్రభావమును నెఱపుచున్నది.

అంతమాత్రమేగాదు. ఇతర దేశముల వారును భారతదేశమున బ్రవేశించిరి గదా! వారీ వాఙ్మయసముద్రమును జూచిరి. దీనియందలి యుపదేశరత్నములు వారి మనస్సుల లోఁగొనెను. వారి జీవన ధ్యేయములను గూడ మార్చెను. అట్టి యా గ్రంథగౌరవ మెట్టిదో కొంత విలోకింతము!

## మహాభారతము - దాని గొప్పతనము

భారతరచనానంతరము, దాని ప్రభావము భారతీయుల మనస్సులపైఁ నమితముగ బడెను. ఆ గ్రంథమునకు లభించిన గౌరవమపూర్వము. వ్యాకరణశాస్త్రము, మంత్రశాస్త్రము, రాజనీతి, వ్యవహార ధర్మములు ఆపద్ధర్మ, మోక్షధర్మములు తత్త్వగ్రంథములు ఒకటి యేమి? అన్ని విధములైన గ్రంథములందును, క్రీ. పూ. 500 సం॥ నుండి మహాభారతమును గురించిన ప్రశస్తి యేదో

యొకరీతి చోటు చేసికొనియేయున్నది. కావ్యములు, నాటకములు మొదలైన లలితకళలకు మహాభారతము కల్పవృక్షమైనది. విఖ్యాత మీమాంసకుఁడైన కుమారిలభట్టు, పూజ్యపాదుఁడైన యాచార్య శంకరుఁడు వేదముల కివ్వవలసినంత గౌరవమును మహాభారతమున కొసఁగిరి. వా రటనట దడవుచువచ్చిన భారత శ్లోకములకు లెక్కలేదు. భాసుని రచనలలో నించుమించు అన్ని నాటకములకును మూలకథలు భారతమునుండి గ్రహింపఁబడినవే! సంస్కృతవాఙ్మయము నందలి మహాకవులెల్లరును భారత కథలనో, దానిలోని యుపకథలనో యాధారముగ గొనియే గ్రంథముల రచించిరి. వ్యాసభగవానుఁడు గ్రంథారంభమున.

"ఇతిహాసోత్త మా దస్మాజ్జాయంతే కవిబుద్ధయః" అని పలికెను. ఆత్మవిశ్వాసమునకు సూచకమైన భగవానుని యీ మాట సర్వాత్మనా సత్యము. సంస్కృతమున గాళిదాసునకు గల గౌరవము మీఱెటిఁగినదే. అతఁడు శారదాదేవి యవతారమని ప్రసిద్ధి. ఆయన కవికుల గురువు. కాళిదాసుని యభిజ్ఞానశాకుంతలమునకు మూలకథ భారతములోనిదే. శాకుంతల నాటక మెంతటిదో నేను వేఱుగ జెప్పుట పనిలేని పని. ఆ మహాకవి ప్రతిభకు కాలమే నీరాజనమిచ్చినది. ప్రసిద్ధుఁడైన జర్మన్ మహాకవి 'గేటే' కాళిదాసుని శాకుంతలమును జదివి సంతోషమున గంతులువేయ నారంభించెనట. స్వర్గమర్త్యలోకముల యొక్క సౌందర్యమంతయు నొకచోట జేర్చిన సముదితస్వరూపమే 'శాకుంతల' మని యతఁడు బొగడెను. గీర్వాణమున మఱియొక మహాకవి మాఘుఁడు. ఇతఁడు రచించిన కావ్యము 'శిశుపాలవధ'. ప్రౌఢిమకు - అర్థగాంభీర్యమునకు నీ కావ్యము బెట్టినది పేరు. మహాభారతమందు "శిశుపాలవధ" కథ సభాపర్వమున వచ్చును. దావి నాధారముగ గొనియె యీ కావ్యము రచింపఁబడెను. హర్షుని నైషధము విద్వ దౌషధము. పాండిత్య దృష్టి కాతఁడు ప్రసిద్ధుఁడు. హర్షుఁడు రచించిన నైషధమునకు భారతము నందలి 'నలోపాఖ్యానమే' యొఱవడి. ఇఁక నెందరో కవులు మహాభారత కథల నాధారముగఁ జేసికొని మహాకావ్యములు, అల్పకావ్యములు, నాటకములు, నాటికలు మొదలుగువాని నల్లిరి.

# జగత్త్రయము - వ్యాసోచ్ఛిష్టము

భారతదేశము నందలి ప్రాచీన భాషలన్నియు - భారతము నాశ్రయించి కొనియే దమ కావ్యములను రచించికొని రంటివి. అట్లే, ఈ మహా గ్రంథమునకుఁ బరివర్తనములు గూడ జరిగినవి. అవి లోక ప్రియములు గూడ నైనవి. మహారాష్ట్రభాషయందు యోగీశ్వరుఁడైన జ్ఞానదేవుఁడు మొదలుకొని, ముక్తేశ్వరుఁడు, మోరోపంతు, వామన పండితుఁడు, రఘునాథ పండితుఁడు మొదలగు ప్రాచీన మహాకవు లందరును దమ ప్రతిభాసమున్మేషము కొఱకు మహాభారతమునే యాశ్రయించిరి. తక్కిన భాషలలో గూడ నింతే; ఆంధ్రజాతికి భారతము మహాప్రియమైది. సర్వాంగ సుందరముగ దానిని వారు తెనిగించికొనిరి. సంస్కృతమున భారతము నాశ్రయించికొని పుట్టిన రచనలకు లెక్కలేదు. రాజకీయ భావప్రచారములకు దేశనాయకు లెందరో భారతము నాశ్రయించిరి. కన్నడమున, 'పంపభారతము', కుమార 'వ్యాసభారతము', రన్నన గదాయుద్ధము మొదలగు వానికి విజ్ఞానభిక్ష బెట్టినది సంస్కృత భారత కల్పవృక్షమే. కల్పనాత్మకమైన కావ్య మార్గమునకు గాక నిత్యజీవితమున గూడ మహాభారతము మనకు ఆరాధ్యము, ఆశ్రయము. ప్రతి ధర్మమును భారతమును జూచి మనము నిర్ణయించి కొన్నదే. దానియందు వర్ణింపఁబడిన కథలనుండి నీతులు నేర్చికొంటిమి. మొన్న మొన్నటి వఱకును, యుద్ధ విషయములలో గూడ భారతమునఁ జెప్పఁబడిన వ్యూహరచనా పద్ధతియే బ్రచారమున నుండెను. జగజెట్టియైన యలెగ్జాండరు భారతదేశమునకు వచ్చినపుడు మన రాజులు భారతము నందలి యుద్ధ విధులనే యనుసరించు చుండిరి. అలెగ్జాండరు లోకైక వీరుఁడు. అట్టి వానిని గూడ వెనుకకుఁ దరుమ గొట్టినది నాటిప్రజ యేర్పాటు జేసికొన్న శకటవ్యూహ రచనయే! ఆ రచన

భారతము లోనిదే. మన వ్యష్టి సమష్టి ధర్మములకు నిర్ణయ గ్రంథము మహాభారతమే. విధి విధానములు, ప్రాయశ్చిత్తములు ఆ గ్రంథమును బట్టియే నిర్ణయించి కొందుము. ఆబాలవృద్ధులైన స్త్రీపురుషుల వైయక్తిక గృహ్యా సామాజిక కర్తవ్యములు వారి జీవము నందలి యాధ్యాత్మిక సాధ్య సాధనములు - చాతుర్వర్ణ్యాత్మకమైన సమాజరచన, దాని కర్తవ్యములు, వీని నన్నిటిని తేల్చి చెప్పుటకు ఆధార గ్రంథము భారతమే. [illegible] సాంస్కృతిక జీవనమున మహా భారతమునకుఁ జెల్లిన యీ యధికారము నాటిది నేటిది గాదు. అనేక సహస్ర వర్షముల నుండి యీ గౌరవ మిట్లే యప్రతిహతముగా వచ్చినది. భారతదేశమున నిర్మింపఁబడిన 'భక్తి సంప్రదాయము' అనేక శతాబ్దములనుండి మన హృదయములను రస పరవశముగ నొనర్చు చున్నది. దేశ మధఃపతితమై పోవుచున్నపుడు దానిని బునరుజ్జీవింపఁ జేయుటకై యోగీశ్వరుఁడైన జ్ఞానదేవుఁడు సర్వసాధ్యమైన, సులభతమమైన యీ దివ్యకల్పవృక్షమును బ్రచార మొనర్చెను. అతని దివ్యవాణి ననేక సత్పురుషు లందికొనిరి. గోస్వామి తులసీదాసు, సూరదాసు మొదలైన మహానుభావు లెందరో జ్ఞానదేవుని భక్తి పంథకు రూపురేకలు దిద్దిరి. దళితమై పోయిన రాష్ట్రీయ ధర్మమును బునరుజ్జీవింపఁజేసిన నిత్యముక్తులు వారు. వారి కాధారగ్రంథము భారతము, భగవద్గీత. మొన్న మొన్నటి తిలకు కర్మయోగ మనెడు విజయశంఖమును మ్రోగించెను గదా! అతఁడు లుప్తప్రాయమైన రాష్ట్రధర్మమును ఉజ్జీవింపఁ జేయుటకే గీతా రహస్యమును రచించెను. తిలకున కా యావేశ మొసఁగిన గ్రంథము మహాభారతమే. గీతారహస్యము భారతదేశము నందలి నైతి కాధ్యాత్మిక భావములను బునః ప్రతిష్ఠించుట కెంతయో తోడ్పడెనని, వంగదేశమున క్రాంతికారు లందఱును దలఁచిరి. అంతర్జాతీయ విఖ్యాతిగల రాజకీయ నాయకులెందరో యీ భావమును బ్రకటించిరి. మహాభారతమున కున్న రక్తి దేశకాలాబాధితమైనది.

ప్రతి యుగమునందును, ప్రతి సమస్యకును గావలసిన యుత్తరము లా మహా గ్రంథమునందు గలవు. అందుకే జ్ఞానేశ్వర మహారాజు జగత్త్రయము వ్యాసోచ్ఛిష్ట మనెను. ఆ పల్కు సత్యముగ ననెను. మహాభారతమున నీవాక్య మున్నది.

"య దిహాస్తి త దన్యత్ర య న్నేహాస్తి న తత్ క్వచిత్"

ఈ గ్రంథమున బ్రతిపాదింపఁ బడినదే సమస్త విశ్వము నందును గలదు. దీన జెప్పఁబడనిది విశ్వమున నెందును నుండదు" యని పై శ్లోకమున కర్థము. అనఁగా - ప్రపంచమునందలి సర్వవ్యాపారములు వాని శాశ్వతములు, నశాశ్వతములునైన ప్రేరణములు, వీని స్వభావములు అన్నియు, భారతమున సూచింపఁబడినవని తాత్పర్యము. నామరూపములయందు భిన్నత యెంతయున్నను సాధనములు, వాని బాహ్య స్వరూపములు, నివి యెంతగా భేదించినను, తాఱుమాఱైనను, సామాజిక, వైయక్తిక మనోవృత్తి, దాని నైసర్గిక వ్యాపారము, అనాదికాలమునుండి యొక్కటేనని మన శ్శాస్త్రజ్ఞులందురు. బాహ్యవిష్కారములయొక్కయు, సాధనములయొక్కయు, భిన్నతల ననుసరించి, యా వ్యాపారములు వేఱువేఱైనట్లు గన్పట్టును. ఆ భిన్న వ్యక్తీకరణములయొక్క వర్ణనమే దేశ చరిత్ర. కాని, బాహ్యములైన యీ భిన్నత లన్నియు, మానవ ప్రవృత్తులకు కవచములు మాత్రమే! అంతఃప్రేరణ, దాని సంఘర్షణము మాత్రము భిన్నము గాదు. మహర్షియైన వ్యాసుఁ డీ రహస్యమును జక్కగా గమనించెను. భిన్న వ్యక్తులయందు విభిన్న ప్రవృత్తులలో నివి యెట్లు భాసించునో పరిణమించునో యతఁడు తీవ్రముగ నాలోచించినాఁడు. ఆలోచించి వాని పరిణామములనే యుజ్జ్వలములైన కథలలోఁ జొనిపెను. అతఁడు వ్రాసిన కథ లపూర్వములైనవి. మానవ జీవితమునందును, సామాజిక జీవితమునను గలుగు సంఘర్షణము లన్నిటిని యవి దడవినవి. నామ రూపములు మాఱవచ్చును; దేశకాలములు

మాఱవచ్చును; కాని వ్యాస భగవానుఁడు జెప్పిన సన్నివేశములు, మానసిక యుద్ధములు, గొంతకుఁగొంత ప్రతి వ్యక్తియందును, సంఘమునందును సంభవించునవే! అతఁడు వర్ణించిన యంతఃకరణ ప్రవృత్తులు నాఁడే గాదు నేడుగూడ మానవునియందు, సంఘమందు ఉన్నవి. కనుక భారతము నుద్దేశించి, జ్ఞాన దేవుడు "దీనియందు లేని విషయము మఱి యెక్కడను లేదు" అన్నమాట చాల సార్థకమైనది.

## భారతము నవరస సుధాబ్ధి

కావ్య దృష్టితోఁ జూచినచో మహాభారతము నవరసములకును బట్టుగొమ్మ. ఆ రసక్షేత్రమునం దన్ని రసములును సమర్థముగఁ బ్రోది సేయబడినవి. సర్వత స్సుందరముగ నున్నవి. వాని నట్లావిష్కరించిన వ్యాసభగవానుని ప్రతిభ కే మహాకవియైనను, దలవంచి తీరవలసినదే! శృంగారము రసరాజముగదా! దానిని నలోపాఖ్యానము వంటి చరిత్రలలో, వ్యాసుఁడతిమనోహరముగ, సహృదయరంజకముగ నిర్వహించెను. దాని పొంకమునకు వలచి, కవులెందరో, యా గాథ ననుసరించిరి. చంపూకారులా యుపాఖ్యానమును బునరావర్తించిరి. శబ్దార్థముల పార మెఱిఁగిన యితర కళాకారు లెందఱో నలదమయంతుల కథను వివిధ రూపములలోఁ జిత్రించికొన్నారు. నేటికిని దాని సౌందర్య మారలేదు. బిగువుఁ దీరలేదు. భావికవులు కూడ గైకొనదగిన వెన్నియో మెలకువలు దానియందున్నవి. ఆ నందన వనమునందలి పుష్పము లెన్నియో నేటికిని, పూర్వ సుకవి భ్రమరములచే ననాఘ్రాతములే. కవితా తత్త్వవేత్తయైన వ్యాస మహర్షి కురుపితామహుని రూపమున, నుత్తమ వీర రసము నావిష్కరించినాడు. దాని వెలుఁగు లపూర్వములైనవి. భీష్మ పర్వమంతయు వీరరసముయొక్క యుజ్జ్వల తాండవమే! తక్కిన కవులు వీరరసమును వర్ణింపవలసి వచ్చినపుడు దానిని రౌద్ర భయానకములతోఁ జేర్చి వర్ణింతురు. వ్యాస భారతమున

నట్టి ఘట్టములు గూడ నున్నవి. ద్రోణపర్వము నందలి యభిమన్యుయుద్ధము శబలితమైన వీరరసము ననన్యసామాన్యముగ బోషించెను. కాని భీష్మపర్వము నందలి వీరరస మింతకన్నను భిన్నమైనది. ఆ రస మా ఘట్టమున నేమాత్రము శబలిత మొనర్పఁబడక దాని సహజ స్వరూపముతోఁ బోషింపఁ బడెను. ఇతరరసములతో నంగాంగీభావముఁగూడ దానికి లేదు. భీష్మ పర్వమునందలి వీరరసమునకున్న వైశిష్ట్య మదియే. సంస్కృతాలంకారికుల సంప్రదాయము ననుసరించి వీరమునకు స్థాయిభావముత్సాహము. అనేక మహాకవుల కావ్యములందుఁ బ్రారంభింపఁబడిన వీరరసము కడవర కట్లే నిర్వహింపఁబడుటలేదు. కొంతదూర మేగిన పిమ్మట నది యే రసమో యైపోవును. కాకున్న వీరము రౌద్రముగ మారును. దీనికిఁ గారణమేమి? వీరమునకు 'స్థాయి'యైన యుత్సాహము సాధారణముగ దాని సహజ స్వరూపముతో నెక్కడను దొరకదు. అందుచే నా వీరరసమున మఱియొక టేదియో జోటు చేసికొని తీరును. యుద్ధము లేనిది వీరరసమును వర్ణింపలేముగదా! పరస్పరము క్రోధావేశములు లేనిది యుద్ధము లెట్లుండును? ఉత్సాహము కొఱకును, ఉల్లాసమునకును యుద్ధము లెవ్వరును జేయరు. కాని భీష్మపర్వమున మాత్రము అట్టి యుద్ధమొకటి తటస్థపడినది. ఆ పర్వమునకు నాయకుఁడైన భీష్మునకు మనస్సున పాండవులపైఁ గినుకలేదు. అతని మనస్సు నాక్రమించినది కేవలము క్షాత్ర ధర్మపరిపాలనా రూపమైన యుత్సాహము మాత్రమే! పాండవులపై నాతని కాదరము గూడ కద్దు. పాండుకుమారుల వైపు నిలిచిపోరుచున్న క్షత్రియులు మహా తేజస్సంపన్నులు. ఈ విషయమున వారిపై నాతనికి వాత్సల్యము, మెప్పునుగూడ నుండెను. పరిశుద్ధమైన యిట్టి యుత్సాహమును, శబలితముగాని యిట్టి వీరరసమును బోషించు సామర్థ్యము వ్యాసభగవానుని ప్రతిభకే జెల్లినది. ఇట్టి దుర్ఘటమైన పనికి జేయివేసిన కవి మఱియొకఁడు లేడు; వేసి నెగ్గినవాఁడును లేఁడు.

మహా భారతమందలి కరుణరసావిష్కారమును సాటిలేనిది, అలౌకికమైనదియు. నడుమ నడుమ వచ్చు నుపకథలలోఁ గూడ వ్యాసభగవానుఁ డెంతయో మెలకువతో నవరసములను నిర్వహించెను. ఇఁకఁ బ్రధానకథయం దాతఁడు రసావిష్కారము నఱకొరగాఁ జేయునా? అభిమన్యుఁడు మరణించినాడు. ఆ మహావీరుని మరణమునకు, సుభద్ర, కుంతి, ద్రౌపది మొదలగు వారెల్లరు గోడు గోడున నేడ్చిరి. పాండవేయుల దుఃఖమునకు మితిలేక పోయెను. నాఁడు పాండవ శిబిరము స్మశాన శాంతిని గైకొనెను. అర్జునుని యేడ్పునకు మనుష్యులేమి? శిలలే విలపించినవి. అపారమైన పరాక్రమమును బ్రదర్శించిన తరువాత దానినుండి యుత్పన్నమగు కరుణ రసాత్మకమైన వాతావరణము యెట్టివారి హృదయమునైనను లోఁగొనును. ప్రళయమువలె ముంచుకొని వచ్చు భారత యుద్ధమున వీరరసావతారులైన క్షత్రియులెందరో మరణించిరి. ఆ మహావీరుల మరణము, దేశమునకు, వారి యంతఃపురములకు, కుటుంబములకు గర్భవేధకమైనది. వారి గోడును వర్ణించుటకే వ్యాసభగవానుఁడు స్త్రీపర్వమును వ్రాసెను. ఆ భాగము కరుణ రసమున సముద్రము. యుద్ధావసరమున ధర్మరాజునకుఁ గర్ణుఁడు దన యన్నయని తెలియదు. కర్ణునిచావు తరువాత కుంతి ధర్మజునితో "గర్ణుఁడతని యన్న యగు"వని జెప్పినది. అపుఁడాతని విలాపము హృదయమున్న మానవుని నెల్ల నేడ్పించును. ద్రౌపదీ వస్త్రాపహరణమువందలి కరుణామయ దృశ్యము, అట్టి సన్నివేశము భారత చరిత్రలోనే గాదు. మఱి యే వాఙ్మయమందును లేదు. ద్రౌపది సామాన్యురాలు గాదు. ఆమె భారతదేశ సామ్రాజ్ఞి. ఆ పదమునకు విధి పూర్వకముగ నంతకు ముందే యామె కభిషేకము జరిగినది. అంతేనా? పూర్ణావతారుఁడైన కృష్ణ పరమాత్మకు సుభద్రకంటెను ద్రౌపదిపై గౌరవ మెక్కువ. ప్రేమ యెక్కువ. అతఁడామెను జెల్లెలుగా సంభావించెను. ఇట్టి 'యాజ్ఞసేనిని' యొకానొక దుర్మదాంధుఁడు వెంట్రుకలను బట్టి యీడ్చుకొని వచ్చెను. వాని

చేతులనుండి తన కొప్పును వదిలించికొనుట కామె చేసిన ప్రయత్నములు వ్యర్థ ప్రయత్నములే యైనవి. ఆ మహాసాధ్వికన్నులయందు నీరు వాన కాళులు గట్టినది. అట్టి నిస్సహాయ స్థితియందున్న త్రిలోక పూజ్యారాలైన ద్రౌపది సభలోనున్న కురు వృద్ధులయెదుట నిలిచి "నేను దాసినైతినా" యని ప్రశ్నించినది. అప్పుడుగూడ నామెకు ధర్మజిజ్ఞాసయే! ఈ సన్నివేశమును జదువునప్పుడు గనుల దడివెట్టని మనుష్యుఁడు పశువైనను గావలెను. కాక యే భావవికారమును లేని ముక్తుడైనను గావలెను. మూఁడవ రకము వారంద రేడ్వవలసినదే!

ఘటోత్కచుని యుద్ధము భగవద్గీతయందలి విశ్వరూప దర్శనము. ద్రౌపదికి కృష్ణుఁడు వలువ లొసఁగిన సన్నివేశము, అరణ్యపర్వమున భీమునకు హనుమంతుఁ డొసఁగిన దర్శనము యీ ఘట్టములన్నియు యద్భుతరసమున కుదాహరణములు. కీచకుని భీముఁడు సంహరించెను. ఆ తరువాత కచ్చితో భీముఁడు కీచకుని శరీరమునకు పట్టించిన యవస్థ, దుస్ససేనుని గుండెలు జీల్చి భీముఁడొనరించిన రక్తపానము, యీ కథలన్నియు, భయానకములు. ఈసన్నివేశములను జదువునప్పుడు, కొంచెము పిఱికివారైనచో భయపడివలసినదే! బీభత్స రసము గూడ భారతమున గావలసినంత చోటు చేసికొన్నది. యుద్ధ క్షేత్ర వర్ణనమంతయు, నీ రసమున కుదాహరణమే! రణభూమియందు రక్తప్లుతములైన నాల్కలతోఁ బిశాచము లాడుచుండును. గ్రద్దలు మాంసములను క్రొత్తక్రొత్త లేరి తినుచుండును. పక్షులు క్రవ్యాదులు వికటముగ నరచుచున్న యా రణభూమి యందంతయు, బగిలిన పుఱ్ఱెలు, నొగిలిన తలలు, తఱచైన ప్రేవులు, ముసరుకొన్న సేనాంగములు, ఈ సన్నివేశము నంతయు, వ్యాసుని ప్రతిభ సాక్షాత్తుగ మన కన్నుల యెదుట స్ఫురింపజేసినది. కొంద రాలంకారికులు బీభత్సమునకు రసత్వమునే యంగీకరింపరు. దానికి చర్వణయోగ్యతయే లేదని వారి యూహ. మహాకావ్యమునకు విషయము గావలసినంతటి యోగ్యత,

బీభత్సరసమునకు లేదని వారి సిద్ధాంతము. కడకు వారు వాదవివాదములతో బీభత్సమును రసభూమి నుండి బూర్తిగ బహిష్కరించిరి. వ్యాసభగవాను లీ యాలంకారికుల ప్రశ్నలన్నిటికిని సమాధానముగ నీ ఘట్టములను వ్రాసెనా! యనిపించును. ఆతని కవితాదక్షతచే బీభత్సమునకు రసత్వము సిద్ధించినది. బీభత్సము సహృదయు లనుభవించుటకుఁ దగిన రసమైనది. మహాకావ్యమునం దీ రసమునకుఁ జోటు లేకపోలేదని వ్యాసు లుదాహరణ పూర్వకముగ నిరూపించిరి. వ్యాసుఁడు గాక, మరి యే మహాకవి యీ కార్యమునకుఁ బూనుకొన్నను అతఁడు తప్పక విఫలుఁ డయ్యెడివాడే! అశ్వత్థామ సౌప్తిక వధ యొనర్చెను. ఆతని యుద్ధము తరువాత పాండవ శిబిరమంతయు శ్మశానమైనది. ఆవర్ణనము బీభత్సరసమువ కుదాహరణమే! ద్రోణపర్వమున రౌద్రరసము దాని సర్వస్వరూపముతోఁ బ్రత్యక్షమగును. శాంతిపర్వము, భగవద్గీత వీనిలో శాంతరసము పుంజీభవించినది. శాంతరసమనగా సర్వేంద్రియ ప్రవృత్తుల లీనత. శాంతిపర్వము నందలి కొన్ని కథలలో నీ రసము పరాకాష్ఠకుఁ గొంపోఁబడెను. వ్యాసుల హాస్యరసము సందర్భమునకుఁ జక్కగా నతికి యుండును. గావ్య ప్రకాశవారు అట హాస్యరసమునకుఁ జక్కని యుదాహరణములకై యేవేవో పోఁకల బోయెను. భారతమునందలి విష్ణుశర్మ పాత్రము నాతఁ డెందు కుదాహరింపలేదో? కీచకుని వధించుటకై భీముఁడు ద్రౌపదియుఁ జీకటిలో నర్తనశాలను జేరిరి. భీముఁడు మంచముపై శయనించి యుండెను. ఇంతలోఁ గీచకుఁడు వచ్చినాఁడు. భీముని శరీరము నాతఁడు దాకెను. తల్పముపై శయనించినది సైరంధ్రియే యని కీచకుని యభిప్రాయము పాపము! అప్పటి వారి సంభాషణము హాస్యరసమువకు మేలైన యుదాహరణము. "తన యొడలు సేర్చినప్పుడు కీచకుని యొడ లెట్లగునో! పోల్చి చూచుకొమ్మని" భీముఁడు నర్మగర్భముగ బలుకును. ఆదిపర్వమునందలి ఒక వధ సందర్భమున నొక సన్నివేశమున్నది.

ఏక చక్రపురమున పాండవులొక బ్రాహ్మణు నింట నుండిరి. బకున కాహారముగ బోవలసిన వంతు వారింటికి వచ్చినది. కుటుంబమంతయు నొకచోట గూర్చుండి యేడ్చుకొనుచుండిరి. ఆ బ్రాహ్మణున కొక కుమారుఁ డుండెను. వాని వయస్సు మూడు నాలుగేండ్లు. వాఁడు తన చేతనున్న బెత్తమును దండ్రికి జూపుచు "దీనితో బకుని జంపుదు"నని యన్నాఁడు. అంతటి దుఃఖములో గూడ నా కుటుంబ మా బాలకుని మాటలకు నవ్వినది. హాస్యరసమును జక్కగ పోషించిన సన్నివేశములు మహాభారతమున నెన్నియో వచ్చును. వ్యాసభగవానుఁడు బోషింపని రసము లేదు. ఏ రసమును వర్ణించినను, అతఁ డెంతయో సమర్థముగ దానిని నిర్వహించును. మహాభారతమున లేని రసము లేదు. అన్ని రసతరంగిణులును ఆ క్షీరాబ్ధిలో సంగమించెను. వ్యాసునిసృష్టి యగాధమగు నొక క్షీరసముద్రము.

భారతమున నున్న స్వభావ వర్ణనలకు లెక్కలేదు. ఆ పాత్రల స్వభావములు భారతీయుల కాదర్శములు. మహాభారతము నందలి యుపాఖ్యానములలో జనులకుఁ గావలసిన యెన్ని విషయములనో వ్యాసభగవానుఁడు సూచించెను. ఉపాసనా సంప్రదాయములనుఁ గూడ నాతఁడు నిర్వచించినాఁడు. సావిత్రీ సత్యవంతుల కథలో వ్రతవిధానము నెంతయో ముచ్చటగ మహర్షి నిరూపించెను. విష్ణు సహస్రనామము, శివ సహస్రనామము వంటి స్తోత్రములు భారత కథలో కుప్పలు తెప్పలు. వాని నన్నిటిని భారతీయ లాయా సంప్రదాయముల ననుసరించి దినమును బారాయణ మొనర్చికొందురు. ఆ స్తోత్రములు వాంఛితార్థ ఫలప్రదములు. ఈ విషయము నేటికిని సాధకుల కనుభవములో నున్నదే! మహాభారత కథను నడిపిన ప్రధాన సూత్రధారి శ్రీకృష్ణుడు. అతని నెంత వర్ణించినను తక్కువయే! శ్రీకృష్ణుఁడు పూర్ణావతారుఁడు. మంత్రశాస్త్రము నందలి సర్వసాధన మార్గములకు నుపాస్యుడైన మాతఁడే. భారతీయులు మాత్రమే గాదు.

హిందూస్థానమునకు వచ్చి నివాస మేర్పరచుకొన్న యితర జాతులు గూడ గృష్ణుని రూపమును వలచెను. వర్తనమునకు ముగ్ధమయ్యెను. భక్తి సంప్రదాయమున కధిష్ఠాత యాతఁడు. ఆతని చరణములయందు విలీనుఁడగుటయే మానవుని ధన్యత. అమాయకులైన భక్తులు మొదలు తత్త్వజ్ఞులవఱకును, కుటిల రాజనీతిజ్ఞులు మొదలు శుద్ధసాత్త్వికులైన ధర్మనిష్ఠుల వరకును సర్వకాలము లందును సర్వుల హృదయములకును ఆకర్షణ కేంద్రమయినది కృష్ణభగవానునియొక్క పూర్ణావతారమే!

## గీతా మాహాత్మ్యము

మహాభారతము నందు గీతోపదేశమునకు దొఱకిన సన్నివేశ మమూల్యమైనది. అట్టి సన్నివేశమును సంపాదించుకొను నదృష్టము మఱియే ధార్మిక గ్రంథమునకుఁ బట్టలేదు. రేడియం ధార్మిక కణముల స్ఫురణశీలతవలె గీతాదేవి మాహాత్మ్యము సర్వకాలములందును సర్వమానవ హృదయముల నాకర్షించుచుండును. తక్కిన శాస్త్రములన్నియు గీతా శాస్త్రమునకు దలవంచినవి. దానికి ప్రథమ తాంబూల మొసఁగినవి. మోక్షోపాయమును బోధించు ధర్మ గ్రంథములలో భగవద్గీత యగ్రేసరము. ఈ విషయము నతి ప్రాచీనకాలమునుండియు విద్వాంసు లంగీకరించిరి. కాశ్మీర రాజైన 'అవంతివర్మ' మరణశయ్యపై భగవద్గీత నంతయు విని మరి మరణించెనట! కాశ్మీరదేశము యొక్క యితిహాసమున నీ కథ ప్రసిద్ధము. భారతీయుల ముఖ్య గ్రంథములు ప్రస్థానత్రయము. వానిలో నుపనిషత్తులతో పాటు భగవద్గీతయుఁ జేర్పఁబడినది. పూజ్యపాదులైన శంకరు లుపనిషత్తులపై అద్వైత సిద్ధాంత ప్రతిపాదకమైన వ్యాఖ్య గావించిరి. వారంతటితో నూరకుండలేదు. భగవద్గీతను గూడ వ్యాఖ్యానించినారు. ఎప్పుడెప్పుడు భారతదేశ మాత్మశక్తిని గోల్పోయినదో, యప్పుడపు డంతయు దేశమునకు నూత్న తేజస్సు నొసఁగి దానిని బునరుజ్జీవింప జేయుటకై, యవతార పురుషులవంటి మానవులు ప్రయత్నించిరి. వారు గీతాశాస్త్రము నాశ్రయించియే తమ దివ్యసందేశముల

నొసఁగిరి. శంకరులు, తమ యద్వైత మత ప్రతిష్ఠాపనముకై భగవద్గీతనే యాధారముగఁ గొనిరి. జ్ఞానేశ్వరమహారాజు భగవద్గీత నాశ్రయించియే భాగవత ధర్మములను బ్రచారమునకు దెచ్చెను. మొన్నటి లోకమాన్యతిలకుగారు, గీత నాశ్రయించియే తమ సముచ్చయ వాదమును బ్రతిష్ఠించిరి. నేటికిని గీత నాశ్రయించియే, యనేక మహానుభావులు దమ సిద్ధాంతము ప్రచారము జేయుచున్నారు. భగవద్గీత యొక నందనోద్యానము. ఆ పుష్ప సౌరభముల కెన్నడును తఱుగులేదు. ఇక నెంతమంది యైనను, భగవద్గీతపై తమ వ్యాఖ్యానములు వ్రాయవచ్చును. ఎంతమందికో స్ఫురణాశక్తిని దానముసేయఁగల గొప్పతన మా శబ్ద సంవత్తికున్నది ఆ భావముల కా తేజస్సు గలదు. 'అల్బరూనీ' అరేబియా నుండి వచ్చిన రాయబారి. అతని హృదయమును గీతాశాస్త్ర మాకర్షించినది. జ్ఞానేశ్వరుఁడు గీతపై 'జ్ఞానేశ్వరీ' వ్యాఖ్యానమును రచించెను. విఖ్యాతుఁడైన వామన పండితుఁడు 'యథార్థదీపికను' వ్రాసెను. 'దానోపంతు' వ్రాసిన వ్యాఖ్య 'గీతార్ణవము'! తుకారాముడు మంత్రార్థగీతను లిఖించినాఁడు. వామన పండితుఁడు, 'సమశ్లోకిని' వ్రాసెను. గీతాశాస్త్రమునకు హిందీ యనువాదములున్నవి. ప్రాచీనములైన సర్వసంప్రదాయములును, గీత నాశ్రయించికొనియే ప్రచారమునకు వచ్చినవి. ఈనాఁడు విఖ్యాతులైన 'లోకమాన్యుఁడు అరవిందయోగి', మొదలగువారి భావస్ఫూర్తికి గీతాశాస్త్రమే యాకరమైనది. ఇంతమందికి భగవద్గీతపై నీ చూపేల?. ఆ గ్రంథము యొక్క మహిమ యట్టిది. ఇకమీదనైనను, యే సిద్ధాంతము ప్రచారమునకు రావలసినను భగవద్గీత నాశ్రయించికొని రావలసినదే. ధర్మాసక్తి సంపూర్తిగ తగ్గిపోవుచున్న యీనాఁడు గూడ భగవద్గీతయొక్క లోక ప్రియత్వము మాత్రము తగ్గుటలేదు. నేటికిని దానిపై వ్యాఖ్యానములు, వివరణములు బుట్టుచునే యున్నవి. మన ధార్మిక గ్రంథములలో భగవద్గీత యొక యనర్ఘ రత్నమువంటిదని లోకమాన్యులన్నారు. ఆమాటకు సందేహములేదు.

# రామాయణము - మహాభారతము

రామాయణము, భారతము, యీ రెండును భారతీయుల రాష్ట్రీయ గ్రంథములు. రామాయణము మన సాంస్కృతిక జీవనమును విశదపరచు నొక యమూల్యమైన యితిహాసము. మహాభారతమన్ననో, మన సాంస్కృతిక జీవనము యొక్క సర్వస్వము. అది మన జ్ఞానకోశము. రామాయణము మానవ జీవితముయొక్క యాదర్శనమును మాత్రమే దెలుపును. మహా భారతము యొక్క పని యింకను గష్టమైనది. వ్యాస భగవానుఁడు మానవుని యసంపూర్ణతను, అశక్తతను జక్కగ గమనించెను. జీవితమున మనుష్యునకు సంభవించు విషమ పరిస్థితులను లోతుగ నర్థము జేసికొనెను. చేసికొని యట్టి క్లిష్టపరిస్థితులలో మానవుఁడు జంకక, ధర్మనిర్వహణ మొనర్చికొని ముందునకు బోవు మార్గములను సూచించినాఁడు. ఈ రెండు గ్రంథములును భారతీయులకుఁ బ్రాణముల వంటివి. ఈ రెంటిని భద్రముగ సంరక్షించుకొనుచున్నంత వఱకు భారతీయుడాధ్యాత్మిక విషయములకై, యితరులను యాచింప వలసిన యవసరము లేదు. సమస్త ప్రపంచమునకును శాంతి భద్రతలను బోధించు శక్తి యీ మహాగ్రంథముల కున్నది. వీని సాయమున భారత జాతి ధర్మ నిష్ఠమై, శక్తివంతమై, యే కాలము నందైనను ముందున కేగవచ్చును. కాని, మన దురదృష్టము కొలఁదియు, నీ రెండు గ్రంథములను మనః ఫలకములపై జిత్రించికొనగల శక్తి భారతీయులలో నానాటికి సన్నగిలి పోవుచున్నది. దీనికి గారణములు ముందు వివరింతును.

మహా భారతము యొక్క మహాత్త్వము కేవల భారతదేశము వఱకేగాదు. అన్యదేశీయులును దాని గొప్పతనమును, నతి ప్రాచీన కాలముననే గ్రహించిరి. క్రీ.శ. రెండవ శతాబ్దము నాటికే గ్రీకు వాఙ్మయమున భారతము బ్రవేశించినది. దానిని గుఱించిన పొగడ్తలు యుల్లేఖనములు యా వాఙ్మయము నందున్నవి.

క్రీ.శ. ఆఱవ శతాబ్దము నాటికి కాంబోడియా యందలి దేవళములందు భారతము సంపూర్ణముగ జదువు నాచారముండెను. క్రీ.శ. ఏడవ శతాబ్దమున 'మంగోలియా' 'టర్కీ' భాషలలో హిడింబవధ వంటి సన్నివేశములు కావ్యములుగా వ్రాయఁబడి పాడఁబడు చుండెను. పదియవ శతాబ్దము నాటికే మహా భారతమును జావాద్వీపము వారు స్వభాషలోనికిఁ బరివర్తించి కొన్నారు. క్రీ.శ. 1819లో "ఫ్రాన్జ్ బాప్" యను నొక విద్వాంసుఁడు మహా భారతము నందలి నలోపాఖ్యానమును పాశ్చాత్య భాషలోనికిఁ బరివర్తించెను. ఆ కథయొక్క సౌందర్యమునకు ముగ్ధులైన పాశ్యాత్యులు 'ఉత్తమోత్తమసాహిత్య" మని దానిని బొగడిరి.

పాశ్చాత్యదేశము లందలి కళాశాలలలో సంస్కృతాభ్యసనము నలోపాఖ్యానముతోనే యారంభింపఁ బడుచున్నదట! ఈ విషయమును డాక్టర్ వింటర్ నిడ్జ్‌గారు తమ గ్రంథమున దెలిపిరి. నలోపాఖ్యానము జర్మన్, ఇంగ్లీషు, ఫ్రెంచి, ఇటాలియను, భాషలలోనికిఁ బరివర్తిత మయ్యెను. స్వీడిషీ, జెక్, భాషలలోని కది పరివర్తింపఁబడెను. పోలిషీ, రష్యన్ భాషలలో నది యున్నది. ఆధునిక గ్రీకు భాష 'హంగేరియన్' భాషలలో గూడ దాని పరివర్తనములు గలవు. 'జిబ్రాన్‌టిస్' మహాశయుఁడు 1861లో నలోపాఖ్యానమును ఫ్రెంచి భాషలో నాటకముగ వ్రాసెను. దాని నా దేశమున బ్రదర్శించిరి. నలోపాఖ్యానముపై A. W. V. Schlegel మహాశయుఁడు యీ రీతి యభిప్రాయ మొసఁగెను.

"I will only say that in my estimation this poem can hardly be surpassed in pathos and ethos in the enthralling force and the tenderness of the sentiments. it is made expressly to attract old and young, the high born and the lowly, the connoisseurs and those who are merely guided by instincts."

ఋష్యశృంగుని కథ బుద్ధుని జాతక కథలలోనికిఁ బ్రవేశించినది. చీనా, టిబెట్టు, జపాను మొదలగు దేశములం దీ కథ బాగుగా బ్రచారమైనది. డాక్టర్ వింటర్ నిడ్జ్ మహాభారతము నందలి 'విదుల' యొక్క వీరగాథ, ద్రోణపర్వము

నందలి రాత్రి యుద్ధము యొక్క వర్ణనము, స్త్రీ పర్వము నందలి గాంధారి యొనర్చు రణభూమి యొక్క వర్ణన, యీ ఘట్టములం దెంతయో భావ ముగ్ధుడైనాఁడు. 'సావిత్రికథ' లోని సౌందర్యమున కాతఁ డచ్చెరువందెను. ద్రోణపర్వమునందలి రాత్రియుద్ధ వర్ణనలో నాతఁడు వ్యాసుల శైలి, కాళిదాసుని యొక్క చాటు పద్ధతుల శైలితోఁ దులతూగుచున్న దనెను. గాంధారి యొనర్చు యుద్ధవర్ణనమును జదివిన డాక్టర్ వింటర్ నిడ్జ్ యా కవితా సౌందర్యమునకు, ముగ్ధుఁడయ్యెనంటిని. అతఁడొసఁగిన యభిప్రాయ మీ క్రిందిది.

"Here follows the lament of Gandhari which is one of the most beautiful parts of the whole epic as the master piece of elogiac poetry, as well as for the clear description of the battle field recalling the pictures as a wereschagin. The whole scene becomes so much the more impressive owing to the fact that the poet does not himself tell the story but lets the aged mother of heroes recount what she sees with her own eyes."

సావిత్రికథ పై డాక్టర్ వింటర్ నిడ్జ్ యొసఁగిన యభిప్రాయమెంతయో రమణీయమైనది. ఆ యభిప్రాయ మీ క్రిందిది.

"But who ever it was who sang the song of Savitri, whether a Suta or a Brahman, he was certainly one of the greatest poets of all times. Only a great poet was capable of placing this noble female character before us, so that we seem to see her before our eyes. Only a true poet could have described in such a touching and elevating manner, a victory of love and constancy of virtue and wisdom over destiny and death, whithout even for an instant, falling into the tone of the dry preacher of morality; and only an inspired artist could have produced, as if by magic, such wonderful pictures before us. We see the deeply distressed woman walking by the side of her husband who is deemed to death; the husband mortally ill, wearily laying his head on his wife's lap; the dreadful form of the God of death, who binds the man's soul with fetters and leads it away; the wife, wrestling with the God of death for the life of her husband; and finally the happily re-united pair wandering homewards in the moon light with their arms about each other; and we see all these pictures in the splendid setting of a primeval Indian forest whose deep stillness we seem to feel

and whose delicious fragrance we seem to breath when we surrender ourselves to the magic of this imcomparable poem. The poem has fraquently been translated into European languages including German, but all translations can only give a feeble idea of the incomparable charm of this Indian poem."

పై దాని తాత్పర్యమిది. "సావిత్రికథను వ్రాసిన కవి యెవఁడైనను గానిండు, అతఁడు బ్రాహ్మణుఁడు గావచ్చును. లేక సూతుఁడు గావచ్చును. కాని యా మహాసృష్టి నొనర్చిన వాఁడు, మహా కవులలో మహాకవి. అత్యంత సమర్థుఁడైన కవియే, యుదాత్తమైన యొకానొక స్త్రీ జీవనము నింత సత్యముగ మన కన్నుల యెదుట భాసింపఁజేయగలఁడు. సావిత్రి వాక్యములలో ప్రతిపదమునను జ్ఞానము వెల్లివిరియు చుండును. ఆమె, ప్రారబ్ధము, మరణము, యీ రెంటికిని వెల నిచ్చినదే లేదు. ఆమె ప్రతిముక్క యందును ధర్మ పక్షపాతము, తూగిసలాడు చుండును. ప్రేమయొక్క విజయము నామె యడుగడుగునను నాకాంక్షించు చుండెను. తన మాటలలో నొక్కసారియైన నామె, మానవసహజమైన దౌర్బల్యమునకు లోగుటలేదు. ఆమె ప్రతిపలుకు నందును, ననుష్ఠాన శూరత్వమున్నది. అంతేగాని వాక్చాతుర్యమును లేదు. ఇతరుల తృప్తికై చెప్పు కాపట్యము లేదు. వ్యాస భగవానుని గంటమునందు సమ్మోహినీశక్తి గలదు. వారు మంత్రము వేసినట్లు క్షణకాలమున నెన్ని దృశ్యములనో మనకు భాసించునట్లు చేయుదురు. ఈ శక్తి యతిలోకుఁడైన మహాకవికిఁదప్ప, సామాన్యులకు సాధ్యముగాదు. మృత్యుగ్రస్తుఁడైన తన మగనివెంట నొకానొక స్త్రీ నడచిపోవుచున్నది. మగడు తన భార్య యంకతలముపై శిరస్సునుంచికొని పండుకున్నాడు. భయంకర స్వరూపుఁడైన యమరాజు మగని యాత్మను బంధించుకొని పోవుచుండెను. కర్తవ్యనిష్ఠురాలైన భార్య మృత్యువును జూచి భయపడలేదు. ఆమె యముని వెంట నడచినది. తన మగని ప్రాణములను వెన్క గొని తెచ్చువరకు నామె వదలదు. కడకు యముఁడే యామె పాతివ్రత్యమునకు లొంగినాఁడు. కడ కా దంపతులు

నిండువెన్నెలలలో మందహాసములతోఁ బరస్పరము నెచ్చరించికొనుచు, నాశ్రమము జేరికొన్నారు. సావిత్ర్యుపాఖ్యానమున ప్రాచీనకాలములందలి యరణ్యములలోని శాంతిరమ్యత యతిమనోహరముగఁ జిత్రింపఁబడినది. ఆ వనములలోని దివ్యసౌరభము మనలను జుట్టివేయును. ఆ శాంతి మన హృదయముల నాక్రమించును. వ్యాసభగవానుఁడు శబ్దములలోఁజూసిన సమ్మోహనశక్తి యట్టిది! సావిత్రి కథ యీ నడుమనే పాశ్చాత్య భాషలలోని కనువదింపఁబడెను. జర్మను భాషలోని కిది పరివర్తింపబడినది. కాని యీ పరివర్తనము లన్నియును వ్యాసుని ప్రతిభాసంపత్తిని ఛాయామాత్రముగ జూపుచున్నవేగాని, మూలకథలోని సౌందర్యమును సాంతముగ బ్రదర్శించుట లేదు. వ్యాసుల ప్రతిభాసమున్మేష మంతటి యద్వితీయమైనది. "మహాభారతములోని యిట్టి సౌందర్యము నడుగడుగునను మననమొనర్చుచు ముందు నడుతముగాక!!

## మహాభారతము పైని వ్యాఖ్యాతలు

శ్రీమద్రామాయణము నందలి కథల వలెనే భారతమునందలి కథలుఁగూడఁ గొన్ని వికృతములైనవి. అందుచే వానిని సమర్థించుటకు, మఱికొన్ని కారణముల యపేక్ష యున్నదన్నమాట! భారతము నందలి కొన్ని కథలలో పరస్పర విరోధము గన్పించును, లేక విరోధాభాసములైనను వచ్చిపడును. అట్టివారిని సమర్థించి, వానిని సుసంగతములుగ నొనర్చుటకుఁ బూనుకొన్న గ్రంథములలో ముఖ్యమైనది శ్రీమద్భాగవతము. దానినుండి కొన్ని యుదాహరణము లిత్తును.

మహాభారతమునందలి వనపర్వములో శ్రీకృష్ణునకును, సాల్వునకును జరిగిన యుద్ధము (అధ్యాయము 15 నుండి 22 వఱకు) వర్ణింపఁబడినది. దానిలో 21వ యధ్యాయమందు సాల్వుఁడు దన మాయాకౌశలమున వసుదేవుని సృష్టించి యాతని వధించినట్లు గలదు. తన తండ్రియైన వసుదేవుఁడు

వధింపఁబడుట జూచిన శ్రీకృష్ణునకు గలిగిన దుఃఖ మింతంతగాదు. ఇంతకును జచ్చినది మాయావసుదేవుఁడే. కాని సాల్వుని యింద్రజాలమును శ్రీకృష్ణుఁడు సత్యముగఁ దలఁచెను. శ్రీకృష్ణుఁడీ వృత్తాంతము నిట్లు వచించును:

తస్య రూపం ప్రయితతః పితు ర్మమ నరాధిప!
యయాతేః క్షీణపుణ్యస్య స్వర్గాదివ మహీతలమ్
తతః శార్ఙ్గధనుశ్రేష్ఠం కరా త్ప్రపతితం మమ
మోహాపన్నశ్చ కౌంతేయ! రథోపస్థ ఉపావిశం ॥

(మహాభారతము - వనపర్వము అ. 21)

"సాల్వుని యొక్క విమానమునుండి క్రింద బడుచున్న నా తండ్రి యొక్క శరీరము క్షీణపుణ్యుఁడగుటచేత స్వర్గమునుండి క్రిందఁబడుచున్న యయాతిశరీరము వలె గన్పట్టెను. ఆ దృశ్యమును జూచిన వెంటనే, శార్ఙ్గధనుస్సు నా చేతినుండి జారిపోయినది. మోహమును బొందినవాఁడనై రథమునందే కూలబడిపోతిని". భాగవతకారునకీ సన్నివేశము సరిపోలేదు. అతని దృష్టిలో కృష్ణుఁడు పరమాత్ముఁడు. అతఁడు పూర్ణావతారుఁడు. పరబ్రహ్మకెన్నఁడైనను మోహము గలుగునా? మహాభారతమునందే, శ్రీకృష్ణుఁ డనేక స్థలములందు దేవాది దేవుఁడని సంబోధింపబడెను. అట్టివానికి మోహముగల్గుననుట కుందేటికి కొమ్ముండుననుటవంటిది. ఈ ఘట్టమునందలి వర్ణన మనుచితముగ నాతనికి గన్పట్టెను. ఈ సన్నివేశమును మనసున నుంచికొని భాగవత కారుఁ డిట్లు సవరించుచున్నాడు.

"ఏవం వదంతి రాజర్షే! ఋషయః కేచ నాన్వితాః

.... ....... ...... .......

.... ....... ..... ......

లభన్తి ఆత్మీయ మనంత మైశ్వర్యం కుతోను మోహః పరమస్య సద్గతేః

(భాగవతము - దశమస్కంధము అ. 77)

"కొందరు ఋషులే పరమేశ్వరునకు మోహముఁగలిగెనని వర్ణింతురు. వారే మఱియొక చోట భగవానుఁడు పూర్ణపురుషుఁడని ప్రతిపాదింతురు. ఇది స్వవచనవ్యాఘాతము గదా! శోకమోహములు, స్నేహము, భయము మొదలగునవి యజ్ఞానులకుఁ గలుఁగవలసినవి. కాని యఖండమైన జ్ఞానవిజ్ఞానైశ్వర్యములచేత భాసించు పరమాత్మునకీ భావములు గల్గునా? ఎవని చరణసేవచేత ప్రాప్తమగు నాత్మవిద్యాప్రభావము వలన సమస్త మోహములును భ్రష్టములగునో, యాత్మజ్ఞాన రూపమైన యనంతైశ్వర్యము ప్రాప్తమగునో యట్టి పరమేశ్వరునకును మోహము గల్గుననుట కల్లలలో కల్ల."

మహాభారతమునందలి మౌసలపర్వమున నిట్లు గలదు:

"తత శ్శరీరే రామస్య - వాసుదేవస్య చోభయోః
అన్విష్య దాహయామాస పురుషై రాప్తకారిభిః
(మౌ. ప. అ॥7)

తరువాత కృష్ణబలరాముల శరీరములను వెదకి యర్జునుఁడారెంటికి నాప్తుల సహాయమున నగ్నిసంస్కారమొనర్చెను.

శ్రీకృష్ణుఁడు సచ్చిదానందస్వరూపుఁడు. అతఁడు పరబ్రహ్మము. అతని శరీరము మానవశరీరముల వలె పాంచభౌతికము గాదు. కనుక కృష్ణపరమాత్మని శరీరమున కగ్నిసంస్కారము సేయుటయు, నది పంచమహాభూతములయందు మిళితమగుటయు రెండును యయోగ్యములైన విషయములు. మహాభారతము నందలి యీ వర్ణనము కృష్ణుఁడు పరమాత్ముఁడనెడు సత్యముతో విరోధించుచున్నది. పరమాత్మునకు పాంచభౌతికమైన శరీర ముండదుగదా! భాగవతకారుఁడీ విషయము నిట్లు సవరించెను.

"లోకాభిరామామ్ స్వతనుమ్ ధారణాధ్యానమంగళమ్

......   ......   ........   ......

......   ......   .......   ......

గతి ర్నలక్ష్యతే మర్త్యైస్తథా కృష్ణస్య దైవతైః

(మ. భాగ. ఏ. స్కం. అ 31)

"శ్రీకృష్ణుని శరీరము సర్వమానవులకును మనోరమమైనది. ధ్యానధారణములచే నత్యంతము మఙ్గళకరమైనది. అట్టి తన శరీరమును కృష్ణ పరమాత్ముఁడు యోగాగ్నిచేత దహింపజేసికొని తన మూలభూతమైన స్వరూపమునందుఁ జేరిపోయెను. ఆకాశమునందు మెఱయు మెఱపు యొక్క గతిని జనుల లోచనములు గమనింపనేరనట్లు శ్రీకృష్ణుని యొక్క వైకుంఠగమనము దేవతలకే జూచుటకు సాధ్యముగాలేదు."

మహాభారతమునందు శ్రీకృష్ణుఁడే ప్రతిపాద్యుఁడైనను, ధర్మార్థకామము లాగ్రంథమునం దతి విస్తృతముగా వర్ణింపఁబడినవి. వీని గొడవలో కృష్ణుని విషయము మఱుగుపడి పోయినది. భాగవత కారుఁ డట్లొనర్పలేదు. అతఁడు కృష్ణపరమాత్ముని విషయమునే బహుళముగ వర్ణించెను. భారతమునందు కృష్ణుని విషయములు కొద్దిగా నున్నను, తక్కిన విషయములు వానిని ముంచివేయుటచే, లోకుల దృష్టి ధర్మార్థ కామములు, వానిని సాధించు ప్రయత్నములు వీనియందే లగ్నమై పోవును. ఈ భీతినే భాగవత కర్త యీ క్రింది వాక్యములలో వెల్లడించెను.

"యథా ధర్మాదయ శ్చార్థాః మునివర్యానువర్ణితాః

న తథా వాసుదేవస్య, మహిమాహ్యానువర్ణితః

(భా. ప్ర. స్కం అ. 9 శ్లో)

"జుగుప్సితం ధర్మకృతేzను శాసత: స్వభావరక్తస్య మహాన్వ్యతిక్రమ:
యద్వాక్యతో ధర్మయితీతర: స్థితో న మన్యతే తస్య నివారణం జన:
(భా. ప్ర. అ. 5 - 25 శ్లో)

"నారదుఁడు వ్యాసునితో ననుచున్నాఁడు. "ఓ! మునీ! నీవు భారతమునందు, ధర్మార్థ కామములను విపులముగ వర్ణించితివి. కానీ, వాసుదేవుని గుణానువాదమునకుఁ బ్రాధాన్యము నివ్వలేదు. లోకులకు ధర్మమార్గమునం దభిరుచిని గలిగించుటకై, ధర్మము ననేక విధములు బ్రపంచించుట మంచిదేగావచ్చును. కాని లోకము వికారములకు వశమైనది. నీ యాదేశము ననుసరించి యది ధర్మార్థ కామములను సాధించుటకే బ్రయత్నించును గాని, పరమ ధర్మమైన భగవదుపాసనకుఁ బూనుకొనదు. ఇది నా మనసున గలుగుచున్న భీతి."

భాగవత కారుని యాశంక సహేతుకమైనది. పరమసత్యము. మహాభారతము ననేక విమర్శకులు విమర్శించిరి. ఆ కథల నాధారముగ గొని స్వతంత్ర కావ్యములను గూడ రచించిరి. వాని మఱుగున భారతకథల సహజ స్వరూపమెంతయో మారిపోయినది. భగవద్భక్తులు, కీర్తనకారులు భారత కథలకు కొమ్మలు, ఱెమ్మలు సృష్టించినారు. కాని వారట్లు సృష్టించుటకు, భారతముపై వారికిఁ గల గౌరవాతిశయమే కారణము. ఈ మహాగ్రంథముపై గొందఱు పాశ్చాత్య విమర్శకులుఁ గూడ గ్రంథముల వ్రాసిరి. వారును కొన్ని కల్పనలను గావించిరి. వానికి మాత్రము భారతముపైని భక్తి కారణము గాదు. వారి హృదయములం దొక దుష్టమైన యభిప్రాయము ప్రోదిచేసి కొన్నది. అందుచే వారొక్కొక్క సారి మిథ్యాహేతువాదము నొనర్తురు. అపసిద్ధాంతములను గడ్డకుఁ బెరుకుదురు. అనుచితములను ఉచితములుగా, అధర్మములను ధర్మములుగా సాధించుటకు, దగుశక్తి నంతయు ఖర్చు పెట్టి వాదింతురు. సామాన్యునకైనను సహజముగా దెలియు నర్థమును తమ వ్యాఖ్యానములచే జటిలముగఁ జేయుదురు. కథలయొక్క యాదర్శములనే మార్చివేయుదురు. పాశ్చాత్య విమర్శకులలో, డాక్టర్ వింటర్

నిడ్జి మహాశయుఁడు భారత దేశముపైఁ గొంత సానుభూతి గలవాడు. మన యాదర్శములపైఁ గొంత గౌరవము గలవాడు. అతఁడు గూడ నొక్కొక్కసారి యడుసులో కాలు వేయును. ఈ క్రిందివి కొన్ని యుదాహరణములు.

"డాక్టర్ వింటర్ నిడ్జ్" మహాశయుఁడు దన గ్రంథమందశ్వత్థామ విషయమై యిట్లు వ్రాసెను. "Also Ashwathama one of Drona's sons" అనఁగా వింటర్ నిడ్జ్ వారి యభిప్రాయమున ద్రోణుల కశ్వత్థామ యొక్కఁడే గాక వేరు కొడుకులును గలరన్నమాట! కాని మహాభారత మందు ద్రోణుల కశ్వత్థామ తప్ప మరి సంతానమే యున్నట్లు జెప్పఁబడలేదు. భారతమున "నశ్వత్థామ జన్మ ప్రకారము రెండుసారులు వర్ణింపబడినది. ఆ వర్ణన మీ క్రిందిది -

"అలభ ద్గౌతమీపుత్ర మశ్వత్థామాన మేవ చ
స జాతమాత్రో వ్యనద ద్యథైవోచ్చైశ్శ్రవా హయః
(58 వ శ్లో॥ ఆదిపర్వము అ॥ 130)

అలభ ద్గౌతమీపుత్ర మశ్వత్థామాన మౌరసం
భీమవిక్రమకర్మాణ మాదిత్యసమతేజసం
(50 వ శ్లో॥ ఆదిపర్వము అ॥ 131)

ద్రోణపత్నియైన గౌతమి కశ్వత్థామ యనెఁడు సుతుఁడు జన్మించెను. జన్మించిన వెంటనే యాతఁడు "ఉచ్చైశ్శ్రవ" మనెఁడు పేరుగల మేలిజాతి గుఱ్ఱము వలె గర్జించెను. గౌతమి కత్యంత పరాక్రమవంతుఁడును, సూర్యసమ తేజస్కుండును నగు "అశ్వత్థామ" యనెడు సుతుఁడు జన్మించెను అని పై శ్లోకముల కర్థము. వింటర్ నిడ్జ్ మహాశయుఁడట్లు వ్రాయుటకు కారణ మీ విషయము దెలియకగాదు. బుద్ధిపూర్వకముగనే!

(2) ఉత్తరగోగ్రహణ సందర్భమును గూర్చి డాక్టరుగారిట్లు వ్రాసిరి.

"Though the Kourawas harboured a suspicion that it was Arjuna who was Fighting against them, they did not recognise him."

మహాభారతమం దీ విషయ మిట్లు లేదు. కౌరవ సైనికులు కవ్వడిని గుర్తుపట్టినట్లే యున్నది. అంతేగాదు, అర్జునుఁడు గూడ తన నామగోత్రములను వారికి స్పష్టముగఁ దెలిపినాఁడు. పార్థుఁడు వచ్చుచున్నది చూచి ద్రోణాచార్యుఁ డిట్లనెను.

"ఏత ద్ధ్వజాగ్రం పార్థస్య దూరత స్సంప్రకాశతే
ఏష ఘోష స్సరథజో రోరవీతి చ వానరః
(విరాటపర్వము, అధ్యా॥ 53)

పార్థుని రథధ్వజము దూరమునుండియే కన్నులు మిఱుమిట్లు గొల్పుచు ప్రకాశించుచున్నది. అదుగో యా రథధ్వని! ఆతని రథముపై నున్న హనుమంతుని గర్జనములును వినవచ్చుచున్నవి. యుద్ధమున పార్థుఁడు కోదండాచార్యులతో నిట్లు బలికెను.

"ఉషిస్స్మ వనే వాసం ప్రతికర్మ చికీర్ష వః
కోపం నార్హసి నః కర్తుం సదా సమరదుర్జయ!
(విరాటపర్వము అ॥ 58-18వశ్లో॥)

"ఆచార్యా! మేము వనవాసమును గడిపితిమి. మా పగకు బ్రతీకార మొనర్చుటకై గడంగితిమి. తమరు మాపై కినుక బూనకుఁడు" అర్జునుఁడు కర్ణునితో నిట్లు వచించెను.

"ఏహి కర్ణ మయాసార్థం ప్రతియుద్ధ్యస్వ సంగరే"
(విరా॥ ప॥ అ॥ 60 8 వ శ్లో॥)

"ఓయీ! కర్ణా నీవు నాతో యుద్ధ మొనర్పవలెను". కవ్వడి యాడిన పల్కులకు కర్ణుఁడిట్లుత్తరమిచ్చెను.

"అయం కౌంతేయ కామ స్తే సచిరా త్సముపస్థితః
(విరా॥ ప॥ అ॥ 60 14 వ శ్లో॥)

"ఓయీ! అర్జునా! నీ యభీష్టము త్వరలోనే సిద్ధించుచున్నది". పలాయన మంత్రమును పఠించుచున్న దుర్యోధనుని జూచి ఫల్గునుఁడిట్లు యెత్తిపొడిచినాఁడు.

యుధిష్ఠిరస్యాస్మి నిదేశ కారీ పార్థ స్తృతీయో యుధి సంస్థితోస్మి
తవర్థ మావృత్య ముఖం ప్రయచ్ఛ నరేంద్రవృత్తం స్మర ధార్తరాష్ట్ర!
(విరా॥ ప॥ అ॥ 65-16వ శ్లో॥)

"ఓ దుర్యోధనా! యుధిష్ఠిరుని యాజ్ఞను బరిపాలించు నేను కుంతీదేవికి మూఁడవ కుమారుఁడను. నాపేరర్జునుఁడు. మీతో యుద్ధమాడదలఁచి వచ్చితిమి. ముఖమును వెన్కకుఁ ద్రిప్పుము. క్షాత్రధర్మమును స్మరింపుము." అని పై శ్లోకమున కర్థము.

(3) నవీన విమర్శకు లగువారికిఁ దోచినదే తర్కము. దాని కే ప్రమాణమును వారికక్కరలేదు. తమకుఁ దోచినట్లు వారు సిద్ధాంతము లొనర్తురు. ఇట్టి వ్రాతలు డాక్టర్‌గారి గ్రంథమునందుఁ గొల్లలుగ గన్పడును. సుభద్రా పరిణయము పైన వారొసఁగిన వ్యాఖ్యానమిది.

"Obviously the Yadavas were a rough Shephered tribe with whom marriage by theft was still legitimate."

కాని వీరీ నిశ్చయమునకు వచ్చుటకుఁ గారణములేవి? వారా కారణములను జెప్పలేదు. భారతమునందు సుభద్రాహరణము కృష్ణుని సమ్మతితోనే జరిగినది. దానికి తెరవెనుకఁ గొన్ని రాజకీయములు. వానిని దరువాత వివరింతును. బలవైభవముతో, పరాక్రమముతో కన్యకలను దీసికొని పోవుట క్షత్రియులలో నున్న యాచారమే! ఈ విషయము భారతమునందే స్పష్టముగ వివరింపఁబడినది. సుభద్రాహరణమునకై యర్జునుని బ్రోత్సహించుచు కృష్ణుఁ డిట్లనుచున్నాఁడు.

"ప్రసహ్య హరణం చాపి క్షత్రియాణాం ప్రశస్యతే
వివాహహేతు శ్శూరాణా మితి ధర్మవిదో విదుః
(ఆదిపర్వము అధ్యా 219)

"శూరుఁడైన క్షత్రియునకుఁ గన్యాహరణ మొనర్చుట ధర్మమే. ధర్మవేత్త లిట్లే సిద్ధాంత మొనర్చి" రని పై శ్లోకమున కర్థము. ఉద్యోగపర్వమునందుఁ గూడ నిట్టి సన్నివేశ మొకటి వచ్చును. భీష్ముఁడు బలాత్కారముగ కాశీరాజా దుహితలైన యంబికాంబాలికలను గైకొని పోయెను. ఆ సమయమున భీష్ముఁడు శూరులైన క్షత్రియుల నుద్దేశించి యిట్లనుచున్నాఁడు, -

"తే యతధ్వం పరం శక్త్యా, సర్వే మోక్షాయ పార్థివాః
ప్రసహ్యహి వరా మ్యేష మిషతాం వో నరర్షభాః !
(ఉద్యోగపర్వము అ॥ 173)

'శూరులైన రాజకుమారులారా! మీరు జూచుచుండగనే బలాత్కారముగ నీ కన్యలను నేను హరించుకొని పోవుచున్నాను. మీకు సామర్థ్యమున్నచో నన్ను జయించి వీరిని గైకొనుఁడు." బలాత్కారముగ కన్యలను హరించికొని పోవుట హీనులైన యాదవుల యందేగాదు 'వింటర్ నిడ్జ్' గారు గొప్పవారని భావించునట్టి కౌరవులు మొదలైన రాజులయందును గలదు. ఎవడో యొక్కఁడు అబద్ధమును పఠించి దానిని గప్పిపుచ్చుటకై కుచోద్యమును గూడ నొనర్చెనట! డాక్టర్‌గారి స్థితి యిట్లున్నది. వారొక యుపసిద్ధాంతమును లేవదీసినారు, మహాభారతమునం దెక్కడను యాదవులు హీనకులులని జెప్పఁబడలేదు. వారు క్షత్రియులు, శుద్ధ క్షత్రియులు, ఇది నిర్వివాదము.

(4) శల్యుని విషయమై డాక్టరుగా రిట్లు వ్రాసినారు.

"Shalya is to fight on the side of Kouravas, but Karna's Charioteer' is to drive chariot badly and thus cause Karna's fall."

కాని డాక్టరుగారి యన్ని సిద్ధాంతములును నిరాధారమైనవి. కర్ణుని రథమును తారుమారుగ దోలవలసినదని యుధిష్ఠిరుఁడు శల్యుని వేడికొన్నది లేదు. శల్యుడు దానికి సమ్మతించినదియు లేదు. ధర్మరాజు శల్యునకు గావించిన వినతి యిది-

"తత్ర పాల్యోఽర్జునో రాజన్! యది మత్ప్రియ మిచ్ఛసి!
తేజోవధశ్చ తే కార్యః సౌతేరస్మజ్జవహః.
14 శ్లో॥ భారతము ఉ॥ ప॥ అ॥ 8)

మీరు నాకు హితము చేయదలఁచికొన్నచో రణరంగమందర్జునుని రక్షింతురు గాక! యుద్ధమున కర్ణుఁడు కవ్వడి నెదుర్కొన్నప్పుడు మీరు రాధేయుని తేజోహీనుని గావింపవలెను." రథమును సరిగా నడుపక సిలుగల బెట్టి కర్ణుని తేజమును హరింపవలెనని ధర్మరాజు కోరలేదు. శల్యుఁడు తానెట్లు కర్ణుని తేజోహీనుని జేయబోవునో యా పద్ధతి నీ క్రింద వివరించినాఁడు.

"తస్యాఽహం కురుశార్దూల! ప్రతీప మహితం వచః
ధ్రువం సంకథయిష్యామి యోద్ధుకామస్య సంయుగే
యథా స హృతదర్పస్య హృత తేజాశ్చ పాండవ!
భవిష్యతి సుఖం హంతుం సత్య మేత త్బ్రవీమి తే!"
(భార॥ ఉ॥ ప॥ అ॥ 8)

'ధర్మరాజా! నేను సారథ్యము సేయునపుడు కర్ణునకు విరుద్ధముగ మాటలాడుదును. అరుచికరముగ బ్రసంగించి యాతని యహంకారమును తేజస్సును హరింతును. అపు డాతఁడు సుఖముగ వధింపఁబడును.'

"శ్రీ చింతామణిరావు వైద్య" మహాశయుఁడు శల్య ప్రకరణము పై నొక యాక్షేపమును వేసెను. "శల్యుఁడు దుర్యోధనునకు సాయమొనర్తునని వచ్చెను. అట్లు వచ్చినవాఁడు కర్ణుని తేజోహీనునిగ నొనర్చుట విశ్వాసఘాతుకమైన

పనిగదా! శల్యునివంటి గొప్పవాఁడిట్టి నీచకార్యము నొనర్చునా? కనుక భారతమునం దీ భాగమంతయు బ్రక్షిప్తమై యుండవలెను" అని వారి యూహ. పూర్వగ్రంథములలోఁ దమకు సరిపోని దంతయు ప్రక్షిప్త భాగమనుట యాధునిక విమర్శకులు నేర్చికొన్న చక్కని యుపాయము. మహాభారతమును బట్టి చూచినచో దుర్యోధనుఁడు శల్యుని తనవైపు లాగికొన్నది వంచనతోనే. వాక్చాతుర్యముతో నాతఁ డాతనిని లోఁగొనెను. సత్యముగ విచారించినచో శల్యునకు పాండవులపైఁ బ్రీతిగలదే గాని కౌరవులపై లేదు. సహదేవున కతఁడు మేనమామ. తన మేనయల్లుండ్రు మాయాజూదమున భంగింపఁబడుట కాతఁ డెంతయో విచారించెను. కురుసభలో ద్రౌపదికి జరిగిన యవమాన మాతని యుద్రేకమును రెండింత లొనర్చినది. పాండవు లనుభవించిన యొక్కొక్క కష్టమును శల్యుని హృదయముపై నొక్కొక్క చెఱగిపోని ముద్రను వేసెను. శల్యుడు రణమున పాండవులకుఁ దోడుపడి కౌరవులొనర్చిన యీ యపకారము లన్నింటికిఁ బ్రతీకారమొనర్ప నువ్విళు లూరుచుండెను. కాని యాతఁడు సుయోధనుఁడు బన్నిన వలలో దగుల్కొన్నాఁడు. అటుతర్వాత శల్యుఁడు పాండవ శిబిరమునకేగి యుధిష్ఠిరునకు జయము గలుగవలె నని యాశీర్వదించెను. కర్ణుడు ద్రౌపది కొనర్చిన యవమానము శల్యుని చిత్తమున మెఱుచుచునే యున్నది. అతఁడు ధర్మజునితో నన్నాఁడు.

"యచ్చ దుఃఖం త్వయా ప్రాప్తం ద్యూతే వై కృష్ణయా సహ
పరుషాణి చ వాక్యాని సూతపుత్రకృతాని వై"

(భార॥ ఉ॥ ప॥ అ॥ 8)

"ఆనాఁడు సభలో సూతపుత్రుఁడు నిన్నును. ద్రౌపదిని దూలనాఁడెను. వాని యవినయమునకు బ్రతీకారము దప్పకసేయుదును". మాయలు గల్గు వారలను మాయతోనే జయించుట, మోసమునకు బదులు మోసమే సేయుట

భారతమున బ్రతిపాదింపఁబడిన ధర్మమే! హిందువుల ధర్మశాస్త్రము గూడ దీనిని దోషమనదు. "ఉద్ధతుల నౌద్ధత్యముచేతనే జయింపవలెను. వంచకులను వంచనచేతనే హతమార్పవలెను" అని శ్రీ సమర్థ రామదాసస్వామి యన్నమాట లోక ప్రసిద్ధమైనదే! శల్యు డీ పనినే చేసెను. అతఁడొనర్చినది ద్రోహముగాదు. మఱియింత మాత్రమునకు శల్యప్రకరణమంతయు ప్రక్షిప్త మేల కావలసి వచ్చెనో సంశోధకులనే యడుగవలెను.

మహాభారతము నందలి సులభములైన ధర్మసూక్ష్మములకుఁ గూడ పాశ్చాత్యులు విపరీతములైన వ్యాఖ్యానము లొనర్తురు. మూలకారుని భావములనే చిందఱవందఱ సేయుదురు. "ఇది యే"మన్నచో మాకిట్లు దోచినదందురు. ఇట్లు సేయుటలో వారితలఁపేమి? వారి యభిప్రాయ మొక్కటే! దుష్టమైన యూహ. భారతదేశము యొక్క రాష్ట్రీయాభిమానము నాశనమొనర్చుటకై వారు యత్నించిరి. మన ధర్మము, సంస్కృతి, అభిమానము, వీనిని నిందించుటయే వారి పని. ఈ కార్యమునకై వారేవేవో నిరాధారములైన యూహలల్లుదురు. "మహాభారతము సంపూర్ణముగ వీరరస ప్రధానమైన కావ్యము. క్షత్రియ వంశముల నది పొగడును. ఈ కావ్యములకుఁ బ్రశస్తి పెరుగు కొలఁదియు బ్రాహ్మణుల కాతురత యెక్కువైనది. వారా గ్రంథమున జేయి గల్పించుకొనిరి. తమ గొప్పతనమును చాటు కథల నెన్నియో గల్పించి యా గ్రంథమున జొనిపిరి" అని "డాక్టర్ వింటర్ నిడ్జ్" దొరగారి యభిప్రాయము. వీరి వాక్యములనే యనేక మిర్శకు లనువదించినారు. డాక్టరుగారు వ్రాసిన వ్రాత యిది -

"The more the heroic songs grew in favour and more popular they became, the greater was the anxiety of the Brahamins to take possession of this epic poetry also and they had the art of compounding this poetry, which was essentially secular in origin, with their own religious poems and the whole stock in trade of their theological and priestly knowledge."

మీరిట్లు వ్రాయుట కాధారమేమి? యని యెవ్వరైన నడిగినచో, "నాకట్లు తోచిన దనుటయే" వారొసఁగు నుత్తరము. వీరొక్కరే గాదు. 'దాలమన్' మహాశయుఁడు గూడ భారతముపై తమ యభిప్రాయము నొసఁగి యున్నారు. వారి వ్రాత యిది. "భారతము భారతదేశ క్షత్రియుల యొక్క కర్తవ్య నిష్ఠను బోధించు మహాకావ్యము. క్షాత్రధర్మము నది బోధించును. ఆ ధర్మమునకు కేంద్ర భూమి భగవద్గీత. దాని చుట్టును కళాత్మకమైన రీతితో యొక గొప్పగాథ యల్లబడినది. "కాని వీరు గూడ డాక్టర్ వింటర్ నిడ్జ్ గారి యభిప్రాయమును ఖండింపలేదు. పై పెచ్చు వారి వలెనే వీరును.

I my self believe the real nucleus of the Mahabharat is heroic poem of the conflict between the Kauravas and the Pandavas".

అని స్పష్టముగ జెప్పివేసినారు. వింటర్ నిడ్జ్ మహాశయులవలెనె, వీరి యూహయందును, "తాను పట్టిన కుందేటికి మూడేకాళ్ళు".

కృష్ణుఁడను వ్యక్తి యొక్కఁడు గాఁడనియు ముగ్గురు నల్గురు విభిన్న వ్యక్తులకుఁ గృష్ణుఁడను పేరుండెననియు పాశ్చాత్య విమర్శకులు చేసిన మరియొక కల్పన. 'డాక్టర్ భండార్కర్' గూడ వారి యూహనే యంగీకరించెను. వీ రిట్లనుకొనుటకుఁ గారణమేమి? వారి హేతువాద మెంత విచిత్రముగ నున్నదో చూడుడు. 'డాక్టర్ వింటర్ నిడ్జ్' మహాశయుల వ్రాత యీ క్రిందిది.

"It is difficult to believe that Krishna the friend and councellor of the Pardavas, Krishna the heard of the doctrines of the Bhagavat Geeta, Krishna the youthful hero and demonslayer, Krishna the favourite and the lover of cowherdesses finally Krishna the incranation of the exhalted God Vishnu can be one the same person. It is far more likely that there were two or several traditional Krishnas and were maarged into one deity at a later time."

డాక్టర్ భండార్కర్ మహాశయులు గూడ పై యభిప్రాయమునే సమ్మతించిరి. లోకమాన్య తిలకుగారు, తమ 'గీతారహస్యమునందు పై విషయమును దడవి,

దానికి సరియైన సమాధానము నొసఁగినారు. వారొసఁగిన సమాధానమునే యిచ్చట వ్రాయుట మంచిది. లోకమాన్య లిట్లన్నారు. "ముష్వరు, నల్వురు భిన్న భిన్నులైన కృష్ణులుండిరనియు, వారు గొన్నికొన్ని కార్యములు నిర్వహించిపోయిరనియు, కాలాంతరమున నీ కృష్ణులందరు నొకఁడే ఐతిహాసిక పురుషుఁడను వాదన బయలుదేరెననియు గొందఱందురు. వారి యీ తర్కము హేతుబద్ధమైనదిగాదు. ఈ కల్పనకుఁ బ్రబలాధారమేమి? మూలధర్మమునందు గన్పడు గొన్ని స్వల్పములైన భేదములు. బుద్ధుఁడు, క్రీస్తు, మహమ్మదు వీరి ధర్మములయందునుఁ గాలక్రమమునఁ గొన్ని భేదములు, వాఖ్యానాంతరములు బయలుదేరినవి. అట్లే భాగవత ధర్మమునందుఁ గూడఁ జరిగినది. ఆ ధర్మములను భిన్న భిన్న కృష్ణులు ప్రవర్తింపఁ జేసిరని వాదించుట న్యాయముగాదా! క్రీస్తు, మహమ్మదు, బుద్ధుఁడు వీరొక్కొక్క యైతిహాసిక పురుషులే యని యంగీకరించుచున్నాము గదా! ఒక్క కృష్ణుఁడు మాత్ర మెందుకు గాకపోవలె? ఒకానొక యుత్తమ ధర్మము జనించినపుడు కాలాంతరమున దానికి రూపాంతరములు సంభవించుట సహజమే! దీనినిఁబట్టి కృష్ణులు భిన్నభిన్నులనుట న్యాయముగాదు. కొందరు పాశ్చాత్య విమర్శకులు మరియొక రీతిగ వాదింతురు. వారి పోకడ యిది; "కృష్ణుఁడు, యాదవులు, పాండవులు వీరందరును మిథ్య. భారత యుద్ధము చారిత్రకముగ జరగనేలేదు. ఈ కథ యంతెయు కల్పితమే!" మరికొందరిట్లందురు: "మహాభారత మధ్యాత్మవిషయము. దానికి మహాభారతమని రూపమొసఁగిరి. భావములకు వ్యక్తుల పేర్లుబెట్టిరి." మాయభిప్రాయమునం దీ రెండువాదములునుగూడ దోషయుక్తములే! ప్రాచీన గ్రంథములను జాగ్రత్తగా నవలోకించినపు డీ విషయము నెవ్వరికైన దెలియును. కనుక యెట్లు జూచినను శ్రీకృష్ణ నామకు లనేక వ్యక్తులు గారు. అతఁడొక్కఁడే! అతఁ డైతిహాసికపురుషుఁడు. మరి కొందరి విచిత్రవాద మిది. కృష్ణుఁడు పాండవులు చారిత్రిక పురుషులే గావచ్చును. కాని కృష్ణుఁడు

తొట్టతొలుత సామాన్య క్షత్రియ యోధుఁడుగనే గౌరవింపఁబడెను. అటుతరువాతఁ గొంతకాలమున కాతనిని మహాపురుషుఁడని జనులు గుర్తించిరి. పిదప విష్ణువుయొక్క యవతారమని దలఁచిరి. క్రమక్రమముగా కడపటి కాతఁడు పరబ్రహ్మస్వరూపమని గమనించిరి. ఇట్లు గమనించుటకు కొన్ని శతాబ్దములైనను బట్టియుండును. "ఈవాదమునకుఁ దలయుఁ దోఁకయుఁ గానవచ్చుటలేదు. ఒకానొకనిని బ్రహ్మస్వరూపుఁడనుటకును, కాదనుటకును ఆధునికులైన తార్కికుల దృష్టి వేరు. నాలుగువేల సంవత్సరములకు పూర్వముండిన జనుల దృష్టి వేరు. వారి వీరి యభిప్రాయములలో గొప్ప యంతరమున్నది. జ్ఞాని యైన పురుషుఁడు స్వయముగ బ్రహ్మస్వరూపుఁడే యను సిద్ధాంతము శ్రీకృష్ణున కెంతయో పూర్వమే యుపనిషత్తుల యందు స్థాపింపబడినది. 'మైత్రేయ్యుపనిషత్తు' నందు రుద్రుఁడు, విష్ణువు, అచ్యుతుఁడు, నారాయణుడు వీరందరును పరబ్రహ్మస్వరూపులేనని స్పష్టముగఁ జెప్పఁబడినది. ఇఁక పూర్ణజ్ఞానియైన కృష్ణుఁడు బ్రహ్మ స్వరూపుఁడని గమనించుటకుఁ గొన్ని శతాబ్దము లేల పట్టియుండునో యర్థముగాదు. బుద్ధుఁడు తన జీవితకాలమందే బ్రహ్మస్వరూపుఁడని జనులచే గౌరవింపఁబడెను. భగవానునకు వలె నాతనికిఁ బూజలు జరిగినవి. ఈ విషయము చారిత్రకముగ సత్యమే. అతని మరణానంతరము జను లాతనిని దేవాదిదేవుఁడనియే తలఁచిరి. వైదికధర్మమందు పరమాత్ముఁడని యెవరిని బిలుతురో యాస్వరూపుఁడని బుద్ధుని గమనించిరి. అతనికి పూజ, పురస్కారము లొనర్చిరి. ఈ విషయమును బౌద్ధ గ్రంథములు ఘంటాఘోషముగ బలుకుచున్నవి. ఏసుక్రీస్తు విషయము గూడ నిట్టిదే. బౌద్ధము, క్రైస్తవము యీ ధర్మములను స్థాపించిన మూలపురుషులకు వలెనే భాగవతధర్మసంస్థాపకుఁడైన కృష్ణునకును అనతికాలమునందే బ్రహ్మస్వరూపుఁడన్న గౌరవము లభించియుండుననుటలో బాధక మేమియును లేదు." (గీతారహస్యము 20 - 1915 పేజి 542 నుండి 544 వఱకు).

పాశ్చాత్యుల కొక గూఢమైన గర్వము గలదు. ప్రపంచమునందెచ్చోటను వారిని మించి సంస్కారమున్నవారు లేరని వారి విశ్వాసము. ఉండకూడదనియుఁ బట్టుదల. ఈ దృష్టితో వారు మన సాంస్కృతిక విషయమును హేళనమొనర్పుట కారంభింతురు. అపసిద్ధాంతమును లేవదీతురు. కనుక వారు చెప్పిన విషయములన్నియు విస్సన్న చెప్పినది వేదముగా మనము నమ్ముట సరియైన పద్ధతి గాదు.

## సాంస్కృతిక జీవనముయొక్క వెల తగ్గినది

మహాభారత మార్యుల జీవనశాస్త్రము. భారతీయ రాష్ట్రముల లక్షణములు, వాని ధ్యేయములు, విషమ పరిస్థితులయం దా ధ్యేయములను సాధింపవలసిన సాధనములు, వ్యక్తి, సమాజము, వీరి పరస్పర సంబంధము, వారి పరిపూర్ణ వికాసము యొక్క తెఱఁగు, యీ విషయములన్నియు, భారతమున నతి రమణీయముగఁ జిత్రింపఁబడినవి. ఇతిహాస పురాణ కావ్యములు, ధర్మశాస్త్ర, రాజ్యశాస్త్ర, యుద్ధశాస్త్రములు, వీనికి సంబంధించిన విషయములు, సమాజము, వ్యక్తి, వీరు కష్టములందుఁ దరింపవలసిన వివరములు, వీనినన్నిటిని మహాభారతము స్పష్టముగ నిరూపించును. అందుకే దానిని జ్ఞానకోశమంటిమి. జనుల చిత్తములందున్న యంధకారమునెల్లను నాశనమొనర్చి, వారికిఁ గర్తవ్యమార్గమును జూపించు గొప్ప దీపస్తంభ మది. ఆ యితిహాసము, భారతదేశమెట్లు వర్తింపవలెనో, భారతీయుఁడెవఁడో, వాని ధ్యేయమేదో స్పష్టముగఁ దెల్పును.

భారతమునకు 'జయ' మనియు మాఱుపేరు. జయనామకమైన దీనిని జదువుటకు ముందు, నారాయణునకును, నరోత్తమునకును నమస్కరింపవలెనను నియమ మున్నది. నరనారాయణులు సాధించిన మహా విజయమునే యీ గ్రంథము దెలుపును. ఇందలి నరుఁడర్జునుఁడు, నారాయణుఁడు భగవంతుఁడైన శ్రీకృష్ణుఁడు.

## అవతారోత్పత్తికిఁ గారణము

భారతమునందే శ్రీకృష్ణుఁడు సర్వజీవమయుఁడని నిరూపింపఁబడెను. అతఁడు శ్రీ మహావిష్ణువు యొక్క యవతారము. భారత కాలమున పరమేశ్వరుఁడు జన్మ మెత్తవలసిన యవసరమేమి యేర్పడినది? భగవద్గీతయందుఁ బరమేశ్వరుఁ డవతరించుటకుఁ దగిన సన్నివేశమిట్లుఁ జెప్పఁబడినది.

"యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజా మ్యహం॥
"పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే"

"అర్జునా! యెప్పుడెప్పుడు ధర్మమునకు గ్లాని గలుగునో యధర్మమున కభివృద్ధి యేర్పడునో, యపుడపుడు ప్రపంచమున నన్ను నేను సృజించుకొందును. సాధువులను రక్షించుట కొరకు, దుష్టులను శిక్షించుటకును, ధర్మమును స్థాపించుటకును, ప్రతియుగము నందును నేను జన్మించుచుందును." శ్రీకృష్ణుఁ డద్వితీయుఁడు. ఈ విషయము నిర్వివాదమైనది. మనుష్య స్వభావమునకు సంబంధించిన వికారము లాతని నంటవేలేదు. అసంపూర్ణత కృష్ణపరమాత్మని జీవనమున గనపడదు. అతఁడు పూర్ణ స్వరూపుఁడు. ఆ యుగ పురుషుఁడు ధర్మమును ప్రతిష్ఠించెను. అధర్మమును నాశన మొనర్చెను. సాధువులను రక్షించెను. పరమేశ్వరుని యవతారము ప్రతియుగమునను, పవిత్రమైన భరతభూమి యందు గల్గుచునే యుండును. ఆత్మజ్ఞానము మానవున కుత్తమోత్తమమైన ధర్మము. ఆత్మ విస్మృతి గొప్ప యధర్మము. పరధర్మముల యాక్రమణమువలనను, మానసికచాపల్యముల వ్యతిరేకమువలనను, భారతజాతి యెప్పుడెప్పుడు అధఃపతనమగుటకు మొదలు పెట్టునో, యప్పుడప్పుడు భగవంతుఁ డీదేశమున

నవతారమెత్తును. ఆతని యంశము ప్రపంచమున నాక్రమించును. ఆత్మజ్ఞానరూపమైన ధర్మమును బ్రతిష్ఠించును. శ్రీకృష్ణుని యావిర్భాతికి ముందు, భారతీయ రాష్ట్రములం దాత్మ విస్మృతి రూపమైన యధర్మము దిన్నఁగా వ్యాపింపఁ దొడఁగెను. ఇది నిర్వివాదమైన విషయము. ఉన్నదున్నట్లుగా నిట్టి స్థితి భారతకాలమున నెట్లేర్పడినది? యను ప్రశ్నకు సదుత్తరమునకై భారతమును మనము గొంత దృష్టితో జదువవలెను. ఈ విషయమును విమర్శించుటకు ముందు భారతీయుల సంస్కృతి యెట్టిదో కొంత గమనింతము:

## భారతీయ సంస్కృతియొక్క ప్రత్యేకత

భారత సమాజమున నాలుగు వర్ణములు ముఖ్యములు. వారిలో బ్రాహ్మణులకు భారత సంస్కృతిని రక్షించు కార్య మొప్పగింపఁబడినది. వారు యోగయుక్తులు. తపోమయులు, జ్ఞానసంపన్నమైన జీవనమును గడపువారు. మానవునకు స్వాభావికములైన వికారములను వశపఱచికొని సంచరించువారు. వారిపాలికి దారిద్ర్యమే పరమధనము. బ్రాహ్మణు లట్లే వర్తింపవలెను. భారత సంస్కృతి యిట్టి యొక వర్గమునే సృష్టించి, వేలకొలఁది వర్షములుగ వారినట్లే మన నిచ్చెను. ఆ సంస్కృతిలోని వైశిష్ట్యమదియే. పాశ్చాత్య చరిత్రకారులు, వారి వాసన యంటిన సామ్యవాదులు, బ్రాహ్మణులను, భోగ సుఖాసక్తులైన, జ్ఞానవిహీనులైన బిచ్చగాండ్రతోఁ బోల్చి మాటలాడుదురు. ఈ పోలిక చాల యన్యాయమైనది; అసంబద్ధముగూడ. మానవుని జీవనము పశుత్వ, దేవత్వములకు యుద్ధరంగము. మానవుఁడు మనశ్శక్తితోఁ దనయందలి పశుత్వమును జయించి, వికారహీనుఁడై దేవత్వమును బడయును. అసంపూర్ణుఁడైన మానవుని పరిపూర్ణునొనర్చుటకే, యార్య సంస్కృతి యేర్పడినది. ఆ సంస్కృతికి సంకేతమదియే. మానవుఁ డా స్థాయి నందికొననిది యీ ప్రజాసత్తాక రాజ్యములు

మీసాలపై తేనెలు. ఉత్పత్తివిధాన మెంత బెరిగినను లాభములేదు. కాక, సామ్యవాదుల పద్ధతి ననుసరించి యార్థికముగ నందరు బాగుపడినను లాభము సున్న. సంకుచితత్వము, మాత్సర్యము, క్రోధము, లోభము మొదలగు వానిపై విజయము సంపాదించికొననిది కర్తవ్య నిష్ఠత నలవరచుకొననిది మానవుని బ్రతుకు, అర్థవంతము గానేరదు. అంతవఱకును మనమొనర్చు యే యేర్పాటైనను విడంబనామాత్రమే! ఈ యభిప్రాయములతో భారత సంస్కృతి యొకానొక వర్గమునే సృష్టించెను. ఆ విప్రులకు ధనములపై నపేక్షలేదు. బ్రదుకులకొఱకై రాజుల నాశ్రయించి జీవించుట వారెఱుఁగరు. తమ జీవితముల యందుఁ గాసంత దొసఁగు దోచినను, దానికి శిక్ష స్వయముగ విధించికొను ధర్మదృష్టి ధైర్యము, వారి స్వభావము. ఇట్టివారు గనుకనే వారి పలుకుబడి, రాజులపైఁ జెల్లుచుండెను. అది రాజులకు వారిపై నున్న గౌరవమువలననే! కాని, రాజులను నియమించుట, బ్రాహ్మణులకు యధికారముగాదు. సర్వేంద్రియములను జయించి, శమదమాదుల నలవఱచికొని, యీ వర్గము దేవాలయమందలి 'నందా దీపము' వలె, యార్య సంస్కృతియొక్క, యాదర్శమును దమ జీవితములందుఁ బ్రత్యక్షముగఁ జూపుచు బ్రదికెను. రాజులు వారి సద్గుణములకు వశులైరి. వారి యాజ్ఞలను మన్నించిరి. రాజుల యధికారములు బ్రాహ్మణులపైఁ జెల్లుటలేదు. దాని కవసరములేదు. గనుక వేనరాజధర్మ పరుఁడయ్యెను. నాటిసంఘమున వాఁడు విప్లవమును లేపెను. అందుచే బ్రాహ్మణులు వానిని బదచ్యుతుని గావించిరి. ఇది బ్రాహ్మణుల నిరంకుశాధికారము గాదు. ధర్మమును రక్షించువఱకే వారిపని. బ్రాహ్మణుల పలుకుఁబడి రాజులపై నెట్లు జెల్లెనో, యట్లు జెల్లుటకుఁ గారణములేవో, రామాయణమున సమగ్రముగ వచ్చును. బ్రాహ్మణులెంతవఱ కథపతితులు గారో యంతవఱకును వైదికధర్మమునకు నాశములేదని యాది శంకరులు భగవద్గీతా భాష్యమున నుడివిరి. వారి వాక్యము లీ క్రిందివి.

"బ్రాహ్మణత్వస్య హి రక్షణేన రక్షిత స్స్యాద్ద్వైదికో ధర్మః" - బ్రాహ్మణులనుండి రాజులు కప్పములు గైకొనుటలేదు. వారిని దండించుటయును లేదు. ఈ విధానమునకు నేటి పెద్దలు గొంద అపవ్యాఖ్య లొనర్చిరి. ఇది విప్రులకున్న విశేషాధికారము గాదు. ఒక తప్పునకుఁ దనకు తానై శిక్షను విధించికొను ధర్మదృష్టియున్న జాతిపైన మఱల రాజదండనము పునరుక్తిగదా!

## శంఖ - లిఖితులు

బ్రాహ్మణులందలి ధర్మదృష్టి యెట్టిదని నిరూపించుటకు భారతమునం దొక కథ వచ్చును. శాంతిపర్వము, 23 వ యధ్యాయమున నిది గలదు. శంఖ లిఖితులను నిఱువురు బ్రాహ్మణులుండిరి. వారు పరస్పరము బంధువులు. వేఱు వేఱు యాశ్రమములలో వసించుచుండిరి. ఒకానొకనాఁడు శంఖునిఁ జూచుటకై లిఖితుఁ డాశ్రమమునకు వచ్చెను. అపుడు శంఖుఁ డాశ్రమమున లేఁడు. లిఖితుఁ డొకానొక యాశ్రమ వృక్షమునందలి పండును గైకొని భుజించెను. కొంతసేపటికి, శంఖుఁడు దిరిగి వచ్చినాఁడు. లిఖితుఁడు ఫలమును దిన్న సంగతిని శంఖుఁడు గ్రహించి "యీ ఫలము నెక్కడనుండి దెచ్చితి"వన్నాడు. "మీ యాశ్రమ వృక్షమునందలి ఫలమే యిది! దానిని భక్షించితిని" అని లిఖితుఁడు బదులొసఁగెను. అప్పుడు శంఖుఁ డన్నాఁడు. "నన్నడుగక, నా యాశ్రమమునందలి ఫలమును నీవు భుజించుట ధర్మశాస్త్రము ప్రకారము చౌర్యము. ఈ తప్పునకు శిక్ష ననుభవించుట నీ కర్తవ్యము. అందుచే నీ విపుడేరాజుకడ కేగి, నీ దోషమును దెలిపి, దండము ననుభవించి రావలెను." దీనికి లిఖితు డంగీకరించెను. అతఁడు రాజుకడ కేగెను. తన చౌర్యమును దెలిపి, "శిక్ష విధింపవలెన"ని బ్రార్థించినాఁడు. రాజాతనిని మఱలింపఁ జూచెను. లాభము లేకపోయెను. కడకు ధర్మదృష్టిగల రాజు, ధర్మనిష్ఠుఁడైన లిఖితుని హస్తములను నఱికించెను. లిఖితుఁడు వెనుదిరిగి

వచ్చినాఁడు. ఇంత గొప్ప ధర్మదృష్టిగల యొక జాతిపై మఱల రాజు గల్పించికొని చేయవలసిన విచారణయేమున్నది? అందుకే, వారి నదండ్యు లనిరి. బ్రదుకునకై తా మెవరిని నాశ్రయింపక బీదఱికమునే యనుభవించుచు, లోక కల్యాణమునకు యీ జాతి బ్రదుకుచుండెను. అట్టి వారిపై యీర్ష్య యెవరికుండును? ఇట్టి యీ జాతి నష్టమైనపుడు, భ్రష్టమైనపుడు, భారత సంస్కృతి నశించును. విప్రజాతి తేజోవిశిష్టమై యున్నప్పుడు సమాజము సర్వతోవికసితమై యుండును. మహాభారతము వచించు సామాజిక నియమ మిదియే!

బ్రాహ్మణుఁడు ధర్మచ్యుతుఁ డైనపుడు వానికి సమాజమున నొక ప్రత్యేక గౌరవము లేదు. బ్రదుకు తెఱువునకై వాఁ డన్యవృత్తి నవలంబించినపుడు, విప్రుఁడుగూడ నలుగురితోటి వాఁడే! ఈ విషయమును భారతము స్పష్టముగఁ జెప్పుచున్నది. ఇంతమాత్రమే గాదు. బ్రాహ్మణజాతి యందే, బ్రహ్మ, క్షత్ర, వైశ్య, శూద్రులున్నారనియు నా మహాగ్రంథమే నుడివినది. లౌకికుఁడైన బ్రాహ్మణునుండి దయ యేమాత్రమును లేక సేవ జేయించికొనవలెను. వెట్టి పని గూడ జేయింపవలెను. అనఁగా, వాఁడొనర్చు పనికి కూలిగూడ నివ్వక పని జేయించికొనుట! ఈ విషయము లన్నియు భారతములోనివే! ఆ శ్లోకము లీ క్రిందివి.

"జన్మకర్మవిహీనా యే కదర్యా బ్రహ్మబంధవః
ఏతే శూద్రసమా రాజన్! బ్రాహ్మణానాం భవం త్యుత.

...... ...... ......

.... ..... ......

నియమ్యా స్సంవిభజ్యాశ్చ ధర్మానుగ్రహకారణాత్"

(భార. శాం. అ. 76)

పై శ్లోకముల యర్థమిది. భీష్ముఁడు యుధిష్ఠిరునితో ననుచున్నాఁడు. "ధర్మరాజా! జన్మసిద్ధమైన, జాత్యనుకూలమైన కర్మమును విడచి, వర్తించు బ్రాహ్మణబ్రువుఁడు శూద్రునితో సమానము. వేదమును పఠింపనివారు, అగ్ని నుపాసింపనివారు నీచ బ్రాహ్మణులు. ధార్మికుఁడైన రాజు వీరినుండి కప్పమును గ్రహింపవలెను. వెట్టి చాకిరి జేయింపవలెను. ఋత్విజుఁడు, పురోహితుఁడు, మంత్రి, దూత, వార్తానుకర్షకుఁడు వీరు బ్రాహ్మణులలో క్షత్రియులు. అశ్వారోహకులు, గజారోహకులు, రథముల నెక్కువారు, పదాతులు, వీరు వైశ్యులు. హీనకోశుఁడైన మహీపతి వీరినుండియు కప్పమును గ్రహింపవలెను. దేవకల్పులును, బ్రహ్మకల్పులును నగు విప్రులనుండి మాత్రమే రాజు కప్పమును దీసికొనరాదు. ఆ బ్రాహ్మణుల విత్తమునకు వైదిక ధర్మము ననుసరించి రాజే యధికారి. కనుక జాతి ధర్మమును విసర్జించిన బ్రాహ్మణుని విత్తమునకును రాజధికారి. అట్టివానిని నరపాలుఁ డెన్నటికి నుపేక్షింపరాదు. ఇతరులవలెనే వానిని గూడ నియమింపవలెను. వానికి సంఘమునందే ప్రత్యేకతయు నొసఁగరాదు. ఇట్లు వర్తించుటయే నృపాలునకు ధర్మము. బ్రహ్మసముఁడు, దేవసముఁడునైన బ్రాహ్మణు డెట్టివాఁడు? ఈ విషయమున మహాభారత మొసఁగిన తీర్పిది.

యుధిష్ఠిర ఉవాచ:-

"స్వకర్మ ణ్యపరే యుక్తా స్తథైవాన్యే వికర్మణి
తేషాం విశేష మాచక్ష్వ బ్రాహ్మణానాం పితామహ

భీష్మ ఉవాచ:-

విద్యాలక్షణ సంపన్నాః సర్వత్ర సమదర్శినః
ఏతే దేవసమా రాజన్ బ్రాహ్మణానాం భవం త్యుత

(మ. భా. శాం. ప. అ,. 76.)

-యుధిష్ఠిరుఁ డడుగుచున్నాఁడు "తాతా! దేవసములు, బ్రహ్మసములునైన బ్రాహ్మణులెట్టివారు?

భీష్ముఁడు బదులిచ్చుచున్నాఁడు. "నాయనా! విద్యాలక్షణ సంపన్నులు, సర్వముల యందును సమదర్శనులైన బ్రాహ్మణులు బ్రహ్మసములు. ఋగ్యజుస్సామాది విద్యలయందు నిష్ణాతులు, స్వకర్మపరులునైన విప్రులు దేవసములు.

## బ్రాహ్మణ్యముయొక్క భంగము

మహా భారత కాలమునందుఁ, దక్కిన వర్ణములవారి కాదర్శముగ నుండదగిన బ్రాహ్మణ వర్గమున కథఃపతనము సంభవించినది. భారత సంస్కృతికి బ్రాహ్మణ సంఘము మూలస్తంభము వంటిది. అట్టివారు ధర్మవిముఖు లగుటతోఁ దక్కిన వర్ణములుచెప్పకయే భ్రష్టములైనవి. ఒకానొక వ్యక్తి చెడిపోయినచో, దేశమున కంత నష్టములేదు, కాని యొక జాతియే చెడినప్పుడు దానివలన దేశమునకుఁ గలుగునష్ట మింతంతగాదు. అట్టి యధఃపతనము క్షమింపరానిది. సరిగా నా పరిస్థితియే, శ్రీకృష్ణుని యవతారమునకు ముందు జరిగినది. విప్రులయధోగతికి ప్రతీకయే భారతమునందలి ద్రోణాచార్యులు.

ఆ ద్రోణాచార్యుఁ డొక మహర్షి. ఇది ప్రసిద్ధమైనది. ఋషి జీవనమే యతనికి యుక్తము. కోమలములైన, కర్కశములైన వికారముల నన్నిటి నాతఁడు జయింపవలెను; సరిగదా! వికారములే యాతని జయించెను.

ద్రోణుఁడు శస్త్రములను ధరించెను. కాని, యంతమాత్రముతో నతఁడు పతితుఁడు గాలేదు. విప్రుఁడు శస్త్రధారియగుట నిషిద్ధముగాదు. కొన్ని విశిష్ట సమయములలో బ్రాహ్మణుఁడు శస్త్రము ధరింపవలెనని వైదికధర్మము బలుకును.

కాని, ద్రోణుని యధఃపతన మిందుకు భిన్నమైనది. ఇతఁడు భరద్వాజుల పుత్రుఁడు. ఆ కాలమున సర్వ క్షత్రియులకును ధనుర్వేదమున నాచార్యుఁడు. చిన్నతనమున ద్రోణుఁడధ్యయన మొనర్చుచున్నప్పుడు, ద్రుపదమహారా జాతనికి సహాధ్యాయి. వారిర్వుర కమితమైత్రి. "నేను రాజునైన తరువాత నీ కర్ధ రాజ్యమొసఁగెద"నని ద్రుపదుఁడు ద్రోణునకు వాగ్దానమొనర్చెను. అధ్యయనము ముగిసినది. ద్రుపదుఁడు వెడలిపోయెను. అతఁడు పాంచాలరాజైనాఁడు. ద్రోణునకు వివాహమైనది. అశ్వత్థామయను సుతుఁడు జన్మించెను. ద్రోణుఁ డప్పటికిని దారిద్ర్యమునే వలచి, ఋషితుల్యమైన జీవనమునే గడుపుచుండెను. ఏది యెట్లైనను, రాజుల నాశ్రయించి వారి సేవ యొనర్పరాదని ద్రోణుల యభిప్రాయము. దారిద్ర్యమున కాతనిపై యధికారము లేకుండెను. ఆ దుఃఖముల నన్నిటి నాతఁ డోర్మితో సహించెను. కాని యింతలో నాతని హృదయమును బుత్రస్నేహ మాక్రమించినది. ఇది పుష్పశృంఖల. ఈ ప్రేమ బంధ మెంత లలితమైనదో, దీనినుండి విడివడుట యంతకష్టము. ఖదిరాంగారసదృశుఁడైన ద్రోణుని చిత్తవృత్తి నీ ప్రేమ జయించెను. అశ్వత్థామ పాలకొఱ కేడ్చుచుండెను. ఇరుగు పొరుగుల నున్న పిల్లలు దండిగా పాలుద్రావుచుండిరి. అశ్వత్థామకు పాలు లభించలేదు. వాఁడు మొండికి వేసెను. తల్లి యోదార్చెను. లాభము లేకపోయినది. కడ కామె బియ్యపుపిండిని గలిపి 'యివే పాలు త్రావు'మన్నది. అశ్వత్థామ తల్లి మాటలను నమ్మి వానినే త్రాగినాఁడు అపుడు ద్రోణుఁ డెదుటనే యుండెను. ఆ దృశ్యమాతని హృదయమును గలఁచినది. అతని నిశ్చయము గొంత సడలినది. ద్రోణుఁ డిట్లు దలచినాఁడు.

"హాస్యతా ముపసంప్రాప్తం - కశ్మలం తత్ర మేఽభవత్
ఇతి సంభాషతాం వాచం శ్రుత్వా మే బుద్ధి రచ్యవత్"

(ఆది. ప. అ. 131)

"పేదరికము యొక్క వికృతరూపమును నేను జూచితిని సర్వవిద్యల యందును సాటిలేని ద్రోణాచార్యుని సంతానమునకుఁ ద్రాగుటకు పాలు లేవట! ఇట్టి బ్రతుకెందుకు? ఈ సన్నివేశము నా హృదయము నెక్కువగ గలఁచెను. నా నిశ్చయము గొంత చలించెను." అప్పటికిని -

"పరోపసేవాం పాపిష్ఠాం - న చ కుర్యాం ధనేప్సయా"

(ఆ. ప. 131. అ. 59, వ. శ్లో)

"ధనాశతో పాపిష్ఠమైన పరులసేవను జేయరాదు" అన్న నిశ్చయము మాత్రము పూర్తిగ సడలలేదు. అపుడు నాలో నిట్లనుకొంటిని. ద్రుపదుఁడు నా మిత్రుఁడు గదా! అతని కడకేగి, నామైత్రి యాతని కెఱుక పఱతును. సాహాయ్యమును వేడుదును.

ద్రోణుఁడు ద్రుపదుని కడకేగెను. వాఁడు మదోన్మత్తుఁడు. ద్రోణుని మాటలకు ద్రుపదుఁడు నవ్వినాఁడు. నవ్వి వాఁడిట్లు జవాబు చెప్పెను.

"అపీ త్వఖ్యం ద్విజశ్రేష్ఠ! త్వయా మేఽర్థనిబంధనం
ఏవ ముక్త స్త్వహం తేవ పదారః ప్రస్థిత స్తదా"

(ఆ. ప. 131. వ అధ్యా).

"ఓ బ్రాహ్మణా! బాల్యము నందు నీతో నెఱపిన మైత్రి నా స్వార్థమును సాధించి కొనుటకే! దరిద్రునితో శ్రీమంతునకు, మూర్ఖునితో విద్వాంసునకు, షండునితో శూరునకు మైత్రి యెన్నటికిని బొసఁగదు. రాజులకు నీవంటి బ్రాహ్మణులతో మైత్రియా? రాజులకు రాజులతో మైత్రి. నీ కర్ధరాజ్యమిత్తునని నేనన్నట్లు నాకు జ్ఞాపకము లేదు. ఎట్లును, వచ్చినావు గనుక యీ రాత్రికి భోజనము పెట్టింతును, తిని పొమ్ము."

ఈ మాటలకు ద్రోణుని మనస్సు గలఁగినది. ఉన్మత్తుఁడైన రాజును జూచి యాతని కమితమైన కోపము గలిగెను. అక్కడ నుండి ద్రోణుఁడు గౌరవుల నాశ్రయింపఁ బోయెను. భీష్ముఁ డాతని విద్యను బరీక్షించి, కురు కుమారులకు గురువుగ నొనర్చి, యాశ్రయమిచ్చినాఁడు. నాటినుండి స్వతంత్రుఁడైన ద్రోణుఁడు సేవాపరుఁడైనాఁడు. మునివలె యాశ్రమమునందు వసించి విద్యాదాన మొనర్చు చుండిన ద్రోణుఁడు కౌరవు లొసఁగు భృతిని గ్రహించి బ్రదుకుట నేర్చికొనెను. ఇట్టి వారిని గూర్చి భారత మిట్లన్నది-

"రాజ్య ప్రేష్యో య శ్చ భవే ద్వికర్మా
రాజ న్నేతాన్ వర్జయేత్ దేవకృత్యే"

(శాం. ప. అ. 63)

రాజుల నాశ్రయించి బ్రదుకు బ్రాహ్మణుఁడు వికర్ముఁడు. వానిని దైవిక కార్యములందు నియోగింపరాదు.

ద్రోణుల స్థితి సరిగా నిట్లే యయ్యెను. అతఁ డప్పటి నుండి, స్వాతంత్ర్యమును బోగొట్టికొన్నాఁడు. వారిఁ నిదేశముతో ద్రోణుఁడు యకృత్యములను గూడ గావింపవలసి వచ్చెను. వసిష్ఠులకున్న గౌరవము ద్రోణున కంటి రాలేదు. వసిష్ఠులు సూర్యవంశమునకు గురువు. ద్రోణుఁడు కౌరవులకు భృత్యుఁ డయ్యెను. అందుచే వీరిర్వురకును బోలికయే లేదు. వసిష్ఠు లే మాత్రము జంకులేక సూర్యవంశము నాజ్ఞాపింతురు. ద్రోణున కట్టి యోగ్యత పోయినది. అతఁడు వారిచేతి కీలుబొమ్మ.

# ద్రోణుని యధఃపాతము

రాజసేవకు లోఁబడిన తరువాత, ద్రోణునకు ప్రత్యేకతయే పోయినది. వారు నిర్ణయించిన యధర్మములను సైతత మాతఁ డనుభవింప వలసి వచ్చెను. ఆతనికన్న నెన్నోరెట్లు తక్కువైన వారుగూడ, ద్రోణులను నిందించి యవమానించుటకు బూనుకొనిరి. కాని యాతఁడు పరసేవ నాశ్రయించినను దన తేజస్సును. పూర్తిగ గోలుపోలేదు. అందుచే గలిగిన యవమానములను దిగమ్రింగికొని యెట్లో యొకరీతి శాంతిని గాపాడు కొనెను. ద్రోణుఁ డవమానముల పాలైన కొన్ని ఘట్టములు మహాభారతము నందే వచ్చును.

ద్రుపదుని నగరమున పాండవులు బయలుపడిరి. ఈ విషయమును దెలిసిన కౌరవులు పాంచాలురపై దండెత్త వలెనని యాలోచించు చుండిరి. ఆ సభలో ద్రోణాచార్యుఁడు గూడ నుండెను. అతఁడు సమ్మాన పూర్వకముగ పాండవులను బిలిపింప వలెనని హితము జెప్పెను. వెంటనే సభయందుండిన కర్ణుఁడు దుర్యోధను నుద్దేశించి యిట్లు పలికెను-

"యోజితా వర్ధమానాభ్యాం సర్వకార్యే ష్వనంతరే
న మంత్రయేతాం త్వచ్ఛ్రేయః కి మద్భుతతరం తతః"

...... ...... ......

...... ...... ......

దుష్టానాం చైవ బోద్ధవ్య మదుష్టానాంచ భాషితం ॥

"రాజా! భీష్ముఁడు ద్రోణుఁడు వీరిర్వురను నీవెంతయో సమ్మానింతువు. ప్రతి ప్రసంగమునందును వారి మాటలకు గొప్ప గౌరవము నొసఁగెదవు. కాని యేమి లాభము కలిగినది? వారిర్వురును నీ హితచింతకులు గారు. వారి కంగిట బెల్లము, ఆత్మలోవిషము. నీయెదుట తీయఁగ మాటలాడుదురు.

పాండవులకు క్షేమము నిచ్చింతురు. ఇట్టి వారు మిత్రులు గారు. రాజైనవాఁడు దన మంత్రులలోఁ దనకు 'హితచింతకుఁ డెవ్వఁడు, కానివాఁడెవ్వ' ఁడని గమనించి వర్తింపవలెను."

భార్గవరామునకు గాని, వసిష్ఠునకు గాని యిట్టి సన్నివేశము లెప్పుడును దటస్థపడలేదు; పడినచో వారెంతయో తీక్షణముగ బదులొసఁగి యుందురు. వారు స్వతంత్రులు గనుక. జీత బత్తెములను గ్రహించి కౌరవుల నాశ్రయించి బ్రతుకుచున్న ద్రోణుని మాట కా వెల యేదీ? అతనికొక ప్రత్యేకతయు లేదు. ఈవిషయమునే వస్త్రాపహరణ ప్రసంగమున ద్రౌపది "ద్రోణస్య చ నాస్తి సత్త్వం" యని స్పష్టముగా నన్నది. మహాసతియైన ద్రౌపదిని సభలోని కీడ్చుకొని వచ్చిరి. అట్లు దెచ్చుట దురాగతములలో దురాగతము. దీనికిఁ బ్రతి ఫలముగ ద్రోణుఁడు వెంటనే దన మహాస్త్రములచేత నా రాజకులము నంతయు దగ్ధ మొనర్పవలసి యుండెను. బ్రాహ్మణుఁ డెవ్వనికిని దాసుఁడుగ నుండవలసినది లేదు. కాని యా సాహసము ద్రోణునకు లేకపోయినది. ఇంతేగాదు. ఇంతకంటెను గ్రిందికి దిగజారిన ఘట్టము గూడ నాతని జీవితమున గలదు.

బ్రాహ్మణుఁ డస్త్రమును ధరింపవలసిన సన్నివేశము లేవి? ఈ విషయమును విచారించుచు "ధర్మశాస్త్ర" మిట్లు తీర్పు జెప్పినది.

"శస్త్రం ద్విజాతిభి ర్గ్రాహ్యం ధర్మో యత్రోపరుధ్యతే".

- ధర్మమునకు హాని సంభవించినప్పుడు ధర్మసంరక్షణార్థమై బ్రాహ్మణుఁడు శస్త్రము ధరింపవలెనని" దాని యర్థము.... పాంచాలిని సభ కీడ్చి తెచ్చి వివస్త్రను జేయ [illegible]త్నించుట గొప్ప యధర్మము. జూదమునందు పాండవుల రాజ్యమును హరించి వెడలనడచుటయు ధర్మనాశమే! ఇంతేకాదు. పాండవులపై విషప్రయోగములు మొదలైనవి యొనర్చుటయు, లాక్షాగృహమును దహింపనెంచుటయు పంచ మహా

పాపముల కోటిలోనికిఁ జేరినవి. ఇట్టి యవసరములందు ద్రోణుఁడెదురు తిరుగవలసి యుండెను. పాపులను సర్వనాశ మొనర్పవలసి యుండెను. అతని కస్త్రవిద్య నొసఁగి యాశీర్వదించినవాఁడు భార్గవ రాముఁడు. ధర్మరక్షణార్థమే యాతఁ డస్త్రవిద్యను ధారవోసెను. కాని లాభమేమి? దుర్యోధనాదులను ద్రోణుఁడు సంహరింపలేదు. అందుకు విరుద్ధముగ ద్రౌపదీ వస్త్రాపహరణమును ప్రత్యక్షముగ నొనర్చిన దుశ్శాసనుని, వస్త్రాపహరణమున కాజ్ఞ యొసఁగిన కర్ణుని, వీని నన్నిటిని జూచి సంతోషించుచున్న దుర్యోధనుని రక్షించు బాధ్యత మాత్రము దన తలపై వేసికొన్నాడు. వస్త్రాపహరణమును జూచిన భీముఁ డొడలు మఱచినాఁడు. అతఁడు భీష్మ ప్రతిజ్ఞ లొనర్చెను. దుర్యోధనుని తొడలు దునుముదు ననెను. దుశ్శాసనుని నెత్తురుద్రావుదు ననెను. పాండవు లరణ్యావాసములకుఁ బోయినారు. భీముని సామర్థ్యమును వాని ప్రతిజ్ఞలను దలఁచి దుర్యోధనుఁడు, కర్ణుడు, దుశ్శాసనుఁడు, శకుని, మొదలైనవారందరు మనస్సులయందు భయపడిరి, భయపడి ద్రోణుల నాశ్రయించిరి. అపుడు ద్రోణాచార్యుఁడు వీరందరి కభయమొసఁగెను. ఈ కథ భారతమునం దిట్లున్నది.

"తతో దుర్యోధన! కర్ణః శకునిశ్చాపి సౌబలః

...... ..... .....

...... ..... .....

నోత్సహేయం పరిత్యక్తుం దైవం హి బలవత్తరం ॥

(సభాపర్వము అ॥ 80)

"తరువాత దుర్యోధనాదులు భీముని బాహుబలమును దలఁచి యెంతయో భయపడిరి. తమ్ము రక్షించుటకు ద్రోణుఁ డొక్కఁడే తగినవాఁడని వారు నిర్ణయించికొన్నారు. వారందఱు ద్రోణుని సమీపించి తమ్ము రక్షింపవలెనని ప్రార్థించిరి. అపుడు వారి నుద్దేశించి ద్రోణుఁ డిట్లనెను. "మీ రందఱు నా

శరణము నర్థించి వచ్చితిరి. మిమ్ము రక్షించుట నా ధర్మము. అందుచే ధార్తరాష్ట్రులను, వారి సహాయకులను నా యోపినభంగి రక్షింతును. ప్రేమ పూర్వకముగ మీయందరికి సహాయ మొనర్తును. కాని దైవము బలవత్తరము అయినను మిమ్ము నేను వదలను."

ద్రోణుఁ డన్న మాటలు బ్రాహ్మణ్యమున కప్రతిష్ఠాకరములు. భీష్మపర్వముయొక్క మొదట 'అర్థస్య పురుషో దాసః' యను మాటలు ద్రోణముఖమున వ్యాసులు బలికించిరి. 'మానవుఁడు పైకమునకు బానిస' యని దాని యర్థము. ఈ మాటలు ద్రోణుఁడనుట యాతని బ్రాహ్మణత్వ మెన్నఁడో జాతిపోయె నని తెల్పుచున్నది. కడ కధర్మాత్ములైన కౌరవుల పక్షమునే ద్రోణుఁ డాశ్రయించెను. వారిని రక్షించుటకై పాండవులపై కత్తి ఝుళిపించెను ఇంతేకాదు, "అస్త్రజ్ఞుఁడైన వాఁడు అస్త్రజ్ఞానము లేని సామాన్యులను జంపగూడ దను యుద్ధ నియమమును గూడ నాతఁడు బాటింపలేదు. ద్రోణపర్వమున భీముఁ డాచార్యునితో నిట్లనుచున్నాఁడు

"శ్వపాకవత్ మ్లేచ్ఛగణాన్ హత్వాచాన్యాన్ పృథగ్విధాన్
అజ్ఞానా న్మూఢవ ద్బ్రహ్మన్! పుత్రదారధనేప్సయా!!

"ఆచార్యా! దారాపుత్రులను రక్షించికొనుటకై ధనాశ వెంట దవిలిన నీవు మూర్ఖునివలె బ్రవర్తించుచున్నావు. ఏ మాత్రము విచక్షణ లేక కనపడినవారి నెల్ల సంహరించుచున్నావు. ఇది న్యాయముగాదు."

భీమ్ము డొనర్చిన యారోపణలో నసత్యములేదు. ద్రోణపర్వమునందే ఋషులు ధనురాచార్యుని నిట్లు మందలించిరి.

"బ్రహ్మాస్త్రేణ త్వయా దగ్ధా అనస్త్రజ్ఞా నరా భువి
యదేత దీదృశం విప్ర! కృతం కర్మ న సాధు తత్!
(ద్రో॥ ప॥ అధ్యా 190)

"ఓ బ్రాహ్మణా! బ్రహ్మాస్త్రమును నీవు బ్రయోగించి యస్త్రవిద్య దెలియని మనుజులనందరిని జంపితివి. ఇది నీవంటి వాఁడు సేయఁదగిన పనిగాదు."

ఇంతకన్నను ద్రోణున కధః పతనము మఱేమిగావలెను! ఇట్టి యనుచిత కర్మ లెన్నడైన నొనర్చునేమో యన్న భయముతోనే ద్రోణుఁడు కర్ణునకు బ్రహ్మాస్త్ర ముపదేశింపలేదు. అశ్వత్థామకుఁ గూడ బ్రయోగమును మాత్రమే దెలిపి యుపసంహారమును బోధింపఁ డయ్యెను. కాని లాభమేమి? తానే యా యకార్యము నొనర్చెను. ద్రోణుల చిత్తము ధర్మాత్ములైన పాండవులవైపు. శరీర మధర్మపరులైన కౌరవుల బత్తెముతోఁ బోషింపఁబడెను. భారతము నందలి ద్రోణులస్థితి త్రిశంకుస్వర్గమువంటిది. అతని చిత్తవృత్తిని వ్యాసులు భారతమునం దెంతయో నిపుణముగ నడిపిరి. ద్రోణ పుత్రుఁడైన యశ్వత్థామ బ్రాహ్మణ్యముయొక్క యధః పతనమునకు బరాకాష్ఠ. ధనురాచార్యునితో బ్రారంభమైన నీచత్వము అశ్వత్థామలోఁ నెల్ల లందికొన్నది.

## అశ్వత్థామ

అశ్వత్థామ యొనర్చిన సౌప్తిక వధ యాతని రాక్షసవృత్తికి ద్యోతకము. మానవుని నీచత్వ మింతకు మించియుండదు. ఈతఁ డొనర్చిన పిశాచ తాండవము యొక్క గాథ సౌప్తిక పర్వములోని గొన్ని యధ్యాయముల నిండ యున్నది. సౌప్తికవధనాటినుండి కాపట్యమున 'కశ్వత్థామ సంప్రదాయ' మను మాఱుపేరు వెలసినది. తన పుత్రుఁ డిట్టి ఘనుఁడని ద్రోణుఁడు ముందే యెఱుఁగును. అందుకే యాతనికి బ్రహ్మాస్త్రము యొక్క యుపసంహారమును బోధింపలేదు. తొట్టతొలుత ద్రోణుఁడు పుత్ర స్నేహమునకు లోఁబడి బ్రహ్మాస్త్రమును బోధింప దొరకొనెను. కాని యశ్వత్థామ గుణసంపత్తి ద్రోణునకు చిన్ననాటనే వాసన వచ్చినది. వీఁడు దుష్టుఁడగునని యాతఁడు గ్రహించెను. అందుచే నశ్వత్థామ

బ్రహ్మాస్త్రము నెప్పుడు గూడ బ్రయోగింప గూడదను నుద్దేశముతో ద్రోణుఁ డాతని కుపసంహార ప్రకార ముపదేశింపలేదు. ఈ సందర్భ మిట్లున్నది.

"విదితం చాపలం హ్యాసీత్ ఆత్మజస్య దురాత్మనః

..... .... .....

..... .... .....

ఇద మస్త్రం ప్రయోక్తవ్యం మానుషేషు విశేషతః

దురాచారియైన యశ్వత్థామ చాపల్యము ద్రోణునకు దెలియును. అందుచే నాతఁ డశ్వత్థామతో నిట్లనెను. "పుత్రా! బ్రహ్మాస్త్రము భయంకరమైనది. ఎంతటి యాపత్తు సంభవించినను దీనిని నీవు మానవులపైకిఁ బ్రయోగింపరాదు."

కాని యశ్వత్థామ యా మాటలను లక్ష్యపెట్టనే లేదు. ఉత్తర వంటి గర్భవతియైన స్త్రీ పైనఁగూడ నాతఁడా యస్త్రమునే యుపయోగించినాఁడు. భారతము సౌప్తిక పర్వము పండ్రెండవ యధ్యాయమున నింకొక చిత్ర కథ వచ్చును. అది యిది: కృష్ణుని నుండి సుదర్శనాయుధ ముపదేశము నంది మఱల దాని నాతనిపైననే బ్రయోగింపవలెనను నొక యిచ్ఛ గూడ నశ్వత్థామ కుండెనట! భ్రూణహత్య మొదలుకొని, బాలహత్య మొదలుకొని, యే పాపము నొనర్చుటకైనను యశ్వత్థామ జంకినవాఁడు గాఁడు. సామాజిక నియమముల కేది యాధారమో, సంస్కృతి సంరక్షణమున కేది మూలస్తంభమో యిట్టిబ్రాహ్మణజాతి భారతకాలము నాటి కింతగాఁ జెడిపోయినది. ధనబలమునకు బ్రాహ్మణులు లోఁబడిరి. వైరాగ్యము వారియందు నామమాత్ర మయ్యెను. జ్ఞాన మడుగంటెను. ఇంతకన్న నధర్మ మేమి గావలెను? బ్రాహ్మణవర్గము యిట్లు నాశనమై పోయినది. గమనించినచో నాకాలమున వీరికంటెను క్షత్రియులే మెఱుగనిపించును. ఈ యధర్మము నణచుటకే నాఁడు కృష్ణుఁడు భూమిపై నవతరించెను. భారతకాలము నందలి భారతీయ రాజ్య సంస్థల స్వరూప మెట్టిదో పైని వివరింతును.

# భారతీయరాజ్య సంస్థయొక్క స్వరూపము

మహాభారతము ననుసరించి రాజ్యసంస్థ భారతీయ సంస్కృతికి సముదితస్వరూపము. కాని యది స్వయంభువుగాదు. దానికొక హేతువు గలదు. దండనీతి లేక రాజ్యానుశాసనము, సమాజముయొక్క ధారణ, పోషణ వికసనముల కత్యంత మావశ్యకమైనది. భారతీయ సమాజ శాస్త్రకారు లీ రహస్యమును ప్రాచీనకాలమునందే గమనించిరి. భారతమున రాజధర్మ మెంతయో ప్రపంచింపఁబడినది. అధ్యాయములపై నధ్యాయములు దాని గొప్పతనమును వివరించుటకై ఖర్చుపెట్టఁబడినవి. భారతము శాంతిపర్వము, 63వ యధ్యాయమున నిటు గలదు.

"యథా రాజన్ హస్తిపదే పదాని సంలీయంతే సర్వ సత్వోద్భవాని
సర్వా విద్యా రాజధర్మేషు యుక్తాః సర్వే లోకా రాజధర్మేప్రవిష్టాః ॥

"ఏనుగుయొక్క యడుగునందుఁ దక్కిన యన్ని జంతువుల పాదములు నిమిడిపోయినట్లు రాజ ధర్మమందు సమస్త ధర్మములు నొదిగిపోవుచున్నవి. తక్కిన ధర్మముల స్వరూపము చిన్నది. అవి యల్పాశ్రయములు; అల్ప ఫలములు. క్షాత్ర ధర్మము మాత్రము మహాశ్రయము. బహుకళ్యాణ రూపము. ఈ గౌరవము మఱియొక దానికి లేదు. సర్వధర్మములను రాజ ధర్మము నాశ్రయించియే బ్రదుకుచున్నవి. అన్ని జాతులకును బోషక మదియే. రాజధర్మము కొఱకై నృపాలుఁడు దక్కిన ధర్మముల నన్నిటిని వదలుకొనును. అది గొప్ప త్యాగము. త్యాగమును మించిన ధర్మము లేదు. ధర్మనీతి నష్టమైనప్పుడు, మూఁడు వేదములు నశించును. బద్ధ మూలమైన ధర్మవృక్షము బెల్లగింపఁబడును. క్షత్ర ప్రధానమైన రాజ ధర్మము పరిత్యక్తమైనచో నిక యాశ్రమ ధర్మముల కాధారము లేదు. రాజ ధర్మమందే సర్వ ప్రకారమైన త్యాగమున్నది. దానియందే దీక్షగలదు. సర్వవిద్యలు గూడ నందు జేరిపోవును. సర్వలోకములును రాజధర్మము చేతనే రక్షితములు.

# దండనీతిలోని గొప్పతనము

దీని ప్రాధాన్యమును భారతీయు లతి ప్రాచీనకాలముననే గ్రహించిరి. ఇది లోకమునందలి దుష్ప్రవృత్తుల స్వేచ్ఛా విహారమున కడ్డుకట్ట. ధర్మము, సంస్కృతి, నీతి యివి రక్షింపఁబడుటకు దండనీతియే ప్రధాన కీలకము. త్రికాలాబాధితమైన దండనీతియొక్క మాహాత్మ్యము భారతమున బలుమారు బ్రశంసింపఁ బడినది, ఆ గ్రంథ మిట్లన్నది.

"కర్మణా వై పురా దేవా ఋషయ శ్చామితౌజసః

త్రాతాః సర్వే ప్రసహ్యారీన్ క్షత్రధర్మేణ విష్ణునా

యది హ్యసౌ భగవా న్నాహనిష్య ద్రిపూన్ సర్వా నసురా నప్రమేయః

న బ్రాహ్మణా న చ లోకాదికర్తా నాయం ధర్మో నాది ధర్మోఽభవిష్యత్ ॥

(శాంతి॥ అ॥ 64)

శ్రీ మహావిష్ణువు క్షాత్ర ధర్మమునకు శత్రువులైన వారిని సంహరించుటకు సమ్మతించెను. అతఁడు వారిని నాశ మొనర్చి దేవతలు ఋషులు మొదలైనవారిని రక్షించెను. అప్రమేయుఁడైన విష్ణువు క్షాత్రధర్మ బాధకులైన యసురులను సంహరింపకున్నచో బ్రాహ్మణులు లేరు. ధర్మము ప్రజాపతి. ఈ ధర్మములు సర్వమును లుప్తములై యుండెడివి. లోకమున దుష్ప్రవృత్తు లనేకములు. పరస్పర వైషమ్యము స్వార్థము మొదలైన హీన ప్రవృత్తులు భూమిపై నెప్పుడును దాండవ మాడుచుండును. "బలము గలవాఁడే నిలువగలవాఁ" డన్న న్యాయము ప్రవర్తిల్లుచుండును. ఈ దుర్మార్గముల నణచుటకు రాజదండమే గావలెను. రాజు లేనిది న్యాయమేమి, జీవనము గూడ జరుగదు. 'అరిస్టోటల్' 'ప్లేటో' మొదలగు విజ్ఞానవేత్తల కన్న నెంతయో ముందుగనే భారతఋషు లీ సత్యమును గ్రహించిరి. గ్రహించి యుద్ఘోషించిరి.

# అరాజకత - దాని విషేధము

"రాష్ట్రస్యైత త్కృత్యతమం రాజ్ఞయేవాభిషేచనం
అనింద్ర మబలం రాష్ట్రం దస్య వోభిభవంత్యుత.
"సవేత్సమనుపశ్యేత సమగ్రం కుశలం భవేత్
అదాసః క్రియతే దాసో హ్రియంతే చ బలాత్ స్త్రియః
(25 శ్లో॥)

..... ..... ..... .....

"పరస్పరం భక్షయంతో మత్స్యాఇవ జలే కృశాన్"
(శాంతి॥ 67 వ అధ్యా॥)

"రాష్ట్రజనులు రాజు నభిషేకింపవలెను. రాజులేని రాష్ట్రమును దస్యులాక్రమింతురు. అరాజకమైన రాష్ట్రమున ధర్మము నడువదు. జను లొకరి నొకరు బెరికికొని తిన నారంభింతురు. అరాజక రాష్ట్రములందు వసింపరాదు. న్యాయపరిపాలనము లేని రాష్ట్రములందలి యాహుతుల నగ్ని గ్రహింపదు. అరాజకమున కన్నను పాపకారకమైన పరిస్థితి బ్రపంచమున లేదు. విచారించువారు లేనప్పుడు అదాసులు దాసులగుదురు. స్త్రీలను జనులు బలవంతముగ నపహరింతురు. ఈ యపాయమును దప్పించుటకే దేవతలు బ్రజాపాలకుని సృష్టించిరి. అరాజకమైన దేశమున పెద్ద చేపలు చిన్న చేపలను భక్షించునట్లు దుర్మార్గులు హీన బలులను నాశమొనర్తురు. అట్టి రాష్ట్రము లందలి ప్రజలు నశింతురు.

ఇట్లు క్షాత్రధర్మముయొక్క గొప్పతనమును భారతమెంతయో బ్రశంసించెను. అరిస్టోటలు గూడ రాజధర్మముయొక్క గొప్పతనము నగ్గించెను. కాని యతనివలె నార్య ఋషులు రాజ్యతంత్రము స్వయ ముద్భూతమని యంగీకరింపలేదు. ఐనచో రాజ్యతంత్రమెట్లు జన్మించినది? ఈ విషయమును భారతమెంతయో

సుందరముగ వర్ణించినది. భారతీయ సమాజ శాస్త్రజ్ఞులు సర్వజగత్తులకును జ్ఞానస్వరూపమైన చైతన్య శక్తియే మూలమని వివరించిరి. పూర్ణమైన బ్రహ్మ స్వరూపమునుండి ప్రపంచమెల్లను బహిర్గతమైనది. మఱల దానియందే యైక్యమైపోవును." అనుటయే వారి సిద్ధాంతము. అందుచే వారి దృష్టిలో రాగద్వేష విహీనులు స్థితప్రజ్ఞులైన వ్యక్తులుగల సమాజమే గొప్పది. విశ్వాత్మ భావనగల యంతఃకరణములు ధరించి సమస్త ప్రపంచమునందును సానుభూతియు, సమభావనమును, గల సమాజమును వారు భావించిరి. దానిని కృతయుగమని పిలిచిరి. ఈ యవస్థయందు సమాజములోని వ్యక్తి పూర్ణ సత్త్వగుణ సంపన్నుఁడు. అందుచే నట్టి సమాజము నార్య ఋషులు హంసస్వరూపమని సంకేతించిరి. భారతీయుల కావ్య సృష్టిలో హంస పవిత్రతకు సంకేతము. దాని యాహారము బిసతంతువులు. అది యెవ్వరికిని గీడాచరింపదు. కాని సామర్థ్య సంపన్నము. అందుచే మన సాహిత్యకారు లందఱును కావ్య సృష్టిలో రాజహంసల నెంతయో గౌరవించిరి. వేలకొలఁది యలంకారములతో దానిని వర్ణించిరి. రాజహంసతోఁ బోల్చి ప్రాచీనులు వివరించిన సమాజము వికాసమునకుఁ బరాకాష్ఠ. మానవుల చిత్తములందు పశుత్వము సంపూర్ణముగ నశించి దైవజీవన ముత్పన్నమైనపుడు అట్టి సమాజమున్నపుడు దానిని 'కృతయుగ' మందురు. ఈ యుగమునందు రాజు, రాజదండము, రాజ్య తంత్రము మొదలైనవన్నియు సమాజవికాసము నందే వీలీనమై పోవును. ఈ స్థితియే 'డాంగే' గారన్నట్లు సామ్యవాదము యొక్క 'తర' భావమ దానికే యందఱమును గాచుకొనియున్నది. ఆర్య ఋషులన్న సువర్ణ యుగమదే 'మార్క్స్' 'లెనిన్' మహాశయులన్న రాష్ట్రతంత్రము లేని స్థితి కృతయుగమందే సిద్ధించును. కాని "యిట్టి సమాజమును స్థాపించుటెట్లు?" అను విషయమున మాత్రము సామ్యవాదులతో మనకు పొత్తులేదు. ఆర్థికముగ మానవుఁడు బాగుపడినంతనే ప్రపంచమున సర్వక్షేమములును సమకూరుననుట పాక్షికమైన

దృష్టి దానిని సాధించుటకు విప్లవములు గావలెననుటయు సమంజసముగాదు. ఉచ్చకోటికి జెందిన సమాజము లోకమునందు మాటిమాటికి నుత్పన్నము గావలెననియే, సువర్ణయుగము ప్రతిష్ఠింపఁ బడవలెననియే రాజ్యతంత్రము సృష్టింపఁబడెను. కృతయుగమునం దరాజకత లేదు. రాజ్యతంత్ర విహీనమైన సమాజమున్నది. అరాజకత వేఱు. రాజ్యతంత్రముతోఁ బనిలేకపోవుటవేఱు. రాజ్యతంత్రము చేత సాధింపఁదగిన ఫలము లన్నియు సాధింపఁబడుటచే కృతయుగమున దాని యావశ్యకత లేదు. అది సమాజమున విలీనమైపోవును. అరాజకతలో నట్లుగాదు. దానిలో రాజ్యతంత్రమున కావశ్యకత యుండును. మానవులలో దుష్టప్రవృత్తులు పుంజుకొనును. కాని రాచఱికముండదు. భారత ఋషుల దృష్టిలో నీ సువర్ణ యుగ మొకప్పు డుండెను. ఇంతేగాదు. మాటిమాటికిని చతుర్యుగములును చక్రనేమి క్రమమున దిరుగుచుండును. అది దాని స్వభావ విశేషము.

సామ్యవాదు లీ సిద్ధాంతము నంగీకరింపరు. వారి దృష్టిలో సువర్ణ యుగ మింతకుముం దెప్పుడును లేదు. అది భూతము గాదు; భవ్యము. ఇకమీద దానిని మన ప్రయత్నముచే సాధింపవలెనందురు. తక్కిన సమాజ శాస్త్రజ్ఞుల యూహ వేఱు. వారు సువర్ణ యుగమన్నది బ్రపంచమున నెన్నడును దటస్థపడనే పడ దందురు. వారి దృష్టిలో నది యొక యాదర్శము. భావనామాత్ర నిష్ఠము. రేఖాగణితము నందు చుక్కవలె భూమధ్యరేఖ వలె.

రాజ్యతంత్ర మనఁగానేమి? అది యేక తంత్రాత్మకమా లేక లోకతంత్రాత్మకమా? ఒకఁడు లేక కొందఱు వ్యక్తు లనేకులపై యధికారము చెలాయించుటయా? లేక యనేకు లొకనిపై లేక గొందఱిపై యధికారమును

ర్వహించుటయా? ఈ పరిష్కారము చాల విషమమైన సమస్య. ఈ ప్రశ్నకు
మహాభారత ముత్తరమును జెప్పినది. ఆ సందర్భముననే కృతయుగము నందలి
రాజ్యతంత్రమెట్లుత్పన్నమైనదో దాని వర్ణనము గూడ జక్కఁగాఁ జేయఁబడినది.
పాశ్చాత్య రాజకీయ వాదులవలె భారతీయుల వర్ణణ మస్వాభావికము గాదు.
పరిహాస్యవాదమును గూడ నాశ్రయింపలేదు.

## రాజ్యసంస్థ యెట్లు గలిగెను?

యుధిష్ఠిరుఁడు భీష్మ్మ నీ ప్రశ్న వేసినాఁడు -

"య ఏష రాజన్ రాజేతి శబ్ద శ్చరతి భారత!

..... .... ..... ....

యదేకస్మిన్ జగ త్సర్వం దేవవ ద్యాతి సన్నతిం.

(శాం॥ ప. అ॥ 59)

"తాతా! రాజను శబ్దము సమాజమునందు రూఢముగ నున్నది. ఆ
శబ్దము లేక యా కల్పనము సమాజమున నెట్లు గలిగెను? దీనిని నాకు
వివరింపుము. రాజునకు గాలు సేతు లున్నవి. అభిమానము, బుద్ధి, యింద్రియములు
గలవు. సుఖదుఃఖముల సంవేదన యున్నది. సప్తధాతు సంస్థ, రక్త మాంసములు,
ఉచ్ఛ్వాస నిశ్వాసములు, సామర్థ్యము, శరీరము యితరుల వలెనే వానికిని గలవు.
జన్మ మరణముల కాతఁడు బాహిరుఁడు గాఁడు. కాని యతఁడు బుద్ధిమంతులు
శూరులు గల ప్రపంచమున కాధిపత్యమును నెఱపుచున్నాఁడు. ఈతని యుత్పత్తికి
కారణ మేమి? శూరులు, వీరులు, శ్రేష్ఠులు మొదలైన జనులచే నిండిన యీ
పృథ్వీభరము నొక మనుష్యుఁ డెట్లు రక్షింపఁ గలఁడు? రాజొకఁడు ప్రసన్నుఁడైనంత
సర్వలోకములు సంతోషించునట! వారి వైఫల్యము జగముల విఫలత యందురు.
ఇంతటి గౌరవమాతని కెట్లు వచ్చినది? దయచేసి నా ప్రశ్నలకు తాత్వికమైన

యుత్తర మొసఁగుము! ఒక మనుష్యునకు రాజను పేరుపెట్టి యా మనుష్యుని ప్రజలు దేవునివలె బూజింతురు. సర్వ జగత్తును రాజు పాదముల కడ నమ్రమగును ఈపరిస్థితి యెట్లేర్పడెను? దానికి భీష్ముఁడుత్తర మొసఁగినాఁడు.

"నియత స్త్వం నరవ్యాఘ్ర! శృణు సర్వ మశేషత:
నష్టే బ్రహ్మణి ధర్మే చ దేవాన్ త్రాస స్సమావిశత్.
(శాంతిపర్వము - అ॥ 59)

ధర్మజా! రాజ్య మెట్లు గలిగెనో వివరింతును వినుము. తొల్లి కృతయుగమున రాజు లేఁడు. రాజ్యములేదు. దండ్యుఁడు లేడు. దండనీతియు లేదు. కారణ మేమనగా నా డపరాధియే లేఁడు. సర్వ ప్రజలును ధర్మముచేతనే పరస్పరము రక్షించికొనుచుండిరి.. అమూర్తమైన ధర్మము సమాజమున కధినేతగ నుండెను. ఈ భారమును భూమి భరింపలేక పోయినది. అందుకై వారి యందు మోహ ముత్పన్నమయ్యెను. సహజమైన వారి జ్ఞానావస్థ చెదరెను. కర్తవ్యనిష్ఠ యంతఃకరణము లందు నష్టమయ్యెను. లోభము హృదయముల నాక్రమించెను. అప్రాప్తములగు వస్తువులకై పరస్పరము వాదులాడ నారంభించిరి. ఎదలలోఁ గోరిక తిష్ఠ వేసికొన్నది వెంటనే రాగము వచ్చి వారి నాక్రమించెను. రాగవశులైన వారు కార్యాకార్యముల నెఱుఁగరు. అగమ్య గమనము, అవాచ్యవాచనము, భక్ష్యాభక్ష్యము ప్రారంభమయ్యెను. అపుడు సత్యరూపమైన బ్రహ్మమునకు భంగము వాటిల్లినది. సత్యమే బ్రహ్మము. అధర్మములు జెలరేగినవి. మానవుల యీ యవస్థను గమనించి దేవత లుద్వేగము నందిరి."

అప్పుడు జెల్లిపోయిన పూర్వావస్థను మరల సాధించుటకై రాజ్యతంత్రమును సృష్టించిరి. సామ్యవాదులు మనకృతయుగ ధర్మములను "Primitive Communism" అను పేరఁ బిలుతురు.

'డాంగేగారు' సంస్కృత భాషా స్వరూపము నైనను గమనింపరు. ప్రత్యేక శబ్దమున కొనర్చిన నిరుక్తినైనను గౌరవింపరు. వారిదొక ప్రత్యేక యుత్పత్తి. ఇక్కడి బ్రహ్మ శబ్దమునకు సత్య మర్థమని వ్యాఖ్యాతలు వ్రాసిరి. వారి వ్రాతలను గాదని డాంగేగారు బ్రహ్మ మనగా "కమ్యూన్" యను యర్థమును గల్పించి సువర్ణ యుగ వర్ణనమంతయు "Primitive Communisim" యొక్క వర్ణనమని వ్యాసుల రచనలోని యసలు రహస్యమును విప్పి చెప్పిరి. బ్రహ్మ శబ్దమునకు వారొనర్చు వ్యాఖ్యానము సర్వసమ్మతము గాదు. కృతయుగము యొక్క యవస్థ వారి దృష్టిలో 'ప్రిమిటివ్' అనఁగా నసంపూర్ణము. మఱి వారి దృష్టిలో 'హయ్యర్ ఫేజునకు' జెందినదేది? కలియుగమా? మన సంప్రదాయము దాని కా యోగ్యత నివ్వలేదే? వ్యాస భగవానుఁడు కృతయుగ లక్షణములను వివరించుచు 'కృతలక్షణా' యను నొక విశేషణమును వాడెను. స్వర్ణ యుగమును వర్ణించుచు భారతకర్త వనపర్వమున నిట్లు పలికెను.

తస్మిన్ యుగసంసర్గే వ్యాధయో నేంద్రియక్షయః
కృతయుగే సమభవ త్స్వకర్మనిరతా ప్రజాః
(వనపర్వము అ॥ 149)

ధర్మజా! కృతయుగమున వ్యాధులు లేవు. ఇంద్రియక్షయము, అసూయ మొదలైనవి శూన్యము. రోదన, యహంకారము, వికృతి సంఘర్ష ద్వేషములు, దుష్టతాభయములు, సంతాపమాత్సర్యములు, ఈర్ష్య యివి హుళక్కి. అపుడు సర్వశ్రేష్ఠమైన పరబ్రహ్మయే సర్వులకు నంతిమసాధ్యమై యుండెను. సర్వభూతాత్ముఁడైన పరమేశ్వరునిది నాఁడు శుక్లవర్ణము. నాటి చాతుర్వర్ణ్యము సర్వమానసికవైషమ్యములనుండి విడివడియుండెను. మర్త్యులు మానసములయందలి పశుత్వమును సంపూర్ణముగ జయించియుండిరి. వారు స్వకర్మనిరతులు.

మనశ్శాస్త్రవేత్తలు. మూలభావమని వచించు 'నేను' యన్న తలఁపుఁగూడ వారికుండెడిదిగాదు. అంతఃకరణప్రవృత్తుల నిరోధము వారిస్వభావము. బాహ్యములైన యింద్రియప్రవృత్తులు వారికి వశములు. అఖండతపస్సే వారి జీవనము. సత్యధారణము వారి నియమము. శారీరక మానసిక పావిత్ర్యము వారి వర్తనము. నాటి జనులు సామర్థ్యసంపన్నులు. సర్వవర్ణములను 'స్వధర్మయుక్తములై' పరస్పరము సహాయమొనరించి కొనుచుండెను. ఇదియే వ్యాసుల 'కృతలక్షణా' యన్నపదమునకు వ్యాఖ్యానము. స్వాభావిక ప్రవృత్తులను జయింపనిది యిట్టి స్థితి దుర్లభమని మనశ్శాస్త్రకారులందురు. స్వర్ణయుగస్థితి డాంగేగారి 'Primitive' దశ గాదు. వారు సర్వోత్తరులు. సామ్యవాద మలముకొన్న దేశము లోని జనులు బ్రహ్మభూతులు గారుగదా! కనుక నక్కడ మనవారనుకొనుచున్న 'సువర్ణ యుగము' లేదు. కృతయుగము మానవుని ప్రారంభదశ యనుట యొక యభూతకల్పన.

## భారతీయ రాజ్యతంత్ర చరిత్ర

ఇట్టి యుదాత్తములైన యాదర్శములతో భారతీయ రాజ్యతంత్రము నిర్మింపఁబడెను. ప్రాచీనులు పలుమారును 'రాజాప్రకృతి రంజనాత్' యని నృపాలు నెచ్చరించుచు వచ్చిరి. ప్రకృతిరంజనమే రాజునకు ప్రబలమైన ధర్మము.

"ఏష ఏవ పరో ధర్మో యద్రాజా రక్షతి ప్రజాః" యను యిత్యాది వాక్యములు భారతమునం దనేకసారులు వచ్చును. రాజ్యతంత్రమును రక్షించుటయే రాజు యొక్క ముఖ్యధర్మ మంటిమి. వాఁ డందుల కసమర్థుఁడైనచో మఱియొకఁ డెవఁడైనను ఆ 'జవాబ్దారీ' దీసికొన వచ్చును. ఈ విషయమును భారతము విస్పందేహముగ జెప్పెను. వ్యాసులిట్లన్నారు :-

"అపారే యో భవే త్పారం అప్లవే యః ప్లవో భవేత్
.... .... ..... ......
.... .... ..... ......
మేఘో న వర్షతే యశ్చ సర్వథా తే నిరర్థకాః"
(శాం. అ. 78)

"అపారమైన సంకటమందెవ్వఁడు ప్రజలను రక్షించునో వాఁడు శూద్రుఁడైనను మఱియేజాతివాఁడైనను వానికి మర్యాద చెల్లవలసినదే. దస్యుపీడితమైన యనాథప్రపంచము రాజు నాశ్రయించి సుఖము నందుచున్నది. కనుక నా కార్యమును నిర్వహించువాఁడెవ్వఁడైనను వాఁడే సర్వశ్రేష్ఠుఁడు. వానినే ప్రజలు దమప్రియబాంధవునివలె గౌరవింతురు. కర్మశీలునకు గౌరవముగదా! బరువును మోయని యెద్దుచే నేమి లాభము? వట్టిపోయిన యా వెవ్వరికి గావలెను? వంధ్యయగు భార్యచే నుపయోగమేమి? రక్షకుఁడుగాని రాజు గూడ నంతే! వాఁడు కట్టెయేనుగు వంటివాఁడు. చర్మమయ మృగము. షండమనుష్యుఁడు. ఊసరక్షేత్రసమానుఁడు. వేదాధ్యయనము లేని బ్రాహ్మణుఁడును బ్రజారక్షణము లేని రాజును వర్షింపని మేఘమును సమానులు. ఎవ్వఁడు సత్పురుషులను రక్షించునో, దుష్టులను శిక్షించునో వానినే రాజుగ నొనర్పవలెను.

భారతదేశ రాజధర్మము ననుసరించి ప్రతిరాజును సింహాసనాధిష్ఠితుఁడగుటకు ముందు బ్రతిజ్ఞ యొనర్పవలెను. వేదవాఙ్మయమున గూడ నిట్టి ఘట్టములున్నవి. పృథుమహారాజు సింహాసనము నెక్కఁబోవుటకుముందు బాసయొనర్చెను. అది భారతమున వర్ణింపబడినది. దానినిబట్టి జూచినచో రాజ్య నిర్వహణమ రాజులకుఁబూలపాన్పుగాదు. పృథుమహారా జొనర్చిన ప్రతిజ్ఞ యిట్లున్నది

నియతో యత్ర ధర్మో వై తమశంక స్సమాచర!

...... ...... ...... ......

"తమశంకః కరిష్యామి స్వవశో న కదాచన."

(శాం. అ. 59)

"ధర్మమెట్లు చెప్పునో యట్లే బ్రవర్తింపుము. ప్రియాప్రియ భావన వ్యక్తిగత మనోవికారములు వీనిని నిర్జించి ప్రాణిమాత్రమందు సమభావముతో వర్తింపవలెను. కామక్రోధాదులను జయించి ప్రజారక్షణ మొనర్చుటయే నీ కర్తవ్యము. శాశ్వతమైన ధర్మమే నీకు రక్ష. కర్తవ్యమునుండి తొలఁగినవాని నెవ్వనినైనను నీ బాహుబలముతో నిగ్రహింపవలెను. త్రికరణశుద్ధిగ నీ భూమండలమును బ్రహ్మస్వరూపముగఁదలఁచి దీనికి సేవయొనర్తునని బ్రతిన సేఁయుము! దండనీతి నాశ్రయించి నిత్యధర్మమును నిశ్శంకముగ గొలుపుము. ఇట్లని బ్రతిజ్ఞ యొనర్పుము!" పెద్దలు జెప్పిన యీ వాక్యముల నన్నిటిని బృథు మహారాజు మఱల ననువదించి పలికెను.

పై ప్రతిజ్ఞయందు గూఢవాదము లేదు. నత్తిలేదు. రాగద్వేషములు లేశమును లేవు. స్పష్టమగు భాషలో నున్నది. రాజైనవాఁ డీ ప్రతిజ్ఞ నూరక యుచ్చరించుటేగాదు. ప్రత్యక్షరము ననుసరించి చూపవలెను. ఈ ధర్మమును బాలించిన రాజునే విష్ణుస్వరూపుఁడని బ్రజలు గౌరవించిరి. లోకపాలాంశజుఁడని మన్నించిరి. భోగాసక్తుఁడై పై ధర్మములను బాలింపనినాఁడు బ్రజలు వానిని సింహాసనమునుండి దొలఁగించుటకు జంకలేదు. రాజును వధించిన ఘట్టములు గూడ గలవు. రాజును జంపవచ్చునా? యను విషయమును గుఱించి పైని జర్చింపఁబోవుదును. రాజును విష్ణుస్వరూపుఁడని ప్రాచీనులెందుకన్నారు? అతఁడు లోకపాలాంశజుఁడెట్లయ్యెనో చాలమంది యర్థమొనర్చికొనఁ దలఁపరు. ఇఁక వారికి మిగిలినదేమి? పాశ్చాత్యానుకరణమే! వారిలో నొక న్యాయమున్నది. రాజు తప్పిదమే యొనరింపఁడట! ఈ సామెత యొక కాలమున బాశ్చాత్యులలోఁ బ్రచారమున

నుండెను. నవీన విమర్శకులు మన రాజు కథను గూడ నా సామెతకే జోడించి రాజున కొసఁగిన యీ గౌరవము గొందఱు స్వార్థపరుల యభూతకల్పనయని నిగ్గుదేల్చిరి. కాని ప్రాచీనులు రాజును లోకపాలాంశజుఁడనుటలోని యభిప్రాయము వేఱు. ఆ మాటతో రాజునకు గొన్ని విశిష్ట కర్తవ్యము లంటఁగట్టఁబడినవి. ఆ ధర్మములను నిర్వహింపనప్పు డా రాజు లోక పాలుర యంశముగాదు. రాజుయొక్క లోకపాలాంశ భూతత్త్వమిట్లు:

"నహి జాత్వవమంతవ్యో మనుష్య ఇతి భూమిపః
..... ..... ..... ......
..... ..... ..... ......
తదా వై శ్రవణో రాజా లోకే భవతి భూమిపః."
(శాం. అ. 68)

రాజును మనుష్యదృష్టితో జూడరాదు. అవమానింపరాదు. అతఁడు మానవరూపముతో నున్న ప్రత్యక్షదైవము. విశిష్టకాలములం దతఁడు విశిష్ట దేవతల యాకారములు ధరించును. ఉగ్రతేజస్కుఁడై పాపులనెప్పుడు సంహరించునో యా కాలమున నతఁ డగ్ని. లోకమునకు మంగళమొనర్చు బుద్ధితోఁ జారులను చక్షువులను ధరించి సమాజ స్థితిగతుల నవగతి యొనర్చికొనునపుడు రాజు సూర్యుఁడు. దుర్మార్గులైన జనులను బంధుమిత్రసహితముగ నాశమొనర్చునపుడాతఁడు మృత్యువు. అధర్మపరులను శిక్షించి ధార్మికులను రక్షించునపు డాతఁడు యముడు. అతఁడు ప్రజలపై ధనమును వర్షించును. ఉపకారపరులకుఁ బ్రత్యుపకృతి యొనర్చును. అపకారుల సంపదల హరించి కోశసంగ్రహమొనర్చును. అట్టివేళలం దాతఁడు గుబేరుఁడు. ఈ కర్తవ్యములను సాధింపనినాఁడు వాఁడు బలితస్కరుఁడు. రాజరూపముననున్న కలి. రాజైనవాఁడు జయింపవలసిన శత్రువులలోఁ బ్రధానులెవరు? ఈ విషయమును భారత మిట్లు వింగడించెను.

"ఆత్మా జేయ స్సదా రాజ్ఞా తతో జేయా శ్చ శత్రవః
అజితాత్మా నరపతి ర్విజయేత కథం రిపూన్!"
(శాం. అ. 69)

రాజు తొట్టతొలుత మనస్సును జయింపవలెను. పిదప శత్రుల జయింపవలెను. అజితాత్ముఁడైన నృపాలుడు శత్రువుల నెట్లు జయింపఁగలఁడు?

## రాచఱికముయొక్క వారసత్వము

సమాజము బాగుపడుటకును, నాశమగుటకును రాజే కారణము. ప్రజలు ధర్మనిష్ఠులై నిత్యసుఖులై సమర్థులై యున్నచో నా ప్రతిష్ఠ రాజునకే! అధఃపతితులై, భ్రష్టశీలురై యున్నచో నా యప్రతిష్ఠము రాజుదే. రాచఱికములో బాధ్యత గొప్పది. దాని మహత్వమును గొప్పది. ఈ విషయమును భారత మిట్లన్నది.

"రాజ్ఞా సప్తైవ రక్ష్యాని తానిచైవ నిబోధ మే
.... ...... ..... ....
.... ...... ..... ....
త్రేతాయాః కరుణాద్రాజా స్వర్గం నాత్యంత మశ్నుతే
(శాం॥ అధ్యా॥ 69)

రాజు మనస్సును నిగ్రహించవలెను. అమాత్య కోశములను సరిగాఁ జూచికొనవలెను. రాజ దండమును సరిగా వినియోగించి కొనవలెను. జనపదములు, పట్టణములు వీనిని జాగ్రత్తగ నవలోకింపవలెను. ఈ యేడును రాజునకుఁ బ్రధానాంగములు. వానికిఁ దపమక్కఱలేదు. యజ్ఞయాగాదు లొనర్పవలసిన పనియు లేదు. ప్రజలను రక్షించుటయే వాని ముఖ్య ధర్మము. 'రాజునకుఁ గాలము కారణమా? కాలమునకు రాజు కారణమా'? యని సందేహింపవలసిన పనిలేదు. రాజే కాలమునకుఁ గారణము. కృతయుగమును సృష్టింపవలసినది రాజే. చతుర్యుగముల నాతఁడే సృష్టింపవలసినది. సత్యయుగమును సృష్టించిన

రాజు శాశ్వతముగ స్వర్గసుఖము లందును. త్రేతాయుగమును బ్రతిష్ఠించిన రాజు సద్గతి యంత గొప్పదిగాదు. ద్వాపరయుగ ధర్మములఁ జెల్లించిన నృపాలుఁడు, సద్గతి, యసద్గతి యీ రెంటిని గూడ జెందును. కలియుగమును సృష్టించిన రాజు ఘోరపాప మందుననుటలో సందేహమేమి? భారతీయ నీతిశాస్త్రము యీ విషయములను బలుమాఱు నుడివెను.

పరిస్థితులకు మానవునిపై యధికారమా లేక మనుష్యుడే పరిస్థితులను లొంగదీసి కొనునా యనునది వాదోపవాదములకుఁ గారణమైన విషయము. కాని సిద్ధాంతమెట్టైనను మనవారి కా విషయమున సందేహము మాత్రము లేదు. ప్రాచీనుల దృష్టిలో మనుష్యుఁడు పరిస్థితులను లొంగదీసికొనవలెను. "అన్నిటికిని పరిస్థితులే కారణము. చక్కని యవకాశమున్నచో మానవుఁడు గొప్పవాఁడగును. లేకున్నచో వాఁడు సామాన్యుఁడై పోవును. మనుష్యుని యందలి శక్తులు వికసించుటకు వాతావరణమే గారణ'మని సామ్యవాదులందరు. కాని చరిత్రయే యిందుకు విరుద్ధముగ సాక్ష్యమొసఁగుచున్నది. సామ్యవాద చరిత్రనే యవలోకింతము. అది తొలుత జర్మనీలో వ్యాపింపలేదు. ఇంగ్లండున బ్రాకలేదు. కాని ధనిక ప్రభుత్వము బాగుగ నాటికి విజృంభింపని రష్యా యందే నెలకొన్నది. దీనికిఁ గారణము? "లెనిన్" మహాశయుఁ డత్యంత సమర్థుఁడగుటయే! వాతావరణము 'లెనిన్' మహాశయుని 'నేతఁ'గా నొనర్పలేదు. వాతావరణము నాతఁడ లొంగదీసికొనెను. కనుక సామ్యవాద మపవాద శస్త్రమునుండియే యారంభమై ఇట్టి తర్కమునకు మా ధన్యవాదములు. అది యట్లుండె మహాభారత నీ క్రింది శ్లోకము గలదు.

"రాజైవ కర్తా భూతానాం రాజైవ చ వినాశకః
ధర్మాత్మా యస్స కర్తా స్యా దధర్మాత్మా వినాశకః

(మ॥ భా॥ శాం॥ అ॥ 91)

"భూతములకు గల్యాణకర్త రాజే. వినాశకుఁడును రాజే. అతఁడు ధర్మాత్ముఁడైనచో లోక కల్యాణము సిద్ధించును. అధర్మపరుఁడైనచో ఫలము వినాశమే".

ధర్మ గ్రంథములు రాజు పాలనకర్త యైనదాననే వానిని 'భూమిపతి' యన్నవి. అంతేగాని రాష్ట్రమాతని సొత్తుగాదు. అతఁడు రాజ్యమునకు సేవకుఁడు. అందులకే రాజైనవాఁడు ధనము మొదలైన వానిని దానమొనర్ప వచ్చునే గాని భూదాన మొనర్చుటకు వాని కధికారములేదు. పుడమి యాతనిది కాదు గనుక.

"సార్వభౌమస్యాపి న తస్యాం స్వత్వం" అని యీ మాటను ధర్మశాస్త్రములు స్పష్టముగ జెప్పెను. రాజ్య తంత్రము పరతంత్రమా? లేక స్వయంభూతమా యను ప్రశ్న నీతిశాస్త్రజ్ఞుల కొక గడ్డు చిక్కు. భారతీయుల దృష్టిలో రాచఱికము బ్రజాతంత్రము. రాజును గద్దెపై నుంచుటకును దొలఁగించుటకును యధికారము గలవారు ప్రజలే. జన్మననుసరించి రాజు సింహాసనమునకు వారసుఁడే యగుగాక ప్రజలకు వాఁడు గాబట్టనిచో వానిని దొలఁగించి యితరుని సింహాసనముపై నిలుపవచ్చును. ఇట్టి సన్నివేశములు మహాభారతమున ననేకములున్నవి. ఒక్కొక్కసారి ప్రజల యధికారము రాజుపై మితిమీరిన ఘట్టములు గూడ నున్నవి. కాని యప్పుడైనను నృపాలునకు గత్యంతరము లేదు. వాఁడు బ్రజల యాజ్ఞను మన్నించి తీరవలసినదే. ఉద్యోగపర్వమున శంతనుని కథ యున్నది. అతఁడు రాజెట్లయ్యెను? ప్రతీపుఁడను వాఁడు శంతనుని తండ్రి. అతనికి దేవాపి యగ్రసుతుఁడు. బాహ్లికుఁడు రెండవవాఁడు. శంతనుఁడు మూఁడవవాఁడు. జ్యేష్ఠుఁడు గనుక దేవాపియే రాజ్యమునకు వారసుఁడు. అన్నదమ్ములలో నద్వితీయమగు మైత్రి యుండెను. దేవాపియందే దోషమును లేదు. వానికున్న దోష మొక్కటే! చర్మరోగముండెను. ఈ దొసఁగొకటి దప్ప యెట్లు చూచినను

వాఁడు సింహాసనమున కర్హుఁడు. ప్రతీపుఁడీ దోషము నుపేక్షించెను. దేవాపి పట్టాభిషేకమున కంతయు దయారయ్యెను. కాని ప్రజలు దేవాపి నొప్పలేదు. వారు దమ యసమ్మతిని దెలిపిరి. ఈ సన్నివేశమును భారత మిట్లు వర్ణించెను.

"దేవాపిస్తు మహాతేజా స్త్వగ్దోషీ రాజసత్తమః

...... ..... ...... .....

...... ..... ...... .....

పిత ర్యుపరతే రాజన్! రాజా రాజ్య మకారయత్॥

(ఉద్యో॥ అ॥ 141)

"దేవాపి మహాతేజస్కుఁడు. రాజసత్తముఁడు. ధార్మికుఁడు. సత్యవాది, పితృశుశ్రూషణా పరుఁడు. ఆతని కున్న దోష మొక్కటే! త్వగ్దోషము. పౌర జానపదుల కాతఁడు సమ్మతుఁడు. సాధువు. బాలకులు, వృద్ధులు అందఱు నాతని బ్రేమించుచుండిరి. అతని వర్తన హృదయంగమ మైనది. అతఁడు వదాన్యుఁడు, సత్యసంధుఁడు, సర్వభూత హితంకరుఁడు. తండ్రి యాజ్ఞ జవదాటనివాఁడు. బ్రాహ్మణాధీన బుద్ధి. రెండవవాఁడు బాహ్లికుఁడు. అన్నదమ్ములకున్న మైత్రి యత్యంతము రమణీయముగ నెండెను. కాలము గడచెను. ప్రతీపుఁడు వృద్ధుఁడయ్యెను. దేవాపి పట్టాభిషేకమునకు సంభారములు సిద్ధపరుపఁబడెను. కాని బ్రాహ్మణులు, వృద్ధులు, పౌర జానపదులు బ్రతీపుని యీ ప్రయత్నమునకు హర్షింపలేదు. వారతనిని నివారించిరి. రా జశ్రుకంఠుఁడైనాఁడు. ప్రజాభీష్టమును రాజు మన్నించి దేవాపి యభిషేకమును నిలిపెను. దేవాపి తపమొనరించుట కరణ్యములకు వెళ్ళెను. రెండవ వాఁడైన బాహ్లికునకు మేనమామ రాజ్యము సంక్రమించినది. అతఁడచ్చటకుఁ బోయినాఁడు. అన్న యనుజ్ఞను బొంది శంతనుఁడు తండ్రి యనంతరము రాజ్యమును వహించి యేలెను.

ధృతరాష్ట్రునకు మనస్సున నొక భయముండెను. యుధిష్ఠిరుఁడు యువరాజుగా నుండుట కంగీకరింపనిచో దమ్ము ప్రజలు చంపవేతురేమో' యన్న భయ మాతనికి గద్దు. అతఁడు దుర్యోధనునితో నిట్లు వచించెను.

"తే పురా సత్కృతా స్తాత పాండూనాం నాగరాజనాః
కథం యుధిష్ఠిరస్యార్థే న నో హన్యు స్సబాంధవాన్ ॥
(భా॥ ఆ॥ అధ్యా॥ 142 వ శ్లో॥)

"దుర్యోధనా! పాండురాజు ప్రజలకందరికిని మంగళకరుఁడై యుండెను. వారంద ఱాతని సంతానమునందు బ్రేమగలవారు. ధర్మరాజును రాజునొనర్పనిచో వారు మనలను జంపివేతురేమో!" నాటి ప్రజలకు రాజులపై నెంతయో ప్రేమ యుండెడిది. రాజులకునుఁ బ్రజలపై నట్లే! వీరి పరస్పర ప్రేమను వర్ణించు కొన్ని కరుణాస్పదములైన ఘట్టములు భారతమున వచ్చును. ఆశ్రమవాసిక పర్వము నందు ధృతరాష్ట్రుఁడు బ్రజలతోఁ గడసారి సెలవు గైకొనుచు నీ మాట లనుచున్నాఁడు.

శంతనుః పాలయామాస యథావ ద్వసుధామిమాం
...... ...... ...... ........
...... ...... ...... ........
యదేవ తైః కృతం కించి ద్వ్యలీకం వ స్సుతై ర్మమ॥
(ఆశ్రమవాసిక పర్వము అ॥ 9)

శంతనుఁడు ధర్మశాస్త్రాను సారము రాజ్యమేలెను. తరువాత భీష్ముఁడు పాలించెను. అతని యనంతరము నా తండ్రియైన విచిత్రవీర్యుఁడు యథాశాస్త్రముగ బ్రజాపాలన మొనర్చినాఁడు. తరువాత నా సోదరుఁడైన పాండురాజు గద్దె నెక్కెను. అతఁడు మీకెంతో ప్రియుఁడుగ నుండెను. అతని పాలనము మీరందరెఱిఁగినదే.

అతని తరువాత నేను మిమ్ము సేవించితిని.నా పాలనము యోగ్యమో యయోగ్యమో నే నెఱుఁగను. నా కావించిన దోషములను మీరు క్షమింపవలెను. నేను మీకు నమస్కరించుచున్నాను. "ఇతఁడు వృద్ధుఁడు, ఇతని సుతులందఱు జచ్చిరి. పరంపరాగత మైన రాజవంశమున నితఁడు జన్మించెను" యను విషయములను మీరు మనస్సున నిల్పికొని నా లోపములను మన్నింపవలెను. హతపుత్ర యైన గాంధారితో గూడ మీకు నేను నమస్కరించుచున్నాను. మా ప్రయాణము నకు మీరు సమ్మతింపవలెను. ఈ విషయములు నేను మీకు నివేదించికొన కున్నచో నా దోషమగును. నా వారసుఁడైన యుధిష్ఠిరుని మీ కొప్పించుచున్నాను. మిమ్ము రక్షింప వలసిన భారము యుధిష్ఠిరునిపై వేసితిని. మీరు దయతో దీని కంగీకరింపవలెను.

రాజ్యతంత్రము పరతంత్ర మను విషయమును దెలుపుటకై మహాభారతము నుండి మీకుదాహరణములు జూపితిని. రాచఱికము పరతంత్ర మెప్పుడయ్యెనో దానికిఁ గొన్ని నియమము లున్నవి. నియామకు లున్నారు. వారెవ్వరో ముందు విచారింతము.

## భారతీయరాజ్య సంస్థపై నియంత్రణము

భారతీయ రాజ్యతంత్రము స్వతంత్రము గాదని ముందే దెల్పితిమి. అది నియంత్రితము. ఆ నియంత్రణము లెట్టివి? వీనిని గూర్చి చర్చించుటయు నొక మహత్తర విషయమే! ఆ విచారమే మన మిప్పుడు జేయఁబోవునది. వానిలో మొదటి నియంత్రణము పౌర జానపదులకు సంబంధించినది.

# 1. పౌర జానపదులు

రాచరికమునందలి సర్వకార్యములును యీ పౌర జానపదుల సమ్మతితోడనే జరుగుచుండినవి. సర్వసంఘటనములకును వెన్నెముకగా నుండి నడిపించుచుండినది యీ పౌరజానపదులసమ్మతియే! భారతీయ సాహిత్యమందు యీ రెండు పదములును విడివిడిగా ప్రయోగింపఁబడుచు వచ్చినవి. ఒక్కొక్కసారి పర్యాయపదములుగ గూడ గనుపించును. రాజధానియందు నివసించువారు నాగరులు. రాష్ట్రాంతర్భాగమందు నివసించువారు వేఱు. ఈ యిర్వురకును రెండు సంస్థలుండెడివి. ప్రజాప్రతినిధులు వీనిలోఁ బాల్గొనుచుందురు. ఈ సంస్థలు సర్వస్వతంత్రములు! రామాయణమునందొక ఘట్టముగలదు. బ్రాహ్మణ ప్రతినిధులు, పౌరులు, జానపదులు వీరంద రొకచోట సమావేశమై అయోధ్య సింహాసనమునకు యువరాజుగా నెవ్వరుండవలెనని చర్చించుకొన్నారు. వారు తమ నిర్ణయమును దశరథమహారాజునకు దెలిపిరి. వారిసమ్మతిననుసరించియే రామచంద్రునకు యువరాజ పట్టాభిషేకము నిర్ణయింపఁబడినది. రాజ్యతంత్రము ప్రజాతంత్రమేనని యొకచోట నేను మనవిసేసితిని. నేను చెప్పిన యీ సిద్ధాంతమునకు రామాయణము నందలి పై ఘట్టము బలమునొసఁగు నొక యుదాహరణము. రామాయణ మహాభారతములందు మాత్రమే గాదు చంద్రగుప్తమౌర్యుని కాలము వఱకును పౌరజానపదులకు సంబంధించిన సంస్థలుండినవి. ప్రతి వ్యవహారమును వారి సమ్మతి ననుసరించియే జరుగుచుండెను. కౌటిల్యుఁడు అర్థశాస్త్రమునందు యీ రీతిగ ననెను. "రాజు తన పరిపాలనపై పౌరజానపదులకు విశ్వాసము గలదో లేదో చక్కగ విచారింపవలెను. ఇందులకు మార్గము? అతడు పౌర జానపదులలోనికిఁ దన చారులను బంపవలెను. వా రా సంస్థలలో బ్రవేశించి రాజును నిందింప నారంభింపవలెను. ఇంకను అనేక

మార్గములలో ప్రజలకు రాజుపై భక్తి విశ్వాసములు కలవో లేవో చారులు పరీక్షింపవలెను. కౌటిల్యుడిట్లన్నాడు:

"గూఢపురుషప్రణిధిః కృతమహామాత్యాపసర్పః పౌరజానపదాన్ అపసర్పయేత్ సత్రిణో ద్వంద్వినః తీర్థ సభాశాలాపూగజనసమవాయేషు వివాదం కుర్యుః సర్వగుణసంపన్నశ్చాయం, రాజా(శ్రూయతే న చాస్యకశ్చిత్ గుణో దృశ్యతే యః పౌరజానపదాన్ దండకరాభ్యాం పీడయతీతి ......." (కౌటిలీయ అర్థశాస్త్రము - అధ్యాయం 13)

పై దాని కర్థమిది:-

"చతురుడైన రాజు మహామాత్యునితో చర్చించి గూఢచారులను పౌరజానపదుల గుంపులలోని కంపవలెను. వారు సత్రములు, క్షేత్రములు, సభలు మొదలైన చోటులందు జనులెక్కడెక్కడ జేరుదురో యక్కడక్కడంతయు గూఢవేషములతోఁ జేరి తమలో ఁదాము వివాదమారంభింపవలెను.

ఒకఁడనును.

"ఈ రాజు చాల మంచివాడు"

రెండవవాడు దానిని ఖండించును.

"ఈ రాజు దుష్టుఁడు. పన్నులతో ప్రజలను బాధించుచున్న

మహాభారతమునందును యిట్టి ఘట్టమే యొకటి వచ్చును. రా పౌరజానపద సమ్మతియే ముఖ్యమని మహాభారతము కంఠోక్తిగఁ బల్కి అతఁ డేపనిఁజేయఁబూనికొన్నను వారి సమ్మతి గావలసినదే - ఒకా శ్లోకమిది :

"తస్మై మంత్రః ప్రయోక్తవ్యః దండ మాదిత్సతాన్నృప
పౌరజానపదా యస్మిన్ విశ్వాసం ధర్మతో గతాః"
(మ. భా. శాం. ప. అ. 93)

"దండనీతిని సక్రమముగ ననుసరింప నిచ్ఛగలిగిన రాజు పౌర జానపదులకు విశ్వాసము గలిగింపవలెను. వారి విశ్వాసమే రాచరికమునకు మూలబలము."

ఇంతమాత్రమేగాదు. జానపదులు, వారి యధ్యక్షులు, వారితో గూడిన సమితులు వీని సమ్మతి లేనిది రాజ్యయంత్రమునం దే వ్యవహారముగూడ నాఁడు జరుగుటకు వీలులేదు. రాజేమైనను పనిచేయదలఁచి కొన్నప్పుడు తొట్టతొలుత నాత డష్టప్రధానమంత్రులతో నాలోచింపవలెను. తరువాత నా నిశ్చయమును ప్రజల సమ్మతికై బంపవలయును. పిదప ప్రజాభిప్రాయమును ప్రజాప్రతినిధులకు తెలియజేయవలెను. వారి సమ్మతిని సంపాదింపవలెను. ఇంతపని జరుగనిది నాడొక కార్యము అమలులోనికి వచ్చుటకు వీలేలేదు. పరిపాలనా దృష్టితో నిది యెంత గొప్ప విషయమో వేఱుగాఁ దెలుపవలసినది లేదు. భారతమునందిట్లున్నది.

"అష్టానాం మంత్రిణాం మధ్యే .... ప్రజాః పదా"
(మ. భా. శాం. ప. అ. 97)

"ప్రధానమంత్రు లెనిమిదిమంది. రాజు వారితో నాలోచింపవలెను. ఆ నిర్ణయమును పౌరజానపదుల కెఱిఁగింపవలెను. వారి సమ్మతిని గొని దానిని ప్రజాప్రతినిధులకు దెలుపవలెను. వారి యంగీకారమును బడయవలెను. ఒక్క విషయ మెంత ప్రధానమైనను, అప్రధానమైనను, రహస్యమైనను, బాహిరమైనను జరుగవలసిన పద్ధతి యిదియే.

మహాభారత కాలమున ప్రచారమందున్న పౌరజానపదికమైన యీ సంప్రదాయము మౌర్యుల కాలము వఱకును నిరాఘాటముగా సాఁగివచ్చినది. దీనికి దేశచరిత్రయే ప్రమాణము. తక్షశిల యందలి జనులొకసారి రాజునకు విరుద్ధముగా నాందోళనమును లేవదీసిరి. నాటి రాజశోకుఁడు. అశోకుఁడు ప్రజల యభీష్టమును కనుగొని వచ్చుటకై యువరాజును తక్షశిల కంపినాడు. తక్షశిల యందలి జనులు యువరాజును దర్శించి యశోకుని పరిపాలనమందు తమ కెట్టి యతృప్తియు లేదని విన్నవించికొనిరి. "మఱి మీ యాందోళన మెందులకు?" యువరాజు ప్రశ్నించెను. ప్రజ లిట్లు బదులుపలికిరి. "మా ప్రాంతములకు రాష్ట్రాధికారిగా నియుక్తుఁడైన యధికారి పలుమారు మమ్మవమానించుచు మాటాడును. అందుచే నా రాష్ట్రాధిపతి మా కక్కఱలేదు." యువరా జీ వృత్తాంత మశోకునకు దెలిపెను. అశోకుఁడా మండలాధికారిని వెంటనే దీసివేసినాఁడు. ఈ వృత్తాంతము మౌర్యుల చరిత్రయందే గలదు. పౌరజానపదుల కానాడు గల పలుకుబడి సామాన్యమైనదిగాదు. ధర్మశాస్త్రములచేత విధింపఁబడినట్టి పన్ను మాత్రమే రాజు ప్రజలనుండి గ్రహింపవలెను. ఆ నియమమున కే మాత్రము పన్ను హెచ్చుగ గట్ట వలసి వచ్చినను పౌరజానపదులు సమ్మతించెడివారుగారు. కాని రాష్ట్రమొక సంసారమువంటిదిగదా! దానికిని సంపదాపదలు తటస్థపడుచునే యుండును. కోశసమృద్ధి రాజ్యరక్షణక ప్రధాన కీలకము. ఈవిషయము భారతమునం దనేకసారులు చెప్పఁబడినది. కను యేవైన నాపదలు తటస్థించినప్పుడు ప్రజలనుండి రాజు అధికముగ పన్నులను వసూలు చేయవలసి వచ్చును. తాత్కాలికమైన యీ పన్నును వసూలుచేయునప్పుడు గూడ రాజు పౌరజానపదుల సమ్మతిని బడయవలెను. ఇది క్రమప్రాప్తమైన నియమము. ఈ యొప్పుదలను గూడ రాజు జబర్దస్తీగా బడయుటకు వీలులేదు. పరిస్థితులన్నియు ప్రజల కెఱుకపరచి వారి సాయమునకై నరపాలుడు ప్రార్థింపవలెను. ఆపద్విషయములలో రాజు ప్రజల నెట్లు సమ్మతింపజేయవలయునో భారతమునందలి యీ క్రింది ఘట్టము వివరించుచున్నది.

"ప్రాగేవ తు ధనాదాన మనుభాష్య తతః పునః
.... .... ..... ....
స్వరశ్మీ నభ్యవసృజే ద్యోగ మాధాయ కాలవిత్"
(భా. శాం. ప. అ. 87)

పై శ్లోకముల యర్థమిది.

అధికముగా పన్నులు వసూలు చేయవలసిన యవసరము తటస్థించినపుడు రాజు తన కష్టములను ముందే ప్రజల కెఱుకపఱపవలెను. వారికి తెలుపకయే హఠాత్తుగా వసూలుచేయుటకు వీలులేదు. రాష్ట్రమునకు సంభవించిన యాపత్తిని వారికి వివరముగ వివరింపవలెను. "మన రాష్ట్రము పైకి శత్రువులెత్తివచ్చుచున్నారు. పల్లెపల్లెయందును కష్టములు గలుగబోవుచున్నవి. మన శత్రువులు అనేకులైన దస్యుల సాహాయ్యమును బొందినారు. వారు మనపై నెత్తివచ్చుచున్నారు. దీనితో వారికి కలుగబోవు కడపటి ఫలము స్వనాశమేయైనను మన మీ సమయమున నతి జాగ్రత్తగ మెలఁగవలెను. మిమ్ము రక్షించుటకొఱకే నేను బ్రయత్నించుచున్నాను. కనుక దయచేసి మీరు నాకు కొంత యధికముగఁ గప్ప మొసఁగవలెను. నేనిపుడు మీనుండి గైకొనుచున్న ధనమును మన కష్టములు తీరిన వెనుక మరల మీకు దీర్చివేతును. మన శత్రువు లట్లుగాదు. వారు మీ పైఁబడి బలవంతముగ మీ ధనముల నపహరింతురు. స్త్రీలను భంగపఱతురు. ఇట్టి యాపదనుండి మనము తప్పించుకొనుటకే మీరిపుడు నాకు దయాపూర్వకముగ కొంత ధనము నీయవలెను. ధనమునకు ప్రధాన ఫలము తమ స్త్రీలను తమ్మును రక్షించుకొనుట, వానికి భంగము వాటిల్లినపుడు మన ధనముండి మాత్రమేమి ప్రయోజనము? మీ దయ వల్లనే నే నింతవఱకు సుఖముగా బ్రదికితిని. పుత్రోదయము నందు తండ్రి కెట్లానందము గల్గునో, యట్లే మీ వైభవములతో నా కానందము గలుగు చున్నది. నేనెంత వఱకును మిమ్మెక్కువ బాధింపక,

నా పరిపాలనా క్రమముతో మిమ్ము రక్షించుచు వచ్చితిని. ఇది మీ రెఱిఁగిన విషయమే! ధనరక్షణ కంటెను, మాన రక్షణ గొప్పది. మానము దక్కవలెనన్నచో, శత్రువులను మనము జయింప వలెను."

ఈ రీతిగ రాజు మధురములు, సుసంస్కృతములు నగు పలుకులతోఁ బ్రజలను బ్రార్థింపవలెను. భారతీయ రాజ్య తంత్రమునందు పౌర జానపదులకున్న ప్రాముఖ్యము యీ క్రింది శ్లోకము వలన దెలియును.

"పౌరజానపదా యస్య స్వనురక్తా అపీడితాః
రాష్ట్రకర్మకరా హ్యేతే రాష్ట్రస్య చ విరోధినః!

"పౌర జానపదులు రాజునం దనురక్తులై యున్నచో వారు నృపాలుని రక్షింతురు. లేనిచో రాజ్యమునే నష్టమొనర్తురు. అందుచేఁ బరిపాలకు లెప్పుడును వారిని పీడింపక జాగ్రత్తగ మెలఁగ వలెను."

'రాజసత్త' మే యపాయమును బొరయక దృఢమూలమై యుండుటకు గల హేతువులను బేర్కొనుచు భారత మీ రీతి నుడువుచున్నది.

"యస్య స్ఫీతో జనపదః సంపన్న ప్రియరాజకః

.... ...... .... .....

.... ...... .... .....

సధనా ధాన్యవంతశ్చ ధృఢమూల సపార్థివః (భా. శాం. ప. 694)

"మహారాజునకు సంబంధించిన జనపదము లెప్పుడును సమృద్ధములై యుండవలెను. మంత్రులు సంతుష్టులై యుండవలెను. ప్రజలు రాజునందు ప్రీతిగలవారై యుండవలెను. ఇట్టి రాజుయొక్క రాజ్యమే దృఢమూలము. పౌర జానపదు లెప్పుడును, శ్రీమంతులై ధనధాన్య సమృద్ధి గలిగి ప్రాణి మాత్రములందు దయగలవారై మెలఁగ వలెను. ఇట్టి పౌర జానపదులు గల రాజు రాజ్యము

సుస్థిరము. ఒక దొంగ యొకానొక మనుష్యుని వస్తువును దొంగిలించినపుడు, రాజా దొంగను పట్టుకొనుటకు బ్రయత్నింప వలెను. ఆ తస్కరుఁడు జిక్కకున్నచో పోఁగొట్టకొన్న వాని ధనమును, నృపాలుడు తన కోశమునుండి యివ్వవలెను. ఈ విషయమును ధర్మ శాస్త్రములు ఘంటా ఘోషముగ జెప్పుచున్నవి. యాజ్ఞవల్క్యుఁడిట్లన్నాడు.

"దేయం చోరాహృతం ద్రవ్యం రాజా జానపదా యత్
అదదద్ది సమాప్నోతి కిల్బిషం యస్య యస్య తత్!"
(యజ్ఞవల్క్యస్మృతి : వ్యవహారాధ్యాయం - 2)

" ప్రత్యాహర్తు మశక్తస్తు ధనం చోరైర్హృతం యది
స్వకోశాత్ తద్ది దేయం స్యాత్ అశక్తేన మహీక్షితా!"

(పై శ్లోకమునకు 'మితాక్షరా' వ్యాఖ్యగూడ చూడవలెను)

పై వాని యర్థమిది.

"చోరా హృతమైన ద్రవ్యమును రాజా జానపదున కివ్వవలెను. అట్లివ్వకున్నచో నృపాలునకు గొప్ప పాపము గలుగును. దొంగను బట్టుకొనుటకై రాజు యత్నింపవలెను. తస్కరుడు పట్టువడనిచో తనకోశము నుండి, ధనము పోగొట్టుకొన్న వాని కివ్వవలెను.

ప్రతి దినము జరుగు వ్యవహారములు గూడ రాజా ప్రజల కెఱిఁగింప వలెనని భారతము పలుకుచున్నది. ఇట్టి దైనందిన విషయములలో గూడ పౌరుల సమ్మతిని మహీపాలుఁడు పొందియే తీరవలెను. భారతమునం దీ క్రింది శ్లోకములు గలవు.

"అతీతదివసే వృత్తం ప్రశంసతి న వా పునః
కచ్చి ల్లోకే జనపదే కచ్చి ద్రాష్ట్రే చ మే యశః"
(భా. శాం. అ. 89)

"తొల్లిటి దినమున జరిగిన విషయమును గురించి, ప్రజాభిప్రాయమెట్లున్నదో, నరపాలుఁడు దెలియవలెను. అందుకై యాతఁడు గుప్తచారుల నంపి, ప్రజలు తన్ను గుఱించి పొగడుచున్నారో, తెగడుచున్నారో స్పష్టముగ దెలుప వలెనని. వారికిఁ గఠినముగ నాజ్ఞ యివ్వవలెను. నరపాలు డొనర్చెడు దాన ధర్మములకు గూడ పౌర జానపదుల సమ్మతి గానవలెనని ధర్మశాస్త్రము పలుకుచున్నది.

ఇంతకును తేలినదేమి? నాటి పౌర జానపదులకు రాజు పైనను, రాచరికము పైనను, గొప్ప యధికారము లుండెడివి. క్లుప్తముగ వివరించినచో పౌర జానపదుల యధికారము లిట్లుండును.

1. ఒక రాజు వెనుక ఆ రాజ్యమునకు వారసుఁ డెవ్వరో వారు నిర్ణయింతురు.
2. వారసుఁడు సమర్థుఁడు గాక పోయినచో వానిని దొలఁగించి వేఱొక వానిని నియమింతురు.
3. రాజసమర్థుఁ డైనచో వానిని పదచ్యుతు నొనర్తురు.
4. ధర్మశాస్త్రము చేత నిర్ణయింపఁ బడిన పన్నుకంటెను. అధికముగ గైకొనుటకు రాజునకు హక్కులేదు. అట్లు గైకొన వలసి వచ్చినపుడు. పౌర జానపదుల సమ్మతి నాతఁడు బొందవలెను.
5. ప్రధాన మంత్రిని నియమించుటలో పౌర జానపదుల యొప్పుదల గావలెను.
6. తమ కధికారి యెవ్వరు గావలెనో పౌర జానపదులే నిర్ణయించుకొను చుండిరి. తమ కయిష్టుఁడైన యధికారిని తీసి వేయించుటకు గూడ వారికి క్రమప్రాప్తమైన యధికారము గలదు.
7. రాజ్య పరిపాలన మంతయు వీరి సమ్మతిపైననే సాగవలెను. కనుక అష్టప్రధానులతో యోచించి నిర్ధరింపఁ బడిన రాజ నిర్ణయము, వీరికిని వీరి ప్రతినిధులకును, యెఱుక పఱుపఁబడ వలెను. వీరి సమ్మతిలేనిది అది అమలులో వచ్చుటకు వీలులేదు.

## ౬ రాజ యంత్రముపై వేఱొక తపస్వి బ్రాహ్మణము నియంత్రణము

పరిపాలనా క్రమమును నిర్ణయించు వారిలో మఱియొక ప్రధానాంగము తపస్వులు. ఈ తపస్వులయొక్క ప్రభావము ఆర్యుల సంస్కృతిపై నంతయు ప్రతిఫలించినది. ఆర్య సంస్కృతియొక్క సారమే తపస్సు. ఇది నిర్వివాదమైన విషయము! తపస్వులరణ్యములందు వసియించుచుండిరి. వీరికి ధనాశలేదు. మానాభిమానములు సున్న. ప్రజలకును, రాజులకును వీరిపై సమానముగ భక్తి ప్రపత్తు లుండెడివి. రాజులనుండి కోరఁదగిన సాహాయ్య మేదియు వీరికి లేదు. మన సాహిత్యమున ననేక ఘట్టములలో తపస్వుల బ్రాహ్మణుల ప్రభావము వర్ణితమై యున్నది. వీరి హృదయములపై రాగద్వేషములు బనిచేయుటకు వీలేలేదు. రాష్ట్రమున కేదైన సంకటము ప్రాప్తించినపుడు రాజులు వీరి యభిప్రాయములకై యాచించుచుండిరి. క్లిష్టమైన సమస్యలలో వీరి నిర్ణయము ప్రధానముగ నుండెడిది. గణ రాజ్యములందు విద్వేషములు పెరిగినపుడు వాని నణచుట కుపాయమేదియను విషయమును గూర్చి శ్రీకృష్ణుఁడు నారదునితోఁ జర్చించినాడు. ఈ కథ భారతమందే వచ్చును. తపస్వులైన బ్రాహ్మణులు పలుమారు రాజసన్నిధానమున కఱిఁగి రాజ్య కుశలములను విచారించుచుండిరి. ఇట్టి ఘట్టములు మహాభారతమునం దెన్నియో గలవు. సభా పర్వమున నారద మహర్షి యుధిష్ఠిరుని కడకు వచ్చి రాజ్యక్షేమములను విచారించినట్లు వర్ణింపబడినది.

తపస్వులను గూర్చి మహాభారత మిట్లన్నది.

"ఆత్మానం సర్వకార్యాణి తాపసే రాష్ట్ర మేవ చ
నివేదయే త్ప్రయత్నేవ తిష్ఠేత్ ప్రహ్వాశ్చ సర్వదా!"

(భా. శాం. ప. అ. 86)

"రాజైనవాఁడు తన రాష్ట్రము సర్వమును తపస్వుల పాదముల కడ నర్పింపవలెను. నమ్రుఁడై, వారికిఁ దన పరిపాలనలోని కష్టనష్టముల నెఱిఁగింప వలెను."

తపస్వులు దారిద్ర్యము నొక యలంకారముగఁ దలఁచిరి. బుద్ధిశక్తి సూక్ష్మ గ్రాహిణిగ, తక్షణముగ నుండుటకై యనుసరించవలసిన పద్ధతులన్నియు వారనుష్ఠించిరి. శమదమములను సాధించిరి. ఈషణ త్రయములను జయించిరి. ఈ వర్గమును గుఱించిన పొగడ్తలు, మన సాహిత్యమున కుప్ప తెప్పలు. పౌర జానపదులు రాచఱికమును నియమింతు రంటిమి. ఈ విధమైన పరిపాలనలోఁ దమకు శాంతి సౌఖ్యములు కలుఁగునా లేదా? యని వారి చింత! కనుక యొక రీతిగా పౌర జానపదు లొనర్చు నియంత్రణము వారి స్వార్థమునకు సంబంధించినది. తపస్వుల కా బాధ గూడ లేదు. వారెన్నడును స్వార్థమునకు లోగి యెఱుఁగరు. అందుచే వారు రాజుల కొసఁగు సలహాలు రాగద్వేష విదూరములై యుండును. ఈ వర్గమును గూర్చి భారత మీరీతి వాకొన్నది.

"బ్రాహ్మణో హి కులే జాత: కృతప్రజ్ఞో వినీతవాన్
శ్రేయో నయతి రాజానం బ్రువన్ చిత్రాం సరస్వతీం"
(భా. శాం. ప. అ 72)

"బ్రహ్మవృక్షో రక్షమాణో మధుహేమచ వర్షతి
అరక్ష్యమాణః సతతం అశ్రుపాపం చ వర్షతి"
(భా. శాం. ప. అ 73)

"తపోమంత్రబలం నిత్యం.............
తాభ్యాం సంభూయ కర్తవ్యం ప్రజానాం పరిపాలనం
(భా. శాం. అ 74)

పై శ్లోకముల యర్థమిది.

"కులీనుడై విద్వాంసుడై, వినయరమ్యుడైన బ్రాహ్మణుడు రాజునకు క్షేమము లొనగూర్చును. విప్రుడొక మహావృక్షము వంటివాడు. అతనిని సంతోష పెట్టినచో తేనెలను, బంగారమును వర్షించును. రక్షింపకున్నచో కన్నీటిని, పాపమును వర్షించును. బ్రాహ్మణుని యందు తపోమంత్ర బలములు ప్రతిష్ఠితము లైనవి. అస్త్రబలము, బాహుబలము క్షత్రియుల నాశ్రయించి యుండును. కనుక వీరిర్వురును అనుకూలముగఁ బ్రవర్తించిననే యవనీరక్షణము సాగును. భూరక్షణార్థమై బ్రాహ్మణులు క్షత్రియునకు ఖడ్గమును బ్రసాదించిరట! భారతకారుఁ డిట్లనును.

"అసిం ధర్మస్య గోప్తారం దదౌ సత్కృత్య విష్ణవే
అసినా ధర్మగర్భేణ పాలయస్వ ప్రజాయతి"

(భా. శాం. ప. అ. 166)

పై శ్లోకములు ఖడ్గస్తోత్రము లోనివి.

"ఖడ్గము ధర్మమును రక్షించును. అది తొలుత విష్ణువునకుఁ బ్రాప్తించినది. దాని నతఁడు మరీచి కొసఁగెను. మరీచి మహర్షులకిచ్చెను. ఋషు లా ఖడ్గమును దేవేంద్రుని కొసఁగిరి. మహేంద్రుఁడు లోకపాలుర కిచ్చెను. వారు సూర్య పుత్రుఁడైన మనువున కా ఖడ్గమును దయచేసిరి. లోకపాలురు మనువుతో నిట్లన్నారు. "నీవు మనుష్యుల కీశ్వరుఁడవు. ధర్మగర్భమైన యీ ఖడ్గముతోఁ బ్రజలను బాలింపుము. ఈ వృత్తాంతము యుద్ధములు మొదలైనవి జరపుట యందును వాని కనుమతించుట యందును గూడ తపస్వులకుఁ గల పలుకుఁబడి యెంతటిదో తెలుపుచున్నది. తపోధనులైన బ్రాహ్మణులు అప్రత్యక్షముగ రాజునకు దోడుపడుట

మాత్రమేగాదు. ప్రత్యక్ష రూపముగను రాజకీయములలోఁ బాల్గొందురు. భారతము నందు రాజునకుఁ బురోహితుఁ డుండియే తీరవలెనని తీర్మానింపఁబడినది. పురోహితులు రాజులను ఆధ్యాత్మికాది భౌతికములగు నాపదలనుండి సంరక్షించు చుందురు. పురోహితుఁ డెట్టివాఁడు గావలెను? ఈ విషయమై శాంతి పర్వమున నిట్లు గలదు.

"రాజ్ఞా పురోహిత: కార్యో భవే ద్విద్వాన్ బహుశ్రుత:
ఉభౌ సమీక్ష్య ధర్మార్థే అప్రమేయో అనంతరం"
(భా. శాం. ప. అ. 73)

"ధర్మార్థములను రాజు జాగరూకుఁడై రక్షించుకొనవలెను. అందుకై రాజునకు బహుశ్రుతుడు కులీనుఁడైన బ్రాహ్మణుఁడు పురోహితుఁడుగా నుండవలెను." వాల్మీకి రామాయణ మింకను గొంత ముందునకుఁ బోయినది. పరిపాలనయందు సలహా లొసఁగు మంత్రులు తపస్వులుగా నుండవలెనని వివరించి తెలిపినది. విద్వాంసులు, దక్షులు, కార్యకుశలురు అగునట్టి వారిని రాజు పరీక్షించి తనకు సహాయకులుగా దీసికొనవలెను. నూరుమంది మూర్ఖుల యభిప్రాయమున కంటెను ఒక విద్వాంసుని మతమే సమ్మతము. నారదునితో యుధిష్ఠిరుఁ డిట్లు స్పష్టముగఁ జెప్పెను.

"శతం విహాయ మూర్ఖాణాం, ఏకం వృణాసి పండితం"

ఇతిహాసకాలమునందును తపస్వుల పలుకుబడి గొప్పగనే యగపడుచున్నది. తపస్వులైన బ్రాహ్మణులు రాజునకు రక్షకులుగ నుండినట్లు చారిత్రక యుగమున ననేక దృష్టాంతములున్నవి.

# రాజ్య యంత్రమునందు మూఁడవ నియంత్రణము

## అమాత్య సంస్థ

రాజున్నచో మంత్రి యున్నట్లే! మంత్రి యుండవలెనని వేఱుఁగాఁ జెప్పవలసిన పనిలేదు. ఈ విషయమును మన ధర్మశాస్త్రములును స్పష్టముగఁ జెప్పుచున్నవి. మనుస్మృతియం దిట్లు గలదు.

సోఽసహాయేన, మూఢేన, లుబ్ధేనాకృతబుద్ధినా
.... ...... .... .....
స్థానం సముదయం గుప్తిం లబ్ధ ప్రశమనానిచ, (అ.7)
"సర్వ విద్యాసు కుశలో నృపో హ్యాపి సుమంత్రవిత్
సమస్తేషు చ కార్యేషు విద ధ్యాద్ధిత మాత్మనః?
(మనుస్మృతి - 7 నుండి - 57 వఱకు)

"నృపాలుఁడు అసహాయుఁడుగ నుండరాదు. మూర్ఖుఁడు అనుభవ హీనుఁడైన రాజు సక్రమముగ జనులను బాలింపలేఁడు. రాజు విషయ సుఖములయం దత్యంతము ఆసక్తుఁడుగ నున్నచో రాచఱికము చెడును. అతఁడు పవిత్రుఁడుగ నుండవలెను. సత్యసంధుఁడు గావలెను. యథాశాస్త్రముగఁ బ్రవర్తించువాఁడును బుద్ధిమంతుఁడును గావలెను. సహాయ సంపత్తిని సమకూర్చి కొనవలెను. అత్యంత సులభములైన పనులు గూడ నొకనిచే నెఱవేఱవు. అట్టిచో పరిపాలనము రాజొక్కఁడే చేయనేర్చుననుట కల్ల! అతఁడు ప్రతి కార్యమును మంత్రులతోఁ జేరి యోచించవలెను. సంధి విగ్రహములు స్థానోత్కర్షములు గుప్తత మొదలైన వానిని నెట్లు రక్షించుకొనవలెనో శత్రుల నెట్లు భేదింపవలెనో నివి యన్నియు నృపాలుఁడు మంత్రులలోఁ జేరి యోచించి నిర్ణయించు కొనవలెను. తనకెంత బుద్ధి బలమున్నను మంత్రులతోఁ నాలోచింపక యొకఁడే ఒక నిర్ణయమునకువచ్చుట చాల

ప్రమాదకరమైన పద్ధతి. రాజెప్పుడును స్వతంత్రుఁడై వర్తించుట నృపాలున కనర్థదాయకము. నిరంకుశుఁడైన రాజును ప్రజలు ద్వేషింతురు. అతని రాజ్యము ఛిన్నాభిన్నమై పోవును. అందుచేఁ బ్రజల కసమ్మతుఁడు గాకుండుటకై సర్వ విధములఁ బ్రయత్నించుట నృపాలునకు క్షేమకరము. భారతము మంత్రుల నెంతో గొప్పగ వర్ణించెను. మంత్రు లెట్టివారు గావలెను? అను విషయమున భారతము దేల్చిన సిద్ధాంత మిది!

"కులీనాన్ శీలసంపన్నాన్ దిగ్గత జ్ఞాన నిష్ఠురాన్

.... ...... .... .....

నిష్ఠా కృతా తేన యదా, సహ స్యాత్ తం మంత్ర మార్గం
ప్రణయే దసక్తః (భా. శాంతి పర్వము. అధ్యాయము 83)

పై శ్లోకముల యర్థ మిది.

"కులీనులు, శీలసంపన్నులు, పరాభిప్రాయ విదులు, దేశకాల పాత్రములఁ బరిశోధించి వర్తించువారు, రాజునకు క్షేమము గోరు వారు అగునట్టివారినే నృపాలుఁ డమాత్యులుగా నియమించుకొనవలెను. మంత్రులు తన రాష్ట్రమునకు సంబంధించినవారు గావలెను. సద్గుణవంతులు గావలెను. కులీనులు గావలెను. ధనమునకు లోగనివారు గావలెను. వారి గుణములను రాజు స్వయముగ ననేక విధముల పరీక్షించి తృప్తి గలిగిన వెనుకనే నియమించికొన వలెను.

తరుణులై యుత్సాహవంతులై జ్ఞాన సంపన్నులై పరంపరాగతమగు కౌలీనత గల మంత్రులు పరిపాలకునకు క్షేమము నాపాదింతురు. మంత్రుల వాక్కులు సత్యములై మృదువులై యుండవలెను. శత్రువుల నణచుటయం సదా జాగరూకులై వారు వర్తింపవలెను. పరాక్రమవంతులు గావలెను. భయానకము దుఃఖములందును వారి చిత్తవృత్తులుచెదరిపోరాదు. వైయక్తికముగ నొకానొక

దమయెడ మహాపరాధ మొనరించినను వానిచే రాష్ట్రమునకుఁ గల్యాణము గల్గుచో వానిని క్షమించు నుదారులు మంత్రులు గావలెను. వీరికి రాజుపైన నమిత ప్రేమ యుండవలెను. ఒకానొక విషయము చర్చకు వచ్చినపుడు రాజు మంత్రులతో మూలమట్టముగ దాని నాలోచింపవలెను. పిదప ధర్మార్థ కామములయందు సమర్థుఁడైన కులగురువు కడకేఁగి తమ నిర్ణయమును దెలుపవలెను. అతని యాదేశానుసారము వర్తింపవలెను."

పై విషయములతోఁ దేలునదేమి? మంత్రుల నిర్ణయమున కంటెను తపస్వి జనుల నిర్ణయముపై నరపాలుఁ డెక్కువ గౌరవముంచవలె ననుట:

## మంత్రుల సంఖ్య

రాజునకు మంత్రు లెంద రుండవలెను? నరపాలుఁడు విచార వినిమయము యెంతమందితో నొనర్చుకొనవలెను? ఈ ప్రశ్నల కుత్తరములు మన నీతిశాస్త్రములో నక్కడక్కడ చెప్పబడియే యున్నది. నీతి శాస్త్ర కారులలోఁ బ్రధానుఁడైన కౌటిల్యుఁడు యింద్ర పర్యాయ పదమైన 'సహస్రాక్ష' శబ్దమునకు యీ రీతి వ్యాఖ్యానము జెప్పినాఁడు.

"ఇంద్రస్య హి మంత్ర పరిషత్ ఋషీణాం సహస్రంప
తచ్చక్షుః తస్మాదిమమద్వ్యక్షమ్ సహస్రాక్ష మాహుః!
(కౌటిల్యుని అర్థశాస్త్రము అ॥ 15)

ఇంద్రుని యాలోచనా పరిషత్తున వేయిమంది మహర్షులుందురు ఆ మహర్షులే యాతని నేత్రములు. అందుచే యింద్రున కున్నవి రెండు కన్నులే యైనను లోక మాతనిని సహస్రాక్షుఁ డందురు." మన సాహిత్యమున అష్టమంత్రు లనునది ప్రసిద్ధమైన మాట! మంత్రులన్నచో యెనిమిది మందియే యనుట రూఢము! హిందూరాజ్య పద్ధతియందు మంత్రు లెనిమిది మంది యుందురనుట

చాలకాలము నుండి ప్రసిద్ధమైన సంకేతమై యున్నది. కాని నీతి శాస్త్రములలో మాత్రము మంత్రు లెనిమిది మంది యే యుండవలెనని యెక్కడను నిక్కచ్చిగా జెప్పబడలేదు. కాని యొక విషయము మాత్ర మున్నది. రాజునకు మంత్రులు ముగ్గురికంటె దక్కువగా నుండరాదట! ఈ విషయము భారతమున గలదు.

"మంత్రిణః ప్రకృతిజ్ఞా స్స్యుః త్ర్యవరామహదీప్సవః
(భా॥ శాం॥ అ॥ 83)

"సర్వగుణ సంయుక్తులైన మంత్రులు సామాన్యముగ నైదు మంది రాజున కుండవలెను. కనీసము ముప్వురి కన్నను తక్కువ యుండరాదు." పై శ్లోకమునకు నీలకంఠ దీక్షితు లొనర్చిన వ్యాఖ్య యిది.

"మంత్రి యొకరిద్దరు గాక ముప్వురేల యుండవలెను? దీనిలోని యంతరార్థమును కౌటిల్యుడిట్లు వివరించు చున్నాడు.

"ఏకో మంత్రీ న కర్తవ్యః, ఏకో నిరవగ్రహ శ్చరతి, ముహ్యతి చ కార్య కృచ్ఛ్రేషు, ద్వావపి మంత్రిణౌ న కర్తవ్యౌ, తౌ తౌ సమ్మతౌ చరంతౌ, భక్ష్యయంతౌ గృహీతౌ చ వినాశయతః అతః పంచ సప్త వా మంత్రిణః కార్యాః ."

"రాజు మంత్రి నొక్కనినే యేర్పాటు జేసికొనరాదు. మంత్రి యొకఁ యున్నచో వాఁడు నిరంకుశుఁడై వర్తించును. లేక గొప్ప పనులు చేయవల వచ్చినపుడు సరిగ యోచించు శక్తి జాలక వాని నవకతవకగా నొనర్చున మంత్రు లిరువురు గూడ నుండరాదు. వారిలో వారు మాటాడికొని లంచములన తీసికొన యత్నింతురు. రాజు వారిని గమనించి పట్టుకున్నచో వారిరువు రేకమై రాజును నాశనమొనర్తురు. అందుచే రాజు మంత్రుల నైదుగురినో లేక యేడు మందినో యేర్పాటు జేసికొనవలెను. ఈ మంత్రులు పరిపాలనా క్రమమును నిర్ణయింతురు. ఈ విషయములను భారతమున నిట్లు గలదు.

"పరతంత్రః సదా రాజా కుతో రాజ్ఞస్స్వతంత్రతా
మంత్రేచామాత్యసహితే కుత స్తస్య స్వతంత్రతా-"

"రాజు సర్వదా పరతంత్రుఁడు. వానికి స్వాతంత్ర్య మెక్కడిది? వాఁడు ప్రతిపనినీ మంత్రులతో నాలోచించియే చేయవలెను. ఎందున గూడ నాతఁడు స్వతంత్రుఁడు గాఁడు."

శుక్రనీతి యందును యిట్లే గలదు.

"రోధనం చ భవే త్తస్మాత్ రాజ్ఞ స్తే స్యుః సుమంత్రిణః
న బిభేతి నృపో యేభ్యః తై స్స్యా త్కిమ్ రాజ్యవర్ధనమ్!
యథాలంకారవస్త్రాద్యైః స్త్రియోభూష్యా స్తథాహితే;
(కౌటిల్యుఁడు)

"అ కార్యములనుండి రాజును దొలగింప నేరకున్నచో నట్టి మంత్రు లుండి యేమి ప్రయోజనము? అకార్యముల నొనర్ప బూనికొన్నపుడు రాజునకు మంత్రులను జూచి భయ ముండ వలెను. అట్టి గౌరవమును మంత్రులు రాజుకడ నుంచికొనవలెను. అట్లు లేకున్నచో ఆ మంత్రులచే రాజ్యక్షేమము గలుగనేరదు. వారు సొమ్ములు దొడిగికొన్న యాడువారి వంటి వారే!"

మంత్రుల కంటెను రాజునకు ప్రధానముగ నియామకమైనది ధర్మము. ఆతఁడు ప్రతికార్యమును ధర్మశాస్త్రనియమము ననుసరించియే యొనర్పవలెను. రాజదండము ధర్మసంరక్షణార్థమే! ఈ విషయము మహాభారతమున స్పష్టముగ గలదు. మహర్షులు పృథు మహారాజునకు రాజ దండమును బ్రసాదించుచు నాతని కిట్లాజ్ఞ యొసఁగినారు.

"నియతో యత్ర ధర్మోవై తమశ్శంక స్సమాచర!"

"ఎవ్వరికిని భయపడక ధర్మానుసారమే వర్తింపుము." ధర్మము చక్రవర్తులకును చక్రవర్తి వంటిది. ఈ విషయమును మనువు ముక్త కంఠముతోఁ జెప్పెను. శుక్రనీతి గూడ రాజు ధర్మవిధేయుఁడై వర్తింపవలెనని పలుకుచున్నది. ఇతరదేశములలో రాజులే శాసనములను సృష్టింతురు. భారతదేశము నందలి రాజుల కా యధికారము లేదు. రాజు ధర్మముల నేర్పఱచుటకు జన్మింపలేదని భారతీయుల విశ్వాసము. వారి దృష్టిలో ధర్మము నిత్యము. అది యెన్నడో రాగద్వేష హీనులైన మహర్షులచేఁ గనుగొనఁబడినది. ఆ ధర్మములను సమాజమునందు వర్తింప జేయుటయే రాజు బాధ్యత! రాజు మాత్రమే గాదు. వాని పరిపాలనాంగమైన సమస్తాధికారులను ధర్మవిధేయులుగనే వర్తింపవలెను. సామాజికముగ వైయుక్తికముగ భారతదేశ ధర్మమున కొసఁగిన ప్రాధాన్యము అసామాన్యమైనది.

ఇతర దేశములలో వలె మన దేశమున "King does no wrong". "రాజపరాధమునే యొనర్పడు" అను విశ్వాసము లేదు. కనుక రాజునకు ధర్మశాస్త్రము నుల్లంఘించు నధికారము మనవా రొసఁగలేదు. ఇంతమాత్రమే గాదు. సామాన్యు డపరాధ మొనర్చినచో మన ధర్మశాస్త్రములు విధించిన శిక్ష వేఱు. రాజు తప్పు జేసినచో వానికగు శిక్ష వేఱు. సామాన్యునకు విధించు దండమునకంటెను రాజపరాధము నొనర్చినపుడు వానికి విధించు శిక్ష సహస్రగుణితము లట! మనువేమి చెప్పుచున్నాడో చూడుడు...

"కార్షాపణం భవేత్ దండ్యో యత్రాన్యః ప్రాకృతో జనః
తత్ర రాజా భవేత్ దండ్యః సహస్ర మితి ధారణా॥
(మనుస్మృతి అ॥ 8)

"సామాన్యుఁ డొక దోషమును జేసిన శిక్షగా నొక కార్షాపణము విధించుటచోట నా దోషమునే రాజొనర్చిన వానికి వేయి కార్షాపణములను విధింపవలెను."

భారతీయ నీతి శాస్త్రముల ననుసరించి శాసనముల సృష్టించు సంఘము వేఱు. దాని నమలుపఱచు సంఘము వేఱు. ఈ రెంటిని వారు కలిపి యొకరి యధికారము క్రిందనే బెట్టలేదు. ధర్మనిర్ణేతలు ధర్మశాస్త్ర విజ్ఞులైన పండితులు వారికిని సంశయములు గలిగినచో తపస్వుల నడుగుచుండిరి. తపస్వులెవ్వరును తటస్థపడనప్పుడు బహుజన మతానుసారము ధర్మము నిర్ణయింపఁ బడెడిది. ప్రత్యక్ష దండ విధానము మాత్రము రాజు చేయిమీదుగనే జరుగుచుండెను.

## కరపద్ధతి

"రాజు ధర్మమునకు సేవకుఁడు. ప్రజలకు సేవకుఁడు. ఇట్లని భారతము చెప్పెను. ఇతర నీతి శాస్త్రములును యీ విషయమునే యుల్లేఖించినవి. సేవకునకు వేతనము గావలెను గదా! రాజునకును వేతన మున్నది. అది యేది? జనుల యాదాయమున నాఱవపాలు రాజున కొసఁగుదురు. అదియే వారికి వేతనము.

భారతమున నీ శ్లోక మున్నది.

"బలిషష్ఠేన శుల్కేన దండేనాథాపరాధినాం
శాస్త్రనీతేన లిప్సేథాః వేతనేన ధనాగరం"

అపరాధులకు శిక్షగా వేయుధనము గూడ రాజునకే జెందును. ఈ రెం డాదాయములు దప్ప నితరవిధములుగ రాజు స్వప్రయోజనమునకై ధనమును గుంజరాదు. ఈ విషయమున భారతము రాజునకు చాల జాగ్రత్త జెప్పినది. భారతమునం దిట్లు గలదు.

"నోచ్ఛిద్యా దాత్మనో మూలం పరేషాంచాపి తృష్ణయా॥
(శాం॥ ప॥ అ॥ 88 శ్లో॥ 8)

"ఆశాపరుఁడైన రాజు ప్రజలను మూలమట్టముగ బీడింపరాదు. ఇతరులు బీడించుచున్నచో జూచి యోర్వరాదని పై శ్లోకమున కర్థము. ఆశకు గూడా మిత ముండవలెను. జనకంటకుఁడైన రాజును ప్రజలు ద్వేషింతురు. ఈ విషయమును గూడ భారతమే యిట్లన్నది.

"ప్రద్విష్యంతి పరిభ్యాతం రాజాన మతిభాదినం"

(శాం. ప: 88 వ అ. 79వ శ్లో)

కోశ సమృద్ధి రాజ్యమునకు మూల కారణము. ఈ విషయమును భారతకారుఁడు బాగుగా గమనించెను. గమనించుచునే ప్రజలపై వేయు పన్నుల విషయమున రాజున కెంతయో జాగ్రత్త జెప్పినాఁడు. వ్యాసభగవానుఁడీ విషయమున జేసిన సూచనలు నేటి రాజకీయ వాదులకును గమనార్హములై యున్నవి. కేవలము కోశ సమృద్ధినే దృష్టిలో నుంచికొని ప్రజలను బీడించు క్షత్రియ బ్రాహ్మణులను గుఱించి, వ్యాసభగవానుఁ డనేక తావుల మందలించినాఁడు. అతఁ డొకచో నిట్లనెను.

"కామక్రోధౌ పురస్కృత్య యోఽర్థం రాజానుతిష్ఠతి -

.... ..... ...... .....

జనయ త్యతులాం నిత్యం కోశ వృద్ధిం యుధిష్ఠిర!"

(భా. శాం. ప. అ. 71)

"ప్రద్విష్యంతి పరిభ్యాతం రాజాన మతిభాదినం

.... ..... ...... .....

యో రాష్ట్ర మనుగృహ్ణాతి పరిరక్షన్ స్వయం నృపః."

(భా. శాం. ప. అ. 87)

"మధుదోహం దుహే ద్రాష్ట్రం భ్రమరాఇవ పాదపం
.... ..... ...... .....
అనుపూర్వ్యేణ సాంత్యేన యథాకాలం యథావిధి!"
(భా. శాం. ప. 88)

పై శ్లోకముల యర్థమిది.

"కామ క్రోధములకు వశుఁడైన రాజు రాజ్యమునుబరిపాలింపరాదు. అట్టి వానికి ధర్మార్థములు రెండును బ్రాప్తింపవు. ఆ రాజునకు గలుగు ఫల మొకటే! మూర్ఖుఁడనెడు యపకీర్తి! నృపాలుఁడు మూర్ఖులను, లుబ్ధులను, కార్యముల పట్ల వినియోగింపరాదు. అలుబ్ధులను, బుద్ధిమంతులను వినియోగించికొనవలెను. మూర్ఖుఁ డధికారియైనచో వాఁడు కామక్రోధ సమన్వితుఁ డగును. కార్యములందు వానికిఁ జాతుర్య ముండదు. వాఁడు ప్రజలను బాధించును. రాజునకు వేతనములు రెండే! ఒకటి ప్రజల యాదాయమున నాఱవపాలు! దోషులకు విధించు శిక్షారూపమైన ధనము. ఈ రెంటితోమాత్రమే నృపాలుడు జీవింపవలెను. ధర్మమైన కప్పమును ప్రజలనుండి గైకొనుచు, యథావిధిగ ప్రజలను బరిపాలించు రాజు ధర్మార్థముల రెంటిని బొందును. నృపాలుఁ డర్థశాస్త్రవిదుఁడు గావలెను. శాస్త్రవిహితములు గాని పన్నులను రాజు బ్రజల నుండి గ్రహింపరాదు. ఈ విధానము కాలక్రమమున వాని వినాశనమునకు దారితీయును. పాలు దండిగ గావలెనని యావుపొదుగునే గోయువాఁడు బుద్ధిహీనుఁడు గదా! కోశ బలమే రాష్ట్రమునకు మూలబలమని పన్నులకై ప్రజలను పీడించు రాజు గూడ నింతే! పాలు పిదుకు వాఁడు గోవుయొక్క క్షేమమును గమనింపవలెను. తనకు గావలసినన్ని పాలు మాత్రము పిండుకొన వలెను. రాజుగూడ నింతే! వాఁడు ప్రజలయెడ నుపాయముతో మెలగవలెను. అట్లు మెలగినచో కామధేనువుతో సమానమైన బ్రజలు రాజునకుఁ గోరికలఁ బిదికెదరు.

అధికముగ పన్నులను గుంజు రాజును ప్రజలు ద్వేషింతురు. ప్రజల కష్టుఁడైన రాజునకు సుఖమేదీ! రాష్ట్రమును. గోవును ఒకటే నంటిమి. వత్సమును వలెనే, రాష్ట్రమును నృపాలుఁడు గాపాడ వలెను. అవిరామముగ బిదికినచో గోవు బనికి రాకపోవును గదా! ప్రజలు గూడ నింతే! అమితముగ ప్రజలను వేధించినచో వారు క్రియావిముఖులై పోదురు. రాజునకు వారు సుఖమును గోరరు. రాష్ట్రము ఛిన్నమై పోవును. పూవులను నొప్పింపక భ్రమరము మధువులను గ్రోలును. పాలు పిదుకువాడు, గోవుయొక్క పొదుగును మాటికిని కొట్టి బాధింపక యుపాయముగ పాలను పిండికొనును. ఆడుపులి తననోట పిల్లలను గఱచికొని యొక యెడనుండి మఱియొక యెడకు గొనిపోవును. ఆ కొని పోవునపుడు తన దంతములచేత పిల్లల కొకింత బాధయు గలుగనివ్వదు. రాజు ప్రజల విషయమున నిట్లే వర్తింప వలయును. అతఁడు వారియెడల నెన్నడును దురుసుగా నడచికొనరాదు. క్రమ క్రమముగా నాతఁడభివృద్ధి చెందవలెనే గాని యొక్కసారి మిన్నం... దలపరాదు. బాహ్యాంతరిక శత్రువుల దమించికొని రాజ్యమును బెంపొందించి కొనవలెను. మృదు పూర్వకముగ సంభాషించుచు ప్రజలనుండి పన్నులను రాబట్ట వలెను. అకాలమున అస్థానముగ కప్పములను రాబట్టుటకై యత్నింపరాదు. ప్రజలనుండి యధికముగ పన్నులను గైకొనవలసిన యవసర మేర్పడినప్పుడు అట్లెందుకు జేయవలసి వచ్చినదో రాజు వారికి వివరించి చెప్పవలెను. ఇట్లు వర్తించుచున్న రాజు యథాకాలమున యథావిధిగ నభివృద్ధి నొందును.

# కోశము నెట్లభివృద్ధి పఱుపవలెను?

రాజ్యమునకు ప్రధాన బలము కోశసంపత్తి! ఈ యభిప్రాయము 'వ్యాస భగవానునిదే! ఆతఁ డిట్లనెను..

"రాజ్ఞః, కోశక్షయా దేవ - జాయతే బలసరక్షయః"

(భా. శాం. ప. అ. 130)

"కోశము చెడిననాడు రాజు చెడు" నని పై శ్లోకమున కర్థము. ఇంతేగాదు. భారతకారుఁడు యింకను కోశమును గుఱించి యీ క్రింది మాటలన్నాడు.

"రాజ్ఞః కోశబలం మూలం కోశమూలం పునర్బలం

.... ..... ...... .....

తదర్థం పీడయిత్వా చ దోషం ప్రాప్తుం న సోఽర్హతి!

(భా. శాం, ప, అ. 130)

"కోశము రాష్ట్రమునకు ముఖ్యము. రాష్ట్రసమృద్ధి కోశ సమృద్ధిపై నాధారపడియున్నది. భండారము నిండుగా నున్నపుడే సైన్యము లుత్సాహముతోఁ బ్రవర్తించును. సైన్యము సర్వధర్మములకును మూలము! ధర్మము ప్రజల కాధారము! ఇతరులను బాధింపనిది కోశ మభివృద్ధిచెందదు గదా! కోశము లేనిది బలమే లేదు. కనుక తన భండారము నభివృద్ధిపరచుటకై రాజు ప్రజలకు కొంత కష్టమును గలిగించినచో నందులో నాతని దోషము లేదు. కాని, యెట్టి ప్రజలనుండి పన్ను నెక్కువగ రాబట్టవలెను? అనునదేప్రశ్న. ఈ ప్రశ్నకు మహాభారత మి ట్లుత్తరము జెప్పినది.

"పానాగారనివేశాశ్చ వేశ్యాః ప్రాపణికా స్తథా
కుశీలవా స్సకితవా యేచాన్యే కేచి దీదృశాః!

(భా. శాం. ప. 88 వ అ.)

"మద్యపాన గృహములు, వేశ్యల యిండ్లు, విటులు, జారగాండ్రు మొదలైనవారినుండి రా జధికముగ పన్ను రాబట్టవలెను. వీరిపై రాజు ధనరూపమైన శిక్షను విధించి కోశము నభివృద్ధిపఱచుకొనవలెను". కారణమేమనగా వీరు ప్రజలను మోసగించి ధనమును సంపాదింతురు. ఈ నడుమ కొందరిలో నొక దురభిప్రాయము వ్యాపించి యున్నది. "పూర్వ నీతిశాస్త్రము లోక ధర్మమును వాకొన్నవి. బ్రాహ్మణులనుండి రాజు కప్పము గైకొనరాదు. బ్రాహ్మణులను శిక్షింపరాదు" యనునది యా న్యాయము. దీనిని బట్టికొని యనేకులు పూర్వకాలమునందలి నీతిశాస్త్రములు విప్రులయెడఁ బక్షపాతమును జూపినవని నిందింతురు. ఈ యపవాదు సత్యముగాదు. బ్రాహ్మణకులమున పుట్టువందిన మాత్రమున వాఁడంతయు రాజదండనమునకు బాహ్యుఁడని నీతిశాస్త్రములు పలుకలేదు. బ్రాహ్మణుఁడైనవాఁ డంతయు గప్పమును జెల్లింపవలసినది లేదనియు వాకొనలేదు. కేవల షట్కర్మనిరతులై, తపశ్శరీరులై యరణ్యముల వసించు బ్రాహ్మణుల నుండి మాత్రమే నృపాలుఁడు పన్నును గైకొనరాదని నీతిశాస్త్రములు పలికిన బ్రాహ్మణులయందే క్షత్రియ వైశ్య శూద్రులు వృత్తిభేదముచే నున్నారని యింతకుముందే యొకసారి మనవిజేసితిని. అట్టివారినుండి రాజు ఖచ్చితముగ పన్నును రాఁబట్టుచుండెను. ఇంతమాత్రమే గాదు. వారితో వెట్టిచాకిరి గూడా చేయింపవలెనని వ్యాసభగవానుఁడన్నాఁడు. ఆ శ్లోకము లివి:

"అశ్రోత్రియా సర్వఏవ, సర్వే చానాహితాగ్నయః

.... ..... ...... ......

తతో నిర్వాసనీయస్స్యాత్తస్మా ద్దేశా త్సబాంధవః"

"శ్రోత్రియుఁడు గానివాఁడు బ్రాహ్మణుఁడుగాడు. అగ్న్యుపాసన లేనిది బ్రాహ్మణత్వము లేదు. ఇట్టి జాతిమాత్రోపజీవులైన విప్రుల నుండి రాజు పన్నును గ్రహింపవలెను. ఇంతమాత్రమే గాదు. వెట్టి చాకిరి గూడ చేయింపవలెను.

ధనమును దీసికొని దైవవిషయకములైన పనులొనర్చు బ్రాహ్మణుఁడు చండాలుఁడు. ఋత్విజులు, పురోహితులు, మంత్రులు, దూతలు, రాయబారులు వీరు బ్రాహ్మణులలో క్షత్రియులు. గుఱ్ఱపు రౌతులు, గజారోహకులు, రథికులు, పదాతులు, వీరు బ్రాహ్మణులలో వైశ్యులు. కోశ మధికముగాఁ దరిగిపోయినప్పుడురాజు వీరి నుండి కప్పము నధికముగ గ్రహింపవచ్చును. సామాన్యముగ రాజు దేవతుల్యులు, బ్రహ్మతుల్యులు నగు విప్రులనుండి పన్నును గ్రహింపరాదు. "అబ్రాహ్మణుల విత్తమునకు నృపాలుఁడు అధికారి యనెడు మాటకు వ్యాఖ్యానమిదే! తమ వర్ణధర్మములను వదలి యితర ధర్మముల గ్రహించు విప్రుల నెన్నడును నృపాలుఁ డుపేక్షింపరాదు. వారి నుండి యాతఁ డవశ్యము గప్పము గైకొనవలెను. అవసరము వచ్చినప్పు డట్టివాంని దండింపవలెను. దండించి ధర్మమును రక్షింపవలెను. ఏ రాజు రాజ్యమున బ్రాహ్మణుఁడు చోరవృత్తి నవలంబించునో వాని దోషము రాజుదేనని పెద్దలందరు. వేదవిద్యలు జదివి స్నాతకుఁడైన బ్రాహ్మణుఁడు దొంగతనమును విడువకున్నచో వానిని దేశమునుండి బహిష్కరింపవలెను."

## ఉపజీవనము మఱియు రాజ్యసంస్థలు

హైందవ నీతిశాస్త్రముల ననుసరించి "యుపజీవన" మొక పెద్ద సమస్య! దీని నవి యెంతయో సమర్థముగ పరిష్కరించినవి. ఆఁకలి గొన్న జనులు సంస్కృతిని లెక్కింపరు. ధర్మమును గౌరవింపరు. కనుక యీ రెండును సరిగా నడువవలెనన్నచో జనుల కుపజీవన ముండవలెను. ఈ విషయమును నీతిశాస్త్రకారు లెంతయో జక్కగ గమనించిరి. గమనించి దీని విషయమై యెంత జాగ్రత్త గైకొనవచ్చునో యంతయు గైకొన్నారు. పరిపాలనాదక్షుఁడైన రాజు వర్తకము, వ్యవసాయము, యుద్యోగములు వీని విషయములందు జాగ్రత్తవహించియుండవలెనని

నీతిశాస్త్రములు నొక్కి పలికినవి. పాలనములందలి సామర్థ్యమే రాజు యొక్క క్షేమమునకుఁ బునాదిరాయి! సామాజికములు, ఆర్థికములు నగు సమస్యలు పరిపాలనలో నగ్రశ్రేణికిఁ జెందిన ముఖ్యవిషయములు. రాజు సర్వవర్ణములు, వర్గములు, జాతులు వీనికి సంబంధించిన యుపజీవనములను జక్కగ రక్షింపవలెను. వాని నభివృద్ధి నొనర్చుటకు గావలసిన యేర్పాటు లన్నియు నొనర్పవలెను. ఆ యేర్పాటులను భంగపఱచువారి నెవ్వరినే గాని నిష్కరుణముగ శిక్షింపవలెను. ఒక వర్గము మరియొక వర్గము యొక్క జీవనము నాక్రమింప బూనుకొనరాదు. అట్లొనర్చుట మహా దోషము! రాజీ యపరాధము సహింపనే రాదు. వార్తాశాస్త్ర మనగా ఉత్పత్తికి సంబంధించిన వివిధ విభాగముల శాస్త్రము. ఈ వార్తను సంరక్షించుట రాజునకుఁ జాల ముఖ్యమైన పని! వ్యాస భగవానుఁడు శాంతి పర్వమున రాజనీతిని బోధించుచు రాజనీతికి 'వేదత్రయి' గలదని వాకొనెను. వానిలో మొదటిది కర్మకాండము. రెండవది యాన్వీక్షకి అనఁగా అధ్యాత్మ శాస్త్రము. మూఁడవది వార్త. ఈ వార్తనే వ్యాసభగవానుఁడు 'జీవికా కాండ' యని పిలిచెను. అతఁడు వ్రాసిన శ్లోక మిది.

త్రయీ చాన్వీక్షకీ చైవ వార్తా చ భరతర్షభ!
దండ నీతిశ్చ విపులా విద్యాస్తత్ర నిదర్శితాః.
(శాం. 59. అ)

'వార్తకు' భారత కారుఁడు గొప్ప గౌరవ మొసఁగినాఁడు. సమస్త ప్రపంచమును వార్తపై యాధారపడి యున్నదని యతఁడు దలఁచెను.(*). కృషి, పశుపాలనము, వాణిజ్యము యీ మూఁడును లోకస్థితికి ముఖ్యమైన యంగములు (*).

(*). వార్తామూలో హ్యయంలోకః! (శాం. ప. అ. 68. శ్లో. 35)
(*). కృషి గోరక్ష వాణిజ్యం లోకానా మిహ జీవనం (శాం. అ. 89. శ్లో.7)

భారతమునందలి వన పర్వమున వ్యాసులు జీవికాకాండ్ర యొక్క గొప్పతనమును మఱియొక మారు వర్ణించినాఁడు. ఈ కథలో హనుమంతుఁడు చాతుర్వర్ణ్యాత్మకమైన సమాజ రచనయొక్క ధారణ పోషణములు వార్తపైననే యాధారపడి యుండునని స్పష్టముగఁ జెప్పెను. ప్రజల యీ యుపజీవికను రక్షింపని రాజు కేవలము 'బలి భాగహారి'యైన దొంగవంటి వాఁడు. పై విషయమును ప్రపంచించుచు వ్యాస భగవానుఁ డొక చక్కని యుపమానమును గూడ వాడినాఁడు. ఈ యుపమాన మీ క్రిందిది.

"భవితవ్యం సదా రాజ్ఞా గర్భిణీ సహ ధర్మిణా: (శాం. 56 వ అ.)

"గర్భవతియైన స్త్రీ తన యుదరమున నున్న శిశువును రక్షించుకొనుటయందే పూర్ణముగ జాగ్రత్తగొనును. ఆమె యితర విషయములను బట్టించు కొనదు. అట్లే రాజును ప్రజల యుపజీవనములపైన తన దృష్టిని కేంద్రీకరింపవలెను. తక్కిన విషయముల నాతఁడు గమనింపనేరాదు. ఇంతమాత్రమే గాదు. భారతకారుఁడింకను ముందునకు వెళ్ళినాఁడు. ఆతఁ డనెను.

"మాతేరాష్ట్రే యాచనకాఽభూవ న్మా చాపి దస్యవః
ఏషాం దాతారఏవైతే నైతే భూతస్య భావకాః.

"మీ రాష్ట్రమందు బిచ్చగాండ్రు లేకుందురు గాక! దొంగలు కలవాదురు గాక!" తన కర్తవ్యమునుండి విముఖుఁడైన రాజును గూర్చి భారత మెంతయో తిరస్కారముగ మాటలాడినది. అట్టి రాజు నా మహాగ్రంథము గౌరవింపనే లేదు.

## చక్రవర్తులను గూడ యెన్నికొనుచుండిరి

ప్రాచీన రాజ్యతంత్ర మిట్లు సునియంత్రితమై యుండెను. ప్రజలే దానిని నిర్మించుకొనుచుండిరి. ఆ రాష్ట్రములలో చక్రవర్తి పదము గూడ యెన్నికలలో

ప్రాప్తించుచుండెనని దోఁచుచున్నది. సామాన్య జనులు రాజునకు కుటుంబమువంటి వారు గదా! అట్లే రాజులును చక్రవర్తికి కుటుంబము. ఈ రాజులందరును తమలో నొక్కనిని సామ్రాజ్యపతిగా నెన్నికొనుచుండిరి. శీలవంతుఁడు సమర్థుఁడు అగువానినే వా రెన్నికొనెడివారు. అతఁడు యీ రాజులలో పరస్పర కలహము రేకెత్తినపుడు వానిని దీర్చి శాంతిని రక్షించెడివాఁడు. కనుక సమ్రాట్పట్టము గూడ లోక సమ్మతితోనే ప్రాప్తించు చుండెడిది. ఆ పట్టము నిర్మితమైనదియు ప్రజల యవసరమును బట్టియే! దీనికి సంబంధించిన విషయము భారతములోనే వచ్చును. సామంతులందరు జేరి శంతనుని సామ్రాట్టుగా నెన్నికొన్నారు. ఆ వర్ణణన మిది.

"న చాస్య సదృశః కశ్చిద్ధర్మతః పార్థివోఽ భవత్

.... ..... ...... .....

పతిం భారత గోప్తారం సమపద్యం భూమిపాః :

(భా. అ. ప. అ. 100)

"ఆ కాలమున శంతనునితో సమానుఁడైన ధర్మనిష్ఠుఁడు మఱియొకఁడు లేఁడు. అతఁడు ధార్మికులకుఁ దలకట్టువంటివాఁడు. సామంతులు తమలోఁ దా మీ విషయమును జక్కగఁ జర్చించికొనిరి. అందఱును జేరి శంతనునకు సామ్రాజ్యపదము నొసఁగి యభిషేకించిరి. భారత వర్షమున కంతయు శంతనుఁడు చక్రవర్తియైనాఁడు. ఆతని రాజ్యమున ప్రజలకు శోకభయాదులు లేవు. సామంతులందరును సంతోషముగ కాలమును వెళ్ళబుచ్చిరి."

ఈ రీతిగ సూర్యచంద్ర వంశరాజులలోఁ గొందరు సామ్రాజ్యపదము నందుచుండిరి. ఈ యాచారము భారతవర్షమునం దుండెను. భారతమునందలి సభా పర్వము పదునాల్గవ యధ్యాయమున శ్రీకృష్ణుఁడు ఒక కథ నుల్లేఖించుచున్నాఁడు. ఆతఁ డిట్లనును.

ఐలస్యైక్ష్వాకువంశస్య ప్రకృతిం పరిచక్షతే
రాజానః శ్రేణి బద్ధా శ్చ తథాన్యే క్షత్రియా భువి. (భా. స. అ. 14)

"ఐలుఁడు, ఇక్ష్వాకుఁడు, మొదలైన రాజులందరును తక్కిన సామంతులు గూడ ప్రజల సమ్మతి ననుసరించియే సింహాసనములపై నధివసించిరి." భారత దేశమునందలి యాచార మిదే.

## రాజును చంపవచ్చునా? లేదా?

మహా భారతము ననుసరించి రాజును నియమించు వారెవ్వరెవ్వరో యింతవరకును దెలిసికొంటిమి. రాజు తన ధర్మమును గళంకిత మొనర్పరాదు. స్వార్థపరుఁడు గారాదు. నిరంకుశుఁడౌ టకు వీలులేదు. ఇట్టివానికి సింహాసనము నధిష్ఠించు నధికారము లేదని భారతము పల్కినది.

అంతమాత్రమే గాదు. వానికి జీవించుటకు గూడ నధికారము లేదని వ్యాసుని యభిప్రాయము. ఇట్టి రాజులను ప్రజలు చంపిన ఘట్టములు మన ప్రాచీన చరిత్రలోఁ గొన్ని గనపడుచునే యున్నవి. వేనరాజు నిరంకుశుఁ డైనాఁడు. వానిని ఋషులు వధించిరి. ఈవిషయము భారతము శాంతిపర్వమున వచ్చును.

"తం ప్రజాసు విధర్మాణం రాగద్వేష వశానుగం
మంత్రభూతైః కుశైర్జఘ్నుః ఋషయో బ్రహ్మవాదినః.
(శాం॥ అ॥59)

"వేనరాజు ధర్మమును లెక్కింపకపోయెను. వాఁడు ధర్మము నుల్లంఘించినాఁడు. రాగద్వేషములకు వశుఁడయ్యెను. నిరంకుశుఁడై వర్తింపసాగెను. బ్రహ్మవాదులైన ఋషులు వానిని మంత్రపూతములైన దర్భలతో వధించిరి."

ఈ రీతిగా నధర్మపరులైె రాజు లెందరో మడిసిరి. కులాంగారులైన యిట్టి రాజులను పదునాలుగు మందిని భారతము ఉద్యోగపర్వమున బేర్కొనుచున్నది.

"హైహయానాం ముదావర్తో నీపానాం జనమేజయః
యుగాంతే కృష్ణసంభూతాః కులే కుపురుషాధమాః ॥
(భా॥ ఉ॥ 746)

ఎట్టి పరిస్థితులలో రాజు వధింపఁబడుట కర్హుఁడు? అను విషయమున భారత మిట్లు తీర్పుఁ జెప్పినది. దుష్టుఁడైన మంత్రి కలిగి యుండి ధర్మనాశమున కుద్యమించు రాజు వధార్హుఁడు(*). ఈ విషయమునే వ్యాసభగవానుఁ డనుశాసన పర్వమందలి 61 వ అధ్యాయమున నింకను విస్తృతముగ వర్ణించినాఁడు. ఆ వర్ణనాభాగ మిది.

"ధి క్తస్య జీవితం రాజ్ఞో రాష్ట్రే యస్యావసీదతి
..... ........ ..... ........
ససంహత్య నిహంతవ్యః శ్వేవసోన్మాద ఆతురః
(భా॥ అను॥ అ॥ 61)

"ఎవని రాజ్యమున బ్రాహ్మణుఁడు గాని, తక్కిన జాతివాఁడు గాని జీవికలేక బాధపడుచుందురో అట్టి రాజు బ్రదుకు నీచమైనది. ఎవని రాజ్యమున తపస్వులు యన్నము దొరుకక, నాఁకలిచేమాడుచు నిట్టూర్పులు వదలుచుందురో వాని రాజ్యము బాగుపడదు. వాఁడు వినాశము నొందును. భర్తలు, తండ్రులు అసహాయులై యేడ్చుచుండగా స్త్రీల యిష్టముతో నేలపైఁ బొరలుచు విలపించుచుండగా వా రే రాజ్యమునుండి శత్రువులచే నపహరింపఁ బడుదురో యిట్టి పరాక్రమ హీనుఁడైన రాజుచేఁ బ్రయోజనమేమి? వాఁడు జీవన్మృతుడు. ఏ రాజు ప్రజలను రక్షింపఁడో, ప్రజలను పీడించి పన్నులను గైకొనునో ధర్మమును లెక్కింపడో, నిరంకుశుఁడో, యట్టి రాజును ప్రజలు చుట్టుముట్టి సంహరింతురు. వానిపై

(*). అసత్పాపిష్ఠ సచివో వధ్యో లోకస్య ధర్మతః

దయ తలపవలసిన పనిలేదు. అట్టి రాజు పాపముల యాకారము. "నేను మిమ్ము రక్షింతు"నని వాగ్దాన మొసఁగి సింహాసన మెక్కిన నృపుడు ప్రజలను రక్షింపనపుడు వారు వానిపైఁ దిరుగఁబడి పిచ్చిబట్టిన కుక్కను వలె నిర్దాక్షిణ్యముగఁ జంపవలెను.

భారతకాలమునందు రాజులచేఁ బాలింపఁబడు రాజ్యములే గాని రాజులేని రాజ్య వ్యవస్థలు (Republics) లేవని కొందఱు వాదింతురు. అది సత్యము గాదు. వేదకాలము నుండియు మనలో గణరాజ్యములు (Republics) ఉండెడివి. వానిని గుఱించిన యితిహాసములు మన సాహిత్యమున కొల్లలకు వచ్చును. ఈ గణరాజ్యముల ప్రతాపము వలననే అలెగ్జాండరు వంటి జగదేకవీరుఁడు, భారతమున నిలువలేక వెనుకకు దిరిగెను. గ్రీసు వీరుని యోటమికి గణరాజ్యములే కారణ మని చరిత్రము ఘంటా ఘోషముగఁ బలుకుచున్నది. గణ రాజ్యము లత్యంత సమృద్ధములుగ నుండెడివి. అవి సంపన్నములు, సమర్థములు గూడ! వానిలో వ్యవస్థ సునిర్మితమై యుండెను. శ్రీకృష్ణునకు సంబంధించిన యాదవుల రాజ్యములు గణరాజ్యములే! ఇంత మాత్రమే గాదు. వానిలో బభ్రుఁడు, ఉగ్రసేనుఁడు, శ్రీకృష్ణుఁడనెడు ముువ్వురు ప్రజానియుక్తులైన యధ్యక్షు లుండిరి. వారు ప్రజా పరిషత్తులలోఁ దమ యభిప్రాయములను వెల్వరించుచుండిరి. ఇట్టివర్ణనములు భారతము నందే గలవు. గణరాజ్యములు సురక్షితములై సమర్థములై యుండుట కనుసరింపఁదగిన పద్ధతులేవి? యను విషయమును భారత మెంతయో విపులముగ వర్ణించిచెప్పినది. ఆ మహాగ్రంథమేమి చెప్పినదో యవలోకింతము గాక!

# రాజ్యతంత్రముయొక్క యధఃపతనము

## గణరాజ్యములు : (Republics)

సామాన్యమైన వ్యక్తికి గణరాజ్యములను నిర్వహించు నప్పుడు గలుగు కష్టములేవి? వాని నెట్లు నివారించుకొనవలెను? ఈ విషయములను గూర్చి భారతము శాంతి పర్వమున వర్ణింపబడి యున్నది. ఆ భాగమిది.

"యథా గణాః ప్రవర్ధంతే న బధ్యంతే చ భారత

..... ......... ..... .........

తస్మా త్సంఘాత మేవాహుః గణానాం శరణం మహత్ ॥

(భా॥ శాం॥ అ॥ 107)

పై శ్లోకముల వ్యాఖ్యాన మిది. "సంఘ రాజ్యము లెట్లభివృద్ధి నందుచున్నవి? శాత్రవులను జయించు విధమేది? మిత్రులను సంపాదించు టెట్లు? పరస్పర విభేదములతోనే గణరాజ్యములు నశించునని నా యభిప్రాయము. మంత్రసంవరణము కష్టసాధ్యమైన విషయము! పరంతప! ఈ విషయముల నన్నిటిని వివరింపఁగోరుచున్నాను. మీరు వాని నెఱిఁగింపవలెను. గణరాజ్యములు తమలోఁ దాము వాదులాడు కొనక పొంది, పొసఁగి మనుటెట్లు?

భీష్ముఁ డిట్లుత్తరమును జెప్పెను. "సంఘరాజ్యములు, కులరాజ్యములు, వీనియందు ముఖ్యములైన దుర్గుణములు, లోభామర్షములు! ఈ రెండే వైరసందీపనమునకు గారణములు. తొట్టతొలుత లోభము జనించుచున్నది. దాని నాశ్రయించికొని కోపము గల్గును. ఈ రెంటిచేతఁ బ్రేరితులై గణరాజ్య నాయకులు దమలోఁ దాము. కలహములకుఁ జొత్తురు. పరస్పరము వివాద మొనరించుకొన దలఁచి కడ కిర్వురును నాశన మగుదురు. ఒకానొకని మనస్సున లోభ

ముత్పన్నమయ్యె ననుకొందము. దాని నాశ్రయించియే మాత్సర్యము గూడ గలుగును. వాఁడు రహస్యవృత్తి నవలంబించును. తన సైనిక సంపదను రహస్యముగ నభివృద్ధి పఱచుకొనును. సామదాన భేదములు బ్రదర్శించి యితరులను లొంగదీసికొనఁ యత్నించును. వారిని భయపెట్టి తన యధికారమునకు సమ్మతింపఁ యును. గణరాజ్యములలో నొక్కఁడైనను నీ రీతిఁ బ్రవర్తించుట కారంభించినచో నిక నా రాజ్యము లన్నియు జెడినట్లే! ఈ దుర్భావము క్రమ క్రమముగ నాక్రమించికొనును. వారు పరస్పర క్షేమములను విచారించికొనరు. సామూహికమైన సౌఖ్యముల కొనర్ప వలసిన కార్యములందుఁ బాల్గొనరు. ఈ రీతిగ **వారిలో** నున్న సంఘశక్తి నాశనమై పోవును. ప్రతియొక్కఁడును యితరుల క్షేమములను విచారింపక తన్ను రక్షించుకొనుటకు మాత్రమే బోరాడును. గణ రాజ్యములలో స్వార్థము బెరుఁగును. స్వార్థమూలమున నవి శాత్రవులకు లోఁబడును. గణ రాజ్యము నందలి సంఘ జీవనము నాశన మెప్పు డయ్యెనో యిఁక వాని స్వస్వరూప నాశనమునకు గూడ నాలస్యము లేదని మనము దెలిసికొన వచ్చును. గణ రాజ్యములు సంఘీ భావమును వదలుకొని "ఎవరికి వారే" యైనచో వానిని శత్రువులు సులభముగ జయింతురు. కనుక సంఘరాజ్యము లెప్పుడును తమలోని సంఘీభావమును జెడగొట్టుకొనక రక్షించికొనవలెను. దాని కగు ప్రయత్నము లన్నిటి నొనరింపవలెను. సంఘ రాజ్యము లందలి ప్రజలందరును బలవంతులై శూరులై యుందురు. సంఘశక్తితో వారి పరాక్రమము ద్విగుణీకృతముగఁ బ్రకాశించును. గణ రాజ్యములు సమృద్ధములై యుండును. ఇతరులు గూడ వారి మైత్రికై సౌహార్దమునకై యఱ్ఱులు సాచుచుందురు. గణరాజ్యము లందలి జ్ఞాన వృద్ధులైన జనులు స్వార్థమును వదలి సంఘ జీవనమున విలీనులై వర్తింతురు. ఎప్పటి కప్పుడు రాజ్యముల లోని దొసఁగులను గమనించి వానిని వాపుటకై బ్రయత్నింతురు.

జనులు పరస్పరము సరళముగ వ్యవహరించి కొందురు. వారి చిత్తవృత్తులును శుద్ధములై యుండును. ఆ జనులు ధర్మానురతులై యుందురు. విధి విధానముల జక్కగ గమనించి బ్రదుకుటచే వారి జీవనములు సుఖవంతములై యుండును. ఆ జనులు బరస్పరము బాధించికొనరు. అపకారము లొనర్చికొనరు. వాని యందలి పెద్దలు తమకంటే చిన్న వారిని శాస్త్రానుసారముగఁ బెంతురు. వారికి సద్గుణము లలవడఁ జేయుదురు. సమస్త విద్యలను, చాతుర్యములను గఱపుదురు. సర్వ విధముల యువకులు సమర్థులైన మీదనే వారిపై జవాబ్దారీగల పనులను మోపుదురు. మంత్ర విధానము కోశ సంగ్రహణము యీ ప్రయత్నములలో గణ రాజ్యము లెప్పుడును సమర్థములై యుండును. ప్రజ్ఞావంతులను, శూరులను, యుత్సాహవంతులను, చాతుర్యవంతులను వారెన్నడు నగౌరవ పఱుపరు. అట్టి వారిని మన్నించి వారి శక్తులను రాష్ట్ర క్షేమమునకై వాడు కొందురు. ఈ గుణము గలుగునంత వరకును గణ రాజ్యములకు ముప్పులేదు. ఆ రాజ్యములలోని శూరులు, శాస్త్రజ్ఞులు, శస్త్రవిద్యా పారంగతులు మొదలగు వారు సోమరులుగా నుండరు. ఆపత్తుసంఘటిల్లి నపుడు వారు దమ్ము రక్షించికొని యెదుటి వారిని రక్షించుటకు సన్నద్ధులై యుందురు. ఈ గుణములు వారిలోనున్నంత వఱకును హాని సేకూఱ జాలదు. తమలోఁ దమకుఁ బరస్పరము క్రోధ భేదములు, భయ దండములు, నిగ్రహము, వధలు మొదలైనవి యుద్భవిల్లినపుడు గణరాజ్యముల కథఃపతనము ప్రారంభమైనట్లే! కనుక వీనిలో నిట్టి లోపములను గలుగ నివ్వక పెద్దలు గమనింపవలెను. యోగ్యులైనవారిని గౌరవించవలెను. అధికారులను మన్నింపవలెను, అధికారులలో రహస్య గోపన ముండవలెను. వారెన్నడును దమలోని రహస్యములను బయట పెట్టరాదు. గణ రాజ్యములలోని ముఖ్యులు దమలోఁ దాము జేరి సంఘ రాజ్యములకు క్షేమమును గలిగించు విషయములను గూర్చి యాలోచించ వలెను.

ఇట్టి రహస్యములు బయట పడినచో ప్రతి యొక గణ రాజ్యమును దన శక్తిని విస్తరించి కొనుటకు బ్రయత్నించును. అపుడు సంఘశక్తి చెడిపోవును. ఏదైన రాజ్యమందొక అన్యాయము జరిగినచో వెంటనే యచ్చటి నాయకులు మేలుకొనవలెను. ఆ యన్యాయమునకు మూల పూరుషులైన వారిని బట్టి శిక్షింపవలెను. మరల వ్యవస్థను బ్రతిష్ఠింపవలెను. కులమున నొక దోష ముప్పతిల్లినచో దానిని కులవృద్ధు లుపేక్షింపరాదు. ఉపేక్షించినచో, నది యాకులమునే నాశనము సేయును. గణరాజ్యముల విషయము గూడ నింతే! అపాయము రెండు రీతులు! ఆంతరికమైన యాపద యొకటి. ఇతరుల నుండి గల్గునది. అనఁగా బాహ్యమైన దొకటి! వీనిలో నాంతరికమైనదే భయంకరము! పెద్దలు దాని నెన్నడు నుపేక్షింపరాదు. అంతర్భయము గణ రాజ్యమును నాశనమొనర్చి తీరును. వానిలోని మనుష్యులు పరస్పర లోభమోహములతో మర్యాదలేక సంభాషించి కొన నారంభించినచో వాని వినాశము దగ్గరించినట్లే! గణరాజ్యము లన్నియు సమానమైన హక్కుగల్గునవి. ఒకదానికి గొప్ప యధికారము మరియొక దానికి తక్కువ యధికారము యను వైషమ్యము వారి లోనుండరాదు. ఉన్నచో నవి చెడినట్లే! రూప ద్రవ్యములందలి వ్యామోహముతో ఆక్రమణములతో సంఘ రాజ్యములుచెడవు. అవి చెడునది పరస్పర ద్వేషములతో తమలోని సంఘీభావమును నాశన మొనర్చికొన్నపుడే కనుక వానికి సంఘ జీవనము ప్రాణముతో సమానమైనది. అందుకై గణ రాజ్యములు దమ దాని నెప్పటికిని జెఱచికొనరాదు. అట్టి యపాయముల నుపేక్షింపరాదు. ఈ విషయమున వారధికచతురులై వర్తింపవలెను.

సంఘరాజ్యముల విషయమై వ్యాసభగవానుఁ డొనర్చిన యీ వివేచన మమూల్యమైనది. నేటికిని మన మనుసరింపఁ దగిన విషయము లెన్నియో యీ ప్రకరణమున గలవు. గణరాజ్యములలోని పరస్పర విద్వేషములను

రూపుమాపుటకు ఆ నార్యుకు లాశ్రయింపవలసిన పద్ధతులేవి? ఈ వివేచనమునుగూడ వ్యాసభగవానుఁ డెంతయో సమర్థముగ నొనర్చెను. కృష్ణనారదులకు జరిగిన సంవాద మీ క్రింది విధముగ నున్నది.

వాసుదేవ ఉవాచ:

నా సుహృత్పరమం మంత్రం నారదార్హతి వేదితుం

..... ........ ..... ........

త్వా మాపాద్య యదు శ్రేష్ఠ! మేధం తే యాదవా స్సుఖః

(భా. శాం. అ. 81)

అంధకులు, వృష్ణులు మొదలైన గణములకు నాయకుఁడైన శ్రీకృష్ణుఁడు ఒక దినమున నారదునితో నిట్లనెను.

"మహర్షీ! అత్యంత గుప్తములైన విషయములు కొన్ని నీతో నాలోచింపవలసియున్నది. ముఖ్యములైన రాజకీయ విషయములను మిత్రుఁడు గాని వానితోఁ జేరి యాలోచింపరాదు. మిత్రుఁడైనను అపండితుఁడైన వానితో వివేచింపరాదు. నీవు నా కాప్తుఁడవు. సమర్థుఁడైన పండితుఁడవు. అందుచే నీ బుద్ధిబలమును జూచి సంతోషపడిన నేను నీతోఁ గొన్ని విషయము లాలోచింపఁదలఁచితిని. అంధకులకును, వృష్ణులకు, నాయకుఁడని లోకము నన్ను వాకొనుచున్నది. కాని యీ రెండు కులములకును, నేను సత్యముగాఁ గావించుచున్నది సేవయే! నేను చేయుచున్న సేవ గూడ ధనాపేక్షతోఁ గాదు. నాకు వీరిపై గల యీకొద్దిపాటి యధికారమైనను అప్పుడప్పుడు వారు నను గూర్చి, పలుకు దురుక్తులను నోర్చుకొనుట వలననే గలిగినది. అగ్ని యరణినుండియే బుట్టును. కాని యది యరణిని గూడ గాల్చును. నా చిత్తమునుగూడ వారిదురుక్తులిట్లే గాల్చుచుండును. నాకు సహాయ మొనర్చువా రెవ్వరును లేరు.

సంకర్షణుఁడు నా బంధువు. అతనికిబలవంతుఁడని ప్రసిద్ధి గలదు. తాతకు సంబంధించిన రాజ్యాధికారములన్నిటి నాతఁడే యనుభవించుచున్నాఁడు. గదుఁడు నాకంటెను సుకుమారుఁడు. ఇఁక ప్రద్యుమ్నుఁడనుకొందమా? అతఁడందగాండ్రలో నందగాఁడు, "నేను రూపవంతుఁడ" నని వానికి పెద్ద గర్వము. ఎట్లు జూచినను నాకు సహాయమొనర్చు వా రొక్కరూ లేరు. ఇఁక తక్కిన యంధకులు, వృష్ణులు మొదలైనవారున్నారు. వారు బలవంతులే, ఎవ్వరినైనను జయింప శక్తి గలవారే! సమర్థులే! కాని లాభమేమి? వారు తమలోఁదాము పోట్లాడుకొనుచుందురు. ఇతరులకు వారినుండి చిన్నమెత్తు లాభములేదు. వృష్ణ్యంధకు లెవ్వరిని ద్వేషింతురో వారు జీవించుటకే వీలులేదు! వీరు వారి కన్ని కష్టములను గల్గింతురు. ఆహుకుఁడు అక్రూరుఁడు వీరికెదురు. వారి కథగూడ నంతే! ఆహుకాక్రూరులు ఆవైపుఁ జేరినచో వృష్ణ్యంధకులకుఁ గోపము! వీరు జేరినచో వారి కాగ్రహము! వీరందరూ నాకు గావలసినవారే! వీరిలో నెవరోడినను నా మనస్సునకు సంకటమే! అందరును పరస్పర సహకారముతో పొందిపొసఁగి మనవలెనని నా యిచ్ఛ! నా యభిప్రాయములను వారు పెడచెవిని బెట్టెదరు. వీ రిరువురి నడుమ నాస్థితి చాల దయనీయమై యున్నది! ఒక తల్లి కిర్వురు కొడుకులున్నారను కొందము! వారిలో నెవ్వఁ డెవ్వనిని గొట్టినను మాతృదేవికిఁగల్గునది బాధయేగదా? నాస్థితి యిట్లున్నది. వారికేమి? వారు నిర్విచారులై తమలో ఁదాము పోట్లాడుకొనుచుందురు. నా దుఃఖము నెవ్వఁడూ గమనించుటయేలేదు! నారదా! యీ వ్యధ బాయుటెట్లు? నా బంధువులు సుఖముగ జీవించుటెట్లు? దీనికి మార్గమేమైనను జెప్పగలవా?"

నారదుఁ డిట్లు జవాబు జెప్పెను!

"కృష్ణా! సంఘ రాజ్యములలో సంకటములు రెండు విధములు! అభ్యంతర సంకటములు! బాహ్యసంకటములు. నీ విప్పుడు నన్ను బ్రశ్నించిన విషయము అభ్యంతర సంకటములకు జెందినది. దీనికిఁ గారణము కొంతవఱకు స్వకర్మమే! అక్రూరభోజ సంతతివారు వారి యనుయాయులు తమకెవరితోఁ జేరిన లాభము గల్గునో వారితోఁ జేరుదురు. వారికి జ్ఞాతి సహాయము సమృద్ధిగ నున్నది. అందుచే వారి యధికారము దృఢమూలము! ఇప్పుడు వారి నధికారమునుండి వదలించుట నీకుఁ దగినపని గాదు. వారిలో వారికే పరస్పర భేదములు గల్గును. ఆ భేదములకు గూడ నీవు కారణము గాకుండుట మంచిది. కక్కిన యన్నమును మరల నెట్లు సమకూర్చికొనరాదో అట్లే వారికిచ్చిన యధికారమును నీవు మరల గ్రహింపరాదు. ఇఁక వృష్ణ్యంధక గణముల కుగ్రసేనుఁ డధ్యక్షుఁడు. అతని నా పదవినుండి యూడబెరుకవలెనన్నచో గొప్ప ప్రయత్నము గావలెను. దాని పరిణామము భయంకరమై యుండును. అది యాదవుల స్వస్వరూప నాశనమునకే గారణము గావచ్చును. ఈ సంకట పరిస్థితిలో మిగిలిన దొక్కటే యుపాయము! నీ వొక విచిత్రమైన శస్త్రము నుపయోగింపవలెను. అది యత్యంత విచిత్రమైనది. బయటికి మృదువుగఁ గనపడునే కాని, యా యాయుధము పగవారి హృదయములనే జీల్చును. దానిని నీవు మాటి మాటి కుపయోగింపవలెను. క్రమక్రమముగ దానిని తీక్షణ మొనర్పవలెను. వారి నాల్కలను దెగఁగోయవలయును.

శ్రీకృష్ణుఁ డడిగెను. "ఆ యస్త్ర మేది?"

నారదుఁ డిట్లు సమాధాన మొసఁగెను. "ఇతరుల యోగ్యతను నీవు గమనింపవలెను. వారి గొప్పతనమును నీవు గమనించితివని వారి కర్థమగునట్లు నీవు వర్తింపవలెను. అట్టివారిని సమ్మానింపుము. సౌమ్యుఁడవై మెలఁగుము! కాపట్యమును వదలి సరళ స్వభావమున మెలఁగుము! గొప్ప సహనశ!

నలవరిచికొనుము. నీ శక్త్యనుసారము సర్వుల నాదరింపుము. గౌరవింపుము! నీవు వాడవలసిన శస్త్రమిదియే! కటువుగ మాటలాడకుము! సుమధురముగ భాషింపుము! శాంతుఁడవై మెలఁగుము! నీ వాక్కును నియమించికొమ్ము! మహాపురుషుఁడును, ఆత్మవంతుఁడును గానివాఁడు గొప్ప కార్యముల నొనర్పలేడు. వికారముల కధీనుఁడైన సామాన్యుఁడు పెద్ద పనుల నొనర్పఁ జాలునా? నక్క యెక్కడ? నాగలోక మెక్కడ? హెచ్చు తగ్గులు లేక సమానమైన నేలపై నెట్టి వృషభమైనను బరువులను మోసికొని పోఁగలదు. కాని గొప్ప బరువును విషమమార్గముల మోసికొని పోవుటకు సామాన్యమైన పశువు చాలదు. ఉత్కృష్టమైన జాతికిఁ జెందిన వృషభము గావలెను. పరస్పర విద్వేషములతో సంఘ రాజ్యములు జెడును. నీ వీ రాజ్యములకు ముఖ్యుఁడవు. నీ వంటి నాయకుఁడు లభించుట యదుకులముల యదృష్టము! నీ నేతృత్వమున యదురాజ్యములు జెడవని నా అభిప్రాయము! సంఘ రాజ్యనాయకునకుఁ గావలసిన గుణములన్నియు నీయందున్నవి. వాఁడు యుక్తిపరుఁడు గావలెను. సహనశీలుఁడు గావలెను. ఇంద్రియముల జయింపవలెను. ఇతరులను సమ్మానింపవలెను. ఉదారుఁడు గావలెను. ఈ గుణములన్నియు నీయందు గలవు! కనుక యదురాజ్యములు బాగుపడు పద్ధతుల నన్నిటిని నీవవలంబింపవలెను. నీకుఁ దెలియని విషయము లేమున్నవి? నీవు త్రికాలజ్ఞుఁడవు. నీకు దెలియని తంత్రములు లేవు. యాదవులు, భోజాలు, కుకురులు మొదలైన యందఱును నీపైఁ దమ యాశలను నిలిపికొని యున్నారు. వారు సుఖముగఁ బ్రదుకవలెనన్నచో నీవే కారణము! వీని నన్నిటిని నీవు మనసున నుంచికొని వర్తింపవలెను.

గణ రాజ్యముల గుఱించి భారతమునఁ దెలిపిన విషయము లన్నియును నేటికిఁ గూడ రాజకీయవాదు లనుసరింపఁదగినవి. భారతమున వర్ణింపఁబడిన యీ ధర్మములు క్రమక్రమముగ సన్నగిల్లినవి. భారతకాలమునకే యివి

యంతరింపఁ జొచ్చెను. కనుకనే భారతీయ సంస్కృతిని, జీవన మూల్యములను యుద్ధరించుటకై కృష్ణుఁడు ఖడ్గమును ధరించెను. అనేక రాజులను వధించి వారి శిరముల నుపాయనములుగ నొసఁగి భారత ధర్మమూల తత్త్వముల నుద్ధరింప సమకట్టెను. కృష్ణుఁడు కత్తినిఁ బట్టుటకు కారణము. నాటి రాజ్య సంస్థయొక్క యధఃపతనమే!

## సామ్రాజ్యసత్తయొక్క యధఃపతనము

రాజులందరు నొకచోటఁ జేరి తమలో సమర్థుడైన వానిని చక్రవర్తిగ నంగీకరించుచుండిరి. ఆ పదమున కాతనిని నభిషేకించుచుండిరి. శంతనుఁ డట్లే చక్రవర్తియైనాఁడు. ఈ విషయ మింతకు ముందే వచ్చినది. బలమే న్యాయము (Might is right) అనునది ప్రకృతిసిద్ధమైన యాదర్శమని గొందఱు తలఁతరు. కాని యిది యథార్థముగాదు. ఈ యాదర్శ మొక రనుసరింపఁదగినదియు గాదు. అసంస్కృతులైన జనులు యీ నీతినే యనుసరించుట సహజము! కాని, భారత సంస్కృతి యీ సూత్రమును నిర్వచించుటకై బుట్టలేదు. దాని యాదర్శ మింకను గొప్పది. "మానవుఁడు దనలోని పశుత్వమును నిర్ధరింపవలెను. పశుబలమున కన్నను న్యాయ బలము గొప్పది" యని యది వాక్రుచ్చెను. కనుక భారతీయ రాజ్యసంస్థ పాశవ బలముపై నాధారపడి యుండలేదు. ధర్మ సంరక్షణార్థమై యది జన్మించెను. ధర్మబలముతో నది బ్రదికెను. త్యాగమే దానికి వెన్నెముక! కృష్ణుని కాలమువఱకును యీ పద్ధతియే సాగినది. కాని కృష్ణ భగవానుని కాలమునకే యీ యాదర్శమునకు గొన్ని యపవాదములు రేగినవి. న్యాయ బలమును పాశవిక బలము ద్రోసి రాజనెను. చక్రవర్తిపదవి నందుటకు న్యాయబలముగాక పాశవిక బలమే ప్రధానయోగ్యతగఁ బరిణమించినది. బలవంతునిదే న్యాయమను సూచనలు గనపడ జొచ్చెను. బలవంతుఁడే చక్రవర్తి

యగునను నాచరణము తొంగిచూడ నారంభించినది. వాఁడొనర్చినదే న్యాయమను సిద్ధాంతము బయలుదేరెను. ప్రాచీన సామ్రాజ్యముల యొక్క విశుద్ధ స్వరూపములు చెడుటతో వాని నియంత్రణా పద్ధతులును సన్నగిల్లినవి. వాని స్థానమును నిరంకుశాధికారము లాక్రమించెను. ఇది మొదలు వెట్టినది మగధదేశమందు! ప్రాత సిద్ధాంతమును త్రోసి క్రొత్త సామ్రాజ్యవాద ముత్పన్నమైనది. ఈ విప్లవము నడిపించిన ప్రధాన నాయకుఁడు జరాసంధుఁడు. వీఁడు మహాసమర్థుఁడు! వీని సామర్థ్యము కృష్ణ భగవానునకును మెచ్చుకొనఁదగినదిగ నుండెను. వీని గాథ లాతని చెవుల కెక్కెను.

"జామదగ్న్యేన రామేణ క్షత్రం యదవశేషితం

..... ..... .... ....

ప్రభు ర్యస్తు పరో రాజా యస్మి న్నేకవశే జగత్:

(భా. స. అ. 14)

"పరశురాముఁడు క్షత్రియ కులముల నన్నిటిని నాశన మొనర్చెను. ఆతని ధాటికిఁ దప్పి యెవరో కొందరు మిగిలిరి. వారు తమలో పరాక్రమాది గుణములచేత సమర్థుడైనవాఁడు దమకు సమ్రాట్టుగా నుండఁదగునని నిర్ణయించికొన్నారు. ఈ నిర్ణయము ప్రకారము చంద్ర సూర్యవంశ సంజనితులైన రాజులు సమ్రాట్టులు! తక్కిన క్షత్రియులు వారి పరివారము ఈ యాచార మింతవఱకును నడిచినది. సూర్య చంద్ర రాజవంశములలో నూటొక్క కులమువారు మిగిలి యున్నారు. ఈ రాజ కులములు నాలుగు దిక్కుల యందును వ్యాపించి యున్నవి. ఇంతవరకును తక్కిన క్షత్రియులందరును వీరి యధికారమును మన్నించిరి. వారికి సామంతులై మెలఁగిరి. నేఁడీ జరాసంధుఁడు లేచినాఁడు. వీఁడు సూర్య చంద్ర రాజుల నందఱ జయించి, జగదేక పరాక్రముఁడై, సమ్రాట్పట్టమున కభిషేక మొనర్చికొన్నాఁడు. భారతమునంతయు నేకచ్ఛత్రముగఁ బరిపాలింపఁ

దొడఁగెను." సత్యముగఁ జూచినచో జరాసంధుఁడు తక్కిన క్షత్రియుల నందఱ జయించుటలో దోషము లేదు. అది క్షాత్రధర్మమే! సగరుఁడు, మాంధాత, భరతుఁడు మొదలైన తొల్లింటి రాజులందరు నీ పనియే యొనర్చిరి. కాని వారికిని జరాసంధుని సామ్రాజ్య వాదమునకును గొంత భేదమున్నది.

జరాసంధుఁడు క్షత్రియ కులముల నన్నిటిని నాశమొనర్పఁ జొచ్చెను. ధార్మికులైన రాజులను గూడ బెదిరించి తన దాసులనుగ నొనర్చికొన్నాఁడు. వాని పరాక్రమమున కడ్డమే లేదు. మహా భారతమున వర్ణింపఁబడిన జరాసంధుని వృత్తాంతము మన కాశ్చర్యము గొలుపునట్టిది. భారతము సభాపర్వము నందలి **17, 18, 19** వ యధ్యాయములలో వీని వృత్తాంతము తెల్పఁబడి యున్నది.

## జరాసంధుని పూర్వ వృత్తాంతము

బృహద్రథుఁడు మగధదేశపు రాజు. మగధ మనగా నేటి బీహారురాష్ట్రమే! బృహద్రథుఁడు సద్గుణ సంపన్నుఁడు. సమర్థుఁడు. ధార్మికుఁడు. ఇతఁడు కాశీరాజు బిడ్డల నిర్వురిని బెండ్లాడెను. కాని, యిరువురి యందును, బృహద్రథునకు కుమారుఁడు బుట్టలేదు. ఈ చింతతో రాజు చిక్కి సగమైనాఁడు. ఒకానొకనాఁ మగధరాజు కడకు, చండకౌశికుఁడను ఋషి యరుఁగుదెంచెను. రాజు రాణు గూడి యధికభక్తితో నాతని సేవించెను. చండకౌశికుఁ డా సేవతోఁ బ్రసన్నుఁడైనా పుత్రప్రాప్తి యగుటకై మంత్ర పూతమైన నొక్క ఫలమును మగధరాజునకు చండకౌశికుఁ డనుగ్రహించినాఁడు. రాజా ఫలమును రెండుగ భాగించి యిర్వుర రాణులకును నొసఁగెను. కొన్ని రోజులకు రాణులు బ్రసవించిరి. ఒక్కొక్కరాణి యొక్కొక్క యర్ధ శరీరమును బ్రసవించినది. ఈ వింత ప్రసవమునకు రాణు లిరువురును సిగ్గుపడిరి. వా రా శకలములను దాసీలతో నూరిబయటఁ బారవేయించిరి. ఆ యూరిలో జరయను రాక్షసి రాత్రియందు దిరుగుచుండెడిది.

ఆ రక్కసి యీ మనుష్య శకలములను గాంచి యీ రెంటిని సంధించినది. అందుచే నాతఁ జరాసంధుఁ డైనాడు. జరయను రాక్షసిచేత సంధింపఁబడిన వాఁడని యర్థము! ఆ రక్కసి శిశువును బృహద్రథున కిచ్చినది.

కొన్ని దినములు జెల్లినవి. మఱియొకసారి చండకౌశికుఁడు మగధకు వచ్చెను. జరాసంధుని జూచి యా ఋషి యనేకవిధములుగ నాశీర్వదించినాఁడు. జరాసంధునకు వయసువచ్చినది. తండ్రి కుమారుని రాజ్యమునం దభిషేకించి తప మొనర్చి కొనుటకై యడవుల కేఁగెను. జరాసంధుఁడు మగధ సింహాసన మెక్కినాఁడు. హంస డిభకు లిరువురు జరాసంధుని సేనాపతులు! వీరిర్వురి నా కాలమున జయింపగల మగవాఁడే లేడు. స్వయముగఁ బరాక్రమశాలి యైన జరాసంధునకు వీరి తోడు అగ్నికి గాలివంటి దైనది.

## జరాసంధుని యాక్రమణ స్వభావము

జరాసంధుని యాక్రమణము సామాన్యమైనది గాదు. వాని పరాక్రమ మెవ్వరైనను గౌరవింపఁ దగినదే! పుట్టుకతోనే వానిలో నొక దైవతత్వమున్నది. దానిని గమనించినను గమనింపకున్నను వాని పరాక్రమమును మాత్ర ముపేక్షించుటకు సాధ్యముగాదు. బ్రాహ్మణులను జరాసంధుఁ డెంతయో గౌరవించుచుండెను. తన రాజ్యము నందలి ప్రజలకు వాఁడే కొఱఁతయు గలుగనివ్వలేదు. క్షత్ర కులముల నన్నిటిని వాఁడు జయించెను. ఇదియును తప్పుగాదు. కాని వాఁడు వారి నంతటితో వదలలేదు. ఆర్య రాజులు గూడ శత్రువులను జయించుచుండిరి. ఆ జయించుట వారి విక్రమ ప్రదర్శనము కొఱకే! విజితులైన వారి రాజ్యములను లాగికొనుట లేదు. మరల వానిని వెనుక కిచ్చివేయుచుండిరి. ఆ రాష్ట్ర వ్యవస్థలో విజేతలు చేయి గలిగించి

"తపశ్చర్యతో నేను నా పాపములను బోఁగొట్టుకొనఁ దలఁచితిని. నే నుపవాసము లొనర్చుచున్నాను. చవితి, అష్టమి మొదలగు దినములందు కేవల మత్యంత మితాహారమును గైకొనుచున్నాను. ఈవిషయములను గాంధారి మాత్రమే యెఱుఁగును. పరిజనులంద రకును నేను దినమూ భుజించుచున్నాననియే తలఁపు. వారి యెడల నే నట్లే వర్తింతును. నా రహస్యమును బయట పెట్టుటలేదు. ఈవిషయము దెలిసినచో నీవు దుఃఖింతువని నా భావము. చాల దినములనుండి భూ శయనమునే యొనర్చుచున్నాను. దర్భలపైన జింక చర్మమును బరచికొని పండుకొందును. సర్వదా జపపరుఁడనై కాలము నీడ్చుచున్నాను."

పెద్ద తండ్రి వనములకు బోవుటకు యుధిష్ఠిరుఁ డంగీకరింప లేదు. అనుమతి లభింపక పోవుటతో ధృతరాష్ట్రుని కింకను దుఃఖమైనది. అప్పటి యాతని స్థితి వేదవ్యాసునిచే నిట్లు వర్ణితము.

"వయసా చ ప్రకృష్టేన వాగ్వ్యాయామేన చైవహ
గాంధారీం శిశ్రియే ధీమాన్ సహసైవ గతాసువత్.
(భా. ఆశ్ర. ప. అ. 3)

"ధృతరాష్ట్రుఁ డతి వృద్ధుఁడు. ఎక్కువగా మాటలాడుటచే వాతని కాయాసమైనది. నిశ్చేష్టుఁడైన వానివలె నాతఁడు వెంటనే గాంధారిపైఁ దూలివాఁడు."

కడకు యుధిష్ఠిరుని సమ్మతి లభించినది. ఆంబికేయు డరణ్యములకు బోవుటకు ముందు బంధువులకును, పుత్రులకును శ్రాద్ధము లొనర్పవలసి వచ్చినది. అందులకై ధనము నిమ్మని యాతఁడు ధర్మరాజు నడిగెను. యుధిష్ఠిరార్జునులు సంతోషించి కోశము నాతని స్వాధీన మొనర్చిరి. భీమున కీ యేర్పాటు సమ్మతము గాలేదు. అతఁడు సభలో నిట్లన్నాడు.

"తేన రుద్ధా హి రాజానః సర్వే జిత్వా గిరి వ్రజే
..... ..... .... ....
ప్రతిజ్ఞాయాశ్చ ప్రారంప గతః పార్థివసత్తమ!"
"తస్మా దిహ బలాదేవ సామ్రాజ్యం కురుతే హి సః
..... ..... .... ....
జమేన్యశ్చ జరాసంధం సస్రమా ణ్ణియతం భవేత్."

పై శ్లోకముల యర్థమిది.

"జరాసంధుఁడు మూర్ధాభిషిక్తులైన సర్వరాజులను జయించి, వారిని గిరివ్రజ పురమున బంధించినాఁడు. ఆ రాజులను బలి పశువులుగ నొనర్చి శివునకుఁ బ్రీతికరముగ యజ్ఞము వేల్వవలెనని యాతని యాశ! యుద్ధము సేయుటకై యెవఁడు వచ్చినను వానిని జయించి జరాసంధుఁడు బంధించుచున్నాఁడు. బలవంతుఁడే సామ్రాజ్యాధిపతి గావలెనని జరాసంధుని నూతనాదర్శము! పేరెన్నిక గన్న రాజులందఱును రత్న రాసులను వాని పాదకముల కడఁ గ్రుమ్మరించిరి. ఆతని యాధిపత్యమును స్వీకరించిరి. అంతతో వాడు దృప్తిపడలేదు. తన బాహు బలముతో ధర్మమును గూడ వాఁడు దళిత మొనర్చుటకుఁ బూనికొన్నాఁడు. మూర్ధాభిషిక్తులైన రాజులలో వానికి భయపడని వాఁడు, లొంగిపోవనివాఁడు లేడు! బలిపశువులుగ నొనర్చి, వారి శిరస్సులను ఖండించియే తీరవలెనని జరాసంధుఁడు నిశ్చయించి కొన్నాఁడు. సూర్యచంద్రరాజులలో నిఁక పదునల్వురను మాత్రమే వాఁడు జయింపవలసి యున్నది. వారిని జయించిన వెంటనే జరాసంధుఁడు నరమేధము నారంభించును. ఈ నరమేధమునకు విఘ్నము నాపాదింపఁ గలిగిన శూరుఁడు గొప్పకీర్తి నార్జించికొన గలఁడు. వానిని జయింపఁ గలవాడు సామ్రాజ్యాధిపతి గాక తప్పదు."

జరాసంధుని యీ పరాక్రమము యొక్క వేడిమి పాండవులను గూడ భయపెట్టినది. యుధిష్ఠిరుఁ డిట్లనుచున్నాఁడు!

"వయంచైవ మహాభాగ! జరాసంధభయా త్తదా

..... ..... .... ....

శంకితాస్స్వమహాభాగ! దౌరాత్మ్యా త్తస్యచానఘ!"

(భా. సభా. ప. అ. 15)

జరాసంధుని పరాక్రమమునకును, దుర్మార్గమునకును మేముగూడ భయపడితిమి!" జరాసంధుఁడు జయింపక విడిచిన పదునల్వురు రాజులలో హస్తినాపురమునకుఁ జెందిన కురు వంశజులును జేరియుండిరి. జరాసంధుని పాలికి భీష్ముని ప్రతాపము కొంత బరువైనది. అందుకే వాఁడు వారి జోలికిఁ బోలేదు. ఈవిషయము నుద్యోగ పర్వమున ధృతరాష్ట్రుఁడు స్పష్టముగఁ జెప్పెను. ఆ శ్లోకము లీ క్రిందివి.

"కృత్స్నేయం పృథివీ దేవీ జరాసంధేన ధీమాతా

..... ..... .... ....

య న్న తస్య వశే జగ్ముః కేవలం దైవమేవ తత్!

(భా. ఉ. పః అ 51)

ధృతరాష్ట్రుఁ డన్నమాటలలోని యర్థమిది :

"జరాసంధుఁడు సమస్త పృథివిని జయించెను. అతనికి వశంవదులు గాని రాజులు నేఁడు లేరు. వాని విక్రమముచే జగమంతయు గుతగుత నుడికిపోవుచున్నది. భీష్మునకు భయపడి వాఁడు కురురాజులపైకి రాలేదు. అంధకులు, వృష్ణులు వానితో సామవాక్యము లాడి బ్రదుకు చున్నారు. ఇంతకుమ యీ రెండు కులములపై వాని జూపు బారకపోవుట వీరి యదృష్టమే." జరాసంధుని

యాక్రమణము అంతకు పూర్వమున్న పద్ధతి కంటెను భిన్నమైనదని జెప్పితిమి. ఈ విధానముతో రాచ కులములందు 'హాహా' కారములు నెలకొన్నవి. పరువెత్త గలిగినవారు బరువెత్తిరి. తక్కినవారు జరాసంధున కంకితులైరి. తమ రాజ్యములను వానికొప్పించి వాని దాస్యమును స్వీకరించిరి. జరాసంధుని శాసనము ధర్మవిరుద్ధ మైనది. ధర్మ సంరక్షణార్థమై వాని సామ్రాజ్యమును నాశన మొనర్పవలసిన యక్కఱ యానాఁ డెంత యేని యుండినది. జరాసంధుని యండ జూచికొని వాని సాయముతో మరికొందఱు దుష్టులు విజృంభించిరి. వారందరకును జరాసంధుఁడే నాయకుఁడు! గొప్పగొప్ప రాజులందరును వానికి లోఁబడుట మాత్రేమే గాదు. వాని యజ్ఞమునఁ బశువులౌటకును గూడ సమ్మతించిరి. ఇంతకంటెను వారికి వేఱుమార్గము లేదు. జరాసంధున కెవ్వరెవ్వరు లోఁబడిరో భారతము వివరముగ బల్కినది. ఆ ఘట్ట మిది.

"రాజన్ సేనాపతి ర్జాత: శిశుపాల: ప్రతాపవాన్

..... ..... .... ....

తదైవ సర్వపాంచాలా జరాసంధభయార్దితా:

(భా. సభా. ప. అ. 14)

"చేదిరాజైన శిశుపాలుఁడు మహాపరాక్రమవంతుఁడు. వాఁడు జరాసంధునకు శిష్యప్రాయుఁ డైనాఁడు. అతఁ డతని సేనాధిపతి యయ్యెను. వక్రుఁడు కరూషాధిపతి. మాయాయుద్ధమున గొప్ప వాఁడు. బలవంతుఁడు. వాఁడుగూడ జరాసంధు నాశ్రయించెను. కరభుఁడైన మేఘవాహనుఁ డంకితుఁడై పోయెను. వాని శిరస్సున వెలుగు మణి మహాప్రసిద్ధమైనది. యవనాధిపుఁడు లోఁబడిపోయెను. వాఁడు ప్రతీచీదిక్కునకు వరుణునివంటివాఁడు. భగదత్తుఁడు జరాసంధుని యాధిపత్యమును స్వీకరించినాఁడు. శూరుఁడైన పురుజిత్తు లోఁబడినాఁడు. పౌండ్ర వాసుదేవుఁడు జరాసంధునితోఁ జేరినాఁడు. పాండ్యులు, క్రథకైశికులు మున్నగువారిని వాఁడు

గెల్చెను. భీష్మక రాజుగూడ జరాసంధున కంకితుఁడైనాఁడు. ఉదీచ్యులైన భోజులు, అష్టాదశ కులముల రాజులు జరాసంధునకు భయపడి ప్రతీచి నాశ్రయించిరి. పాంచాలురు, యాదవులు మొదలైన గణరాజ్యములు, సంఘరాజ్యములు మంటిపాలై ప్రమాదమందుండెను. ధార్మికులైన రాజులందరు నశించిరి. అధర్మము పెచ్చుపెరిగెను. జరాసంధుఁ డందరి స్వాతంత్ర్యమును గూడ నాశమొనర్చెను. వాఁడు దుర్మార్గవర్తి. నరమేధముల వంటి భయంకర కృత్యములకు జంకనివాఁడు. జరాసంధుఁడు సామ్రాజ్యతత్వము యొక్క స్వరూపము. ప్రజాతంత్రములైన సంఘరాజ్యములు వాని కాలిక్రిందఁ బడి నలిగిపోయెను. యాదవుల సంఘరాజ్యములలోఁ గంసుడుండెను. వాఁడు యువకుఁడు. అనుభవము లేనివాఁడు. వాఁడు జరాసంధుని చేతిలోఁ గీలుబొమ్మయైనాఁడు. పెద్దల మాటలను గంసుఁడు పెడచెవిని బెట్టెను. వాఁడు వానితోఁ జేరెను. ఈ విషయము భారతమున నిట్లున్నది.

"బలేన తేన స్వజ్ఞాతీన్ అభిభూయ వృథామతిః
శ్రైష్ఠ్యం ప్రాప్త స్స తస్యాసీత్ అతీవాపనయో మహాన్."
(భా. స. ప. అ. 14)

"కంసుఁడు జరాసంధుని సాయముతో జ్ఞాతులను బరాభవించెను. గణరాజ్యముల యధికారమును బలవంతముగ నాక్రమించెను. ఇది ప్రబలమైన యన్యాయము. భారతీయులు ప్రజాతంత్రమైన గణరాజ్య పద్ధతిని తమ యాత్మవలెఁ బ్రేమించిరి. దాని యభివృద్ధికై దమ రక్తమును బంచిరి. దాని నపహరించుచు సామ్రాజ్యవాదము నెలకొనెను. భారతీయ సిద్ధాంతము ననుసరించి సామ్రాజ్యవాదము మహోత్తరమైన యాపత్తు. ఈ యాపదను జరాసంధుఁడు దెచ్చిపెట్టెను. సామ్రాజ్యవాదము నెలకొన్న కాలఁదియు రాజ్యసంస్థలు తారుమారైనవి. వారి ధర్మములు తలక్రిందులయ్యెను. నామమాత్రావశిష్టములైన గణరాజ్యముల

యందలి రాజులు దమ బాధ్యతలను గ్రహింపక యన్యాయములొనర్ప సాహసించిరి. వివాహితలైన స్త్రీల నెత్తికొనిపోవునంత వరకును వారి పశుత్వము చెలరేగినది." శిశుపాలుని దోషములను వర్ణించుచు శ్రీకృష్ణుఁడు వివాహితలైన స్త్రీలనుగూడ వాఁడెత్తికొని పోయెనని జెప్పెను. ఈ ఘట్టమిది.

"సౌవీరాన్ ప్రతియాతాం చ బభ్రో రేష తపస్వినః
భార్యా మభ్యహర న్మోహా దకామాం కామితో గతాం
ఏష మాయా ప్రతిచ్ఛన్నః కా రుషార్థే తపస్వినీం
జహార భద్రాం వైశాలీం మాతులస్వ నృశంసకృత్.

(భా. స. ప. 45 అ.)

"ఈ శిశుపాలుఁడు మహాదుష్టుఁడు. బభ్రుఁడను తపస్విగలడు గదా? అతని భార్య యొకసారి సౌవీరదేశములకు వచ్చినది. శిశుపాలుఁ డామెను బలవంతముగ నపహరించెను. మాయా ప్రతిచ్ఛన్నుఁడై తపస్వినియైన భద్రను నపహరించెను. ఆమె వైశాలి దేశమునకు జెందినది. వీని మాతులుని భార్యగూడ.

రామచంద్రుని కాలమున గూడ గణరాజ్యములుండినవి. కులస్త్రీ నవమానించినవానికి మరణదండనము విధించుట యానాటి నీతి. అట్టి గణరాజ్యముల ధర్మనిష్ఠ భారతకాలమునాటి కెంతగా నధఃపతితమై పోయెనో శిశుపాలుని వృత్తాంతము దెల్పును. శిశుపాలుఁడిట్టివాఁ డనగా యానాటి గణరాజ్యముల స్థితి యట్లుండెనని యర్థము. పతితమైపోయిన రాజ్యసత్త యొక్క స్థితికి బ్రతీకముగ వేదవ్యాసుఁడు దన ప్రతిభాదృష్టితో నొక వ్యక్తిని నిర్మించెను. వాని పేరు మీకు దెలిపినచో మీ రెంతయో యాశ్చర్యపడుదురని దలఁతును. ఆ వ్యక్తియే రాజైన ధృతరాష్ట్రుఁడు!!

# రాజు - ధృతరాష్ట్రుఁడు

ధృతరాష్ట్రుఁడు పుట్టంధుఁడు. కాని కన్నులు సరిగానున్న యనేక మేధాశాలురను మించిపోగల ప్రతిభావంతుఁడు. అతని మాట యెంతయో చల్లనిది. కాని హృదయము సానలుదీరిన కత్తికంటెను పదునుగలది. ధృతరాష్ట్రుఁడు నోటితోఁ బల్కునదంతయు ధర్మమే! నీతియే! తత్వజ్ఞానమే! కాని నోటితోఁ బల్కుదానికిని యాతని చేతకును సంబంధము మాత్రము లేదు. తామరపాకుపై నున్న నీటి బిందువునకువలె! భారతీయ యితిహాసమునందు ధృతరాష్ట్రుని వంటి విచిత్రవ్యక్తి మరియొక్కడు లేడు. ఈతని హృదయతత్వము అత్యంత నిగూఢమైనది. సంస్కృత కావ్యములలో యనేకులు బ్రతినాయకులు వర్ణింపఁబడినారు. కాని ధృతరాష్ట్రుని వంటి ప్రతినాయకుఁడు వేఱొక్కడు గన్పింపఁడు.

ఇతఁడు విచిత్రవీర్యునకు జ్యేష్ఠపుత్త్రుఁడు అగుటచే రాజ్యమునకు వారసుఁడు. హీనాంగుఁడైన వ్యక్తి సింహాసనముపై నధివసింపరాదు. అది యా కాలమున నుండిన నీతి. దాని ననుసరించి ధృతరాష్ట్రునకు గురురాజ్యసింహాసనము దక్కదు. శంతనున కిట్లే హీనాంగుఁడగు నొక జ్యేష్ఠపుత్త్రుఁడుండెను. అతని పేరు దేవాపి. వికలాంగుఁడగుటచే నతఁడు రాజ్యమును బరిత్యజించి వెళ్ళెను. ధృతరాష్ట్రునకును తండ్రియనంతరము కురుసింహాసనము దక్కు పరిస్థితులు లేవు ఈ విషయమును మహాభారతము యొత్తిజెప్పినది. ఆ భాగ మీ క్రిందిది;

"ధృతరాష్ట్ర స్త్వచక్షుష్ట్వాత్ రాజ్యం న ప్రత్యపద్యత
పారసవత్వా ద్విదురో రాజా పాండు ర్బభూవహ!"

(భా. ఆ. ప. అ. 109)

"ధృతరాష్ట్రుఁడంధుఁడు. అందుచే నాతనికి రాజ్యము దక్కలేదు. విదురుడు దాసీపుత్రుఁడు. కనుక నాతనికి రాజ్యాధికారము లేదు. కడకు

పాండుమహారాజు రాజైనాఁడు. భారత ముద్యోగపర్వమునఁ గూడ మరియొకసారి యీ ప్రస్తావన వచ్చును. అప్పుడా విషయమును బ్రసక్తి కిఁదెచ్చినవాఁడు భీష్ముడు. అతఁడిట్లన్నాఁడు.

"అంధః కరుణహీనత్వా న్న వై రాజా! పితా తవ
రాజా తు పాండురభవన్మహాత్మా లోకవిశ్రుతః"
(భా.ఉ.ప.అ. 147)

"దుర్యోధనా! మీ తండ్రి పుట్టంధుఁడు. అందుచే నాతనికి రాజ్యాధికారము లేదు. కనుక లోకవిశ్రుతుఁడైన పాండురాజు సింహాసనము నెక్కినాఁడు."

పాండుమహారాజు పరిపాలనము సర్వులకును సుఖకరముగ నుండెను. అతఁడెన్ని యో దిగ్విజయములొనర్చినాఁడు. కౌరవసింహాసనమునకు గొప్పప్రతిష్ఠ యాతనివలన లభించినది. తాను సింహాసనాధీశ్వరుఁడైనను, పాండురాజు ధృతరాష్ట్రునెంతయో గౌరవించెను. అతని యాజ్ఞలను వినయమున బరిపాలించెను. ధృతరాష్ట్రుఁడు తమ్ముని యాదరముతో ననేక యజ్ఞయాగములను గావించెను. సుఖములననుభవించెను. ఈ విషయము భారతమున నున్నదే.

"తస్య వీరస్య విక్రాంతైః సహస్రశతదక్షిణైః
అశ్వమేధశతై రీజే ధృతరాష్ట్రమహామఖైః!"
(భా.ఆ.ప.అ.114)

పాండురాజు పరాక్రమముచేత సంపాదించిన ధనముతో ధృతరాష్ట్రుఁడనేక యజ్ఞములను గావించెను. సహస్రశతదక్షిణలొనర్చెను. నూరశ్వమేధయాగములొనర్చెను. ధార్మికుఁడుగా బాండురాజు ధృతరాష్ట్రుని కన్న నెంతయో గొప్పవాడు. ఈ విషయమును ధృతరాష్ట్రుఁడే యంగీకరించినాఁడు. అతఁడు పాండురాజు విషయమును దుర్యోధనునితో నిట్లు వర్ణించి చెప్పెను.

"ధర్మనిత్య స్సదా పాండు స్తథా ధర్మపరాయణః

... ...... ......

నివేదయతి నిత్యం హి మమ రాజ్యం ధృతవ్రతః"

(భా.ఆ.ప.అ. 142)

"దుర్యోధనా! పాండురాజత్యంత ధర్మపరాయణుఁడు. వాఁడు కర్తవ్యమును దప్పి యెన్నడును వర్తించినది లేదు. బంధువు లందరిపై వానికెక్కువప్రేమ! అందును నేనన్నచో వాఁడు నా యెడ గౌరవమును గనుపరచెను. నా భోజనాదివిషయముల యందుగూడ నాసక్తిని జూపెడివాఁడు. నాకు దెలుపక యొక్క పనియు జేయడు."

పాండవులు గూడ ధృతరాష్ట్రున కిట్టి మర్యాదనే గనుపఱచిరి. ధృతరాష్ట్రునిపై సామాన్య జనుల కొక యభిప్రాయమున్నది. అది యిది: "ధృతరాష్ట్రుఁడు ధర్మనిష్ఠుఁడు. సత్ప్రవృత్తి గలవాఁడు. అమాయకుఁడు. పాండవుల రాజ్యము గైకొను టాతని కిష్టములేదు. ఇంతమాత్రమేగాదు. దుర్యోధనుని దుర్మార్గముల నడ్డగించుటకు గూడ నాతఁ డప్పుడప్పుడు ప్రయత్నించెను. కాని దురాగ్రహపరుఁడైన సుయోధనుఁ డాతని మాటలను లెక్కింపలేదు. దుష్టుఁడై కురువంశ మునకుఁ జేటుదెచ్చెను. సుయోధనుఁడు దుర్మార్గుఁడు. కాని ధృతరాష్ట్రుఁ డట్టివాఁడు గాఁడు. భారత యుద్ధమును వలచి తెచ్చికొనుట లోని బాధ్యత యంతయు సుయోధనునిదే! ధృతరాష్ట్రునిది దయనీయమైనపరిస్థితి పాపము! కౌరవులందరును గతించిరి. ధృతరాష్ట్రుఁడు పాండవులపాలఁ బడినాఁడు. భీమునకు ధృతరాష్ట్రుని జూచిన మంట! అతఁడు మాటిమాటికి యెత్తిపొడుచును. భీముని కఠోర వాక్యములచే గ్రుడ్డిరాజున కెంతయో నొప్పి గలిగినది. అతఁ డాహారవిహారములను గూడ వర్జించి నిరంతరము దుఃఖించుచుండెను. నూర్వురు కొడుకులును గతించిరి. అతఁడు నిరాశ్రితుఁడు. వృద్ధుఁడు. పరావలంబుఁడు. ఈ స్థితిఁ దలఁచినప్పుడు

మనకు ధృతరాష్ట్రునిపై నెంతయో యనుకంప గల్గును. అంతేగాదు భీమునిపై గోపముగూడ వచ్చును. ఆశ్రమవాస పర్వమున ధృతరాష్ట్రుని దయనీయమైన యాస్థితి యిట్లు వర్ణింపఁ బడినది.

**"అతో భీమ స్సుహృన్మధ్యే బాహుశబ్దం తథాzకరోత్**

**..... ..... ..... ....**

**భూమౌ శయే జప్య పరోధర్భేష్వజిన సంవృతః"**

**(భా. ఆశ్రమవాస ప. అ. 118)**

"ధృతరాష్ట్రుఁడు సమీపముననే యుండెను. భీముఁడు బాహాస్ఫాలన మొనర్చినాఁడు. ఆ యొనర్చుట గాంధారీ ధృతరాష్ట్రులకు వినపడవలెననియే! తరువాత దీర్ఘముగ తన బాహువునుజూచి కర్ణ దుశ్శాసనులను దుర్యోధనుని దలఁచికొని భీముఁ డిట్లు వచించెను. "పరిఘాకారమైన యీ నా బాహువుతో నా శస్త్రాస్త్రములను ధరించి గ్రుడ్డిరాజుయొక్క కుమారుల నందరిని వధించితిని. ఆయుధ పాణులైన వారందరును నాకు జిక్కి కఠోరముగ సంహరింపఁబడిరి. ఆహా! గ్రుడ్డిరాజుయొక్క నూర్వురు పుత్రులను జంపిన యి నా చేతు లెంత బాగుగా నున్నవి. దుర్యోధనుని తొడలను విరుగఁగొట్టిన నా యీ బాహువుల నిండ నేఁడు చందనమును బూసికొనుచున్నాను. చందనముచే నెక్కువగఁ బ్రకాశించుచున్న యీ నా బాహువులే ధార్తరాష్ట్రులను జంపినవి." హృదయమును దహించు నట్టి భీమసేనుని యీ వాక్యములకు ధృతరాష్ట్రున కెంతయో దుఃఖము గల్గినది."

ఈ దుఃఖమును చీకురాజు కొన్ని దినములు సహించెను. వనములకు వెళ్ళి తపశ్చర్యతో జీవనమును సార్థక మొనరించికొన వలెనని యాతఁడు దలఁచెను. అతఁడు యుధిష్ఠిరునితో నిట్లనెను.

కొనుట లేదు. కనుక వారి దృష్టిలో నితరులను జయించుట యనగా తమ పరాక్రమమును బ్రదర్శించుట యని మాత్రమే యర్థము. అంతే గాని వారి స్వాతంత్ర్యమును భంగపఱచుండలేదు. దశరథ రాముఁడు కిష్కింధలో వానర సేనలను గెలిచెను. కాని వారి రాజ్యముయొక్క స్వాతంత్ర్యమును భంగపఱచు చుండలేదు. రాక్షసుల నాతఁడు విధ్వంస మొనర్చెను. రాక్షస రాజ్యములను విధ్వంసము చేయలేదు. ధర్మముగ జనులను బాలింపవలెనని మాత్రమే వారికి హితోపదేశ మొనర్చెను. రాముఁ డొక్కఁడే గాదు. ప్రాచీనులైన యార్యరాజు లంద రనుసరించిన పద్ధతి యిదియే! ఈ దృష్టితో జూచినచో జరాసంధుని యాక్రమణము అంతకన్నను భిన్నమైనది. జయింపఁ బడిన రాజ్యములను వాఁడు శాశ్వతముగఁ దన సామ్రాజ్యమునఁ గలిపికొను చుండెను. ఆ రాజులను బంధితుల గావించెడువాఁడు. ఇంత మాత్రముతో వాఁడు తృప్తిపడలేదు. శివునకు బ్రీతికరముగ వాఁ డొక యజ్ఞమును జేయఁదలచెను. ఆ యజ్ఞమునకు బలిపశువులు దనచే విజితులైన క్షత్రియులు! వారి తలల నన్నిటిని నా యజ్ఞమున జరాసంధుఁడు గోయఁ దలఁచినాడు! ఈ పనితో సూర్యచంద్రవంశములలో నెనుబదియాఱు మందిని వాఁడు స్వవిక్రమముతో జయించి గిరివ్రజ పురమున బంధించినాఁడు! గిరివ్రజ పురము వాని రాజధాని! ఇఁక జయింప వలసిన వారు పదునలుగురు మాత్రమే! వారి నందరిని గూడ వాఁడు జయింప నెంచెను. ఆ పని పూర్తియైనంతనే నరమేధ యజ్ఞమును జరాసంధుఁ డారంభింపఁదలఁచినాడు. ఆ యజ్ఞమునకు 'శతరాజబలి' యని యొక వింతపేరు! జరాసంధుఁ డింతపని చేయుచున్నను వాని నెవ్వఁడు గాని "యిది యేమ"ని యడిగినది లేదు! అందుకు గుండెలేవీ? జరాసంధుని యాక్రమణ స్వభావమును కృష్ణుడిట్లు వివరించినాడు. ఈ ఘట్టము సభాపర్వము లోనిది.

"భీమసేనస్తు స క్రోధః ప్రోవాచేదం వచ స్తదా
..... ............ ........ ..... .....
దుర్బుద్ధి ర్విదురం ప్రాహ ద్యూతే కిం జిత మిత్యుత!
(భా. ఆశ్ర. ప. అ. 11)

"అర్జునా! మీ యేర్పాటు నాకు సమ్మతముగాదు. భీష్మన కుత్తర క్రియలు మనము వేఱుగాఁ జేయుదము. కాని కౌరవుల శ్రాద్ధకర్మల కగు ఖర్చు నొసఁగుటకు నేను సమ్మతింపను. వారు మనకు శత్రువులు. మనల నిందించిరి. పరిహసించిరి. అవహేళన మొనర్చిరి. అట్టివారికి సద్గతు లెందుకు గలుగవలెను? వారి సద్గతికై మన మెందుకు ద్రవ్యమును ఖర్చుబెట్టవలె? ఘోరాతిఘోరమైన నరకములు వారికిఁ బ్రాప్తించుగాక! ఆ పాపులు గులమునకు కళంక మాపాదించిరి. భూమండలమంతయు నాశన మొనర్చిరి. వారు నరాధములు. పండ్రెండు వర్షములు మన మరణ్యములలోఁ బడిన కష్టములు మఱచితివా? అజ్ఞాతవాసమును విస్మరించితివా? అపుడు ద్రౌపది యనుభవించిన కష్టములు నీ మనసున మెదలుట లేదా? ఆమె కరుణ విలాపములను నీవు మఱచినట్లున్నది. ఆ కష్టములలో ధృతరాష్ట్రునకు మనపైనున్న ప్రేమ యెక్కడకు బోయెను? సర్వ భూషణములను వదలి కృష్ణాజినములను ధరించి యుపవీత మాత్రధారులమై బిచ్చగాండ్రవలె మనము పాంచాలరాజ కన్యకతోఁగూడ ధృతరాష్ట్రుని కడకు వచ్చితిమి గదా! అపు డతఁడు మనపై చిన్నమెత్తు దయఁ జూపెనా? పండ్రెండేండ్లు మన మడవులలో నష్ట కష్టములు బడినప్పుడు భీష్మద్రోణులు, సోమదత్తుడు, మన కేమైన సాయపడిరా? మన తండ్రి పాండురాజు తన యెడల నెంతయో వినీతుఁడై బ్రవర్తించెనుగదా? ఆ విషయమును మనస్సున నుంచికొనియైనను పెద్ద తండ్రి మిమ్ము బ్రేమింపలేదే? అర్జునా! సభలో జూదము జరుగుచున్నది. దుర్బుద్ధియైన యీ ధృతరాష్ట్రుఁడు మాటి మాటికిని విదురుని వీపు గీరుచు, "గెలిచిరా" "గెలిచిరా?" యని యడుగు చుండెను గదా? ఆ దృశ్యమును

నీ వప్పుడే మఱచితివా?" భీముని యీ మాటలను మనము గొంత దృష్టిఁబెట్టి చదివినచో మన హృదయమున గలుగు దుఃఖము నాపికొనలేము! ఇంతమాత్రమే గాదు. దీనికి దోడు నేను మఱి రెండు దృశ్యములను గూడఁ దమకు మనవి సేయుదును. అపుడు మీకు ధృతరాష్ట్రునిపై గలిగిన యా కాసంత దయ గూడ నింకి పోవును. కాపట్యమునకుఁ బేరు మోసిన శకుని ధర్మజునితోఁ గూడ జూదమాడు చున్నాఁడు. ధర్మరాజు తనకున్న దంతయు నోడెను. ఇఁక నొడ్డుట కేమున్నది? అతఁడు దన్నే యొడ్డఁ దలఁచెను. అపుడు శకుని ధర్మజునితో నిట్లన్నాఁడు.

"అస్తి తే వై ప్రియా రాజన్! గ్లహాయేకోపరాజితం
పణస్వ కృష్ణాం పాంచాలీం తయాత్మానం పున ర్జయ!
(భా. స. ప. అ. 65)

"రాజా! యిప్పటికిని నీసర్వస్వమును నీ వోడలేదు. ఇఁకను నొక పదార్థము మిగిలియున్నది. అది నీ భార్యయైన పాంచాలి. ఆమె నొడ్డుము!" శకుని యీ మాటలన్నంతనే ధర్మరాజున కుద్రేకమెక్కువైనది. అతఁడు కార్యాకార్య వివేకమును మఱచెను. మత్తు నెత్తి కెక్కినది. వెంటనే పాచికలను జేతికిఁ గైకొని ద్రౌపది నొడ్డుటకు దయారై నాఁడు! ధర్మరాజన్న మాట లివి.

శారదోత్పలసేవిన్యా రూపేణ శ్రీ సమానయా
..... ..... .....
గ్లహం దీవ్యామి చార్వంగ్యా ద్రౌపద్యా హంత సౌబల!
(భా. స. ప. అ. 65)

శకునీ! ద్రౌపది శరదృతువునందలి కమలములతో సమాన మైన కన్నుల గలది. ఆ కమలములవంటి మేని గంధము గలది. ఆ కమలమువలెనే కన్నుల కానందము గల్గించునది. రూపమున లక్ష్మీదేవితో సమానమైనది. ఆమె హృదయము చాల గొప్పది. రూప సంపత్తియు శీల సంపత్తియు యన్యభాజన మైనట్టిది.

మనుష్యుని కల్పనాప్రవాహ మెంతవరకును భోగలదో యంత నిర్దుష్టమైన రూపము గలది ఆ ద్రౌపదినే పణముగా నొడ్డుచున్నాము."

యుధిష్ఠిరుని నోటినుండి యీ వాక్యములు వెడలినదే తడవు కౌరవ సభయంతయు నల్లకల్లోలమయ్యెను. ఆ దృశ్యము నెంతయో యుత్తేజకరముగ వ్యాసుఁడు వర్ణించెను. ఆ ఘట్ట మిది.

"ఏవ ముక్తే తు వచనే ధర్మరాజేన ధీమతా

..... ..... .....

కిం జితం కి జితమితి హ్యాకారం నాభ్యరక్షత!

(భా. స. ప. అ. 65)

"ధర్మరా జిట్లన్నంతనే సభలోఁ గూర్చున్న వృద్ధుల వదనముల నుండి "ఛీ ఛీ" యను పల్కులు బయలు దేరినవి. సభయంతయు నల్లకల్లోల మయ్యెను. అచటఁ గూర్చున్న రాజులందరు దుఃఖమున మునిగిపోయిరి. భీష్మద్రోణ కృపాదులకు భయముతో శరీరములు చెమరించినవి. స్వేదము గ్రమ్మినది. మస్తకమును వంచికొని విదురుఁడు శవమువలె నిశ్చేష్టుడై పోయెను. ధృతరాష్ట్ర డొక్క మాటతో నీ యాటయంతయు గట్టింపవచ్చును. కాని యాతని కెందుకో యట్లొనర్చుట కిష్టములేదు. అంధుఁడైన యా ధృతరాష్ట్రుఁడు మాత్రము శవమువలె గూర్చున్న విదురుని మాటిమాటికి నెచ్చరించుచు నానందముతో "జయించిరా? జయించిరా?" యని యడుగుచుండెను. ఎంత సమర్థుఁడైనను ధృతరాష్ట్రుఁడు మనసులోని హర్షమును క్షుద్రత్వమును దాచిపెట్టికొనలేకపోయి నాఁడు. తరువాతనే ద్రౌపదీ వస్త్రాపహరణ రూపమైన భయంకర ఘట్ట మారంభమైనది. అప్పుడు గూడ ధృతరాష్ట్రుడు విచలితుఁడు గాలేదు. దుశ్శాసనుఁడు బోయి ద్రౌపదియొక్క కేశపాశమును బట్టి సభలోని కీడ్చుకొని వచ్చెను. అపు డామె యొనర్చిన కరుణ విలాపము ధృతరాష్ట్రుని చెవులలోఁ బడలేదా? పడినది. కాని యా విలాపముతో

ధృతరాష్ట్రునకు దయ జనింపలేదు. కుల వధూ రత్నమును నగ్నమూర్తిగ నిండు సభలోఁ బ్రదర్శింపఁ దలఁచికొన్న దుశ్శాసనుని చెయిదము ధృతరాష్ట్రుఁడు నివారింపఁ దలఁపలేదు. దుర్యోధనుఁ డామెకుఁ దొడఁ జూపెను. ఇఁకను వాఁడొనర్చిన యవహేళనములకు లెక్కలేదు. వీని నన్నిటిని విదురుఁడు ధృతరాష్ట్రు నకు వర్ణించి చెప్పెను. కాని లాభమేమి? కడకు, గాంధారి యంతః పురమునుండి బయటికి వచ్చినది. ఆమె వచ్చువరకు నీ దుష్ప్రవృత్తి యాగలేదు. భారత చక్రవర్తియగు యుధిష్ఠిరుని సామ్రాజ్ఞి నగ్నరూపిణి గాబోవుచున్నది. ఇట్టి స్థితిని గూడ ధృతరాష్ట్రుఁడోర్చి కొనియే కూర్చున్నాఁడు. వాని మాంస చక్షువులు మూసికొని యున్నవి. కాని, ప్రజ్ఞా చక్షువు మాత్రము సమర్థముగఁ బనిచేయు చున్నది. అంధుఁ డన్నది ధృతరాష్ట్రుఁడు దయారుచేసికొన్న యొక బురఖా! వైభవ శిఖరమునుండి తన్నుగాని తన సంతానమును గాని యెవ్వరూ క్రిందికి దింపలేరనియు దింపరాదనియు ధృతరాష్ట్రుని యభిప్రాయము. ఈ దృశ్యమును మనసున నుంచి కొని ఆశ్రమవాస పర్వమునందలి భీముని వ్యాకముల నొకసారి చదివినచో మనకుఁ బవనాత్మజునిపై గోపము గలుగదు. ధృతరాష్ట్రుని పైననే రోష ముద్భవించును. అతనికిఁ గలిగిన యీ శిక్ష చాలదనిపించును. ఇంతేగాదు. భారతమున ధృతరాష్ట్రుని లీల లెన్నియో యున్నవి.

పాండురాజు ధృతరాష్ట్రు నెంత గౌరవించినదియు, నింతకు ముం చెప్పితిమి. అతఁడు హఠాత్తుగ నరణ్యములలో నసువులను గోల్పోయెను. గ భర్తృకయైన కుంతీదేవి నిస్సహాయయై తన యైదుగురు కొడుకులతో ధృతరాష్ట్రు కడకు వచ్చినది. అట నామె పడిన కష్టములకు మితిలేదు. ఆమె సంతానమును వధించుటకై దుర్యోధనాదు లెన్నియో పన్నాగములఁ బన్నిరి. ఈ ప్రయత్నములన్నియు ధృతరాష్ట్రునకు దెలియవనుటకు వీలులేదు. తెలిసియు నాతఁడు మౌనము వహించెను. పాండవులను వారణావతముల కంపినారు. అచట లాక్షా గృహ మొకటి

దయారు చేయఁబడెను. పుత్రులతోఁ గూడ కుంతీదేవి నచ్చట దహించి చంపనెంచిరి దుర్యోధనాదులు. ఎట్లో పాండవులు దప్పించి కొన్నారు. వారు కాననములలో సంచరింపఁ జొచ్చిరి. మృగములలో మృగములుగ మెలఁగిరి. పాండవులపై జరపిన యీ కుట్ర దైవ వశమున వారికే యనుకూలముగఁ బరిణమించెనని ధృతరాష్ట్రుఁ డెఱిఁగెను. వానికి లోక భయముగద్దు! అందుకై పాండవుల కొఱకై తానెంతయో మథన పడినట్లు సభలో గట్టిగ నేడ్చెను. ఈ యేడ్పుట యొక నటనయే! భారతమునంతయు వెదకినను ధృతరాష్ట్రుని వంటి కపట వృత్తి మరియొకఁడు గన్పింపఁడు. అతని కతఁడే సాటి! ధృతరాష్ట్రుని చిత్తవృత్తి యత్యంత గూఢమైనది. వాని గతి సర్పగతి! కాని కాటు వేసినచో మాత్రము లక్ష్యము దప్పుట కష్టమే! ఏ సమయమున నాతఁ డేది భావించుటయు నెవ్వరికిని దెలియదు! కనుకనే భారతము నెన్నియో తడవలు జాగ్రత్తగఁ జదివిననే తప్ప ధృతరాష్ట్రుని నిజస్వరూపము మనకు గోచరింపదు. ఆతఁడు దుర్యోధను నెన్నియో సారులు నిందించెను. నిండు సభలో నెన్నిసారులో మందలించెను. పాండవులను బ్రశంసించెను. ధర్మమునకై, న్యాయమునకై యనేక సారులు ఆవేదన పడినాఁడు. తన దేమి చెల్లదనియు తాను పరా ధీనుఁడననియు మాటి మాటికి నాక్రోశపడెను. ఇవన్నియూ వాని బాహ్య స్వరూపము మాత్రమే! లేక నటనలు మాత్రమే! వాని ప్రవృత్తి కొంగవంటిది. "బకవత్సాధయే దర్థాన్" అనెడు కూట నీతిని ధృతరాష్ట్రునివలె గమనించినవాఁడు లేఁడు. గమనించి యనుష్ఠించినవాఁడు లేఁడు. దృష్టి నిలిపి చూచినచో ధృతరాష్ట్రుని యీ కపట ప్రవృత్తి భారతమున నడుగడుగునను ప్రత్యక్షమగును. కొంద రిట్లు వాదింతురు. ధృతరాష్ట్రున కన్యాయము లిష్టములేదు. కాని వానికి దుర్యోదనుని పైన నపారమైన ప్రీతి పాపము! కనుక యేమి చేయలేక యూరకున్నాఁడు పాపము!" ఈ విమర్శ మవిచారిత రమణీయము! వానికి పాండవులపై నసూయ గద్దు! అతని యనంతరము రాజ్యమునకు వారసుఁడు ధర్మరాజే! ఈ విషయమున నెవ్వరికిని

మనుమానము లేదు. పాండురాజు వనములకుఁ బోవుచు రాజ్యమును ధృతరాష్ట్రుని యధీనమొనర్చి పోయెను. పాండురాజు మరణానంతరము ధృతరాష్ట్రుఁడు దిన్నగా రాజ్యము నాక్రమించెను! అప్పటికి పాండవులు చిన్నవారు. అందుచే వారికి సంరక్షకుఁడుగ మాత్రమే యాంబికేయుఁడు రాజ్య మొనర్చుచున్నాఁడని ప్రజలు సంతృప్తిపడసిరి. ధృతరాష్ట్రుని యనంతరము రాజ్యము ధర్మరాజునకే యని ప్రజల నిర్ణయము! ఈ సంగతి భారతమున నిట్లు గలదు.

> "తథా పాండు ర్నరపతిః సత్యసంధో జితేంద్రియః
>
> ..... ..... ..... ....
>
> అన్వాస్యమాన స్సతతం విదురేణ మహాత్మనా!
>
> (భా. ఉ. ప. అ. 148)

పాండురాజు సత్యసంధుఁడు. జితేంద్రియుఁడు! ఆతఁడు ధీమంతుఁడైన ధృతరాష్ట్రునకు రాజ్యము నొప్పించి భార్యలతోఁ గూడి యడవికేఁగెను. ధృతరాష్ట్రుఁడు రాజైనాఁడు. విదురుఁడు చామరములచే నాతని నమ్రుఁడై కొలిచెను. పాండురాజును భజించినట్లే ప్రజలును ధృతరాష్ట్రుని వినమ్రులై సేవించిరి. విదుర సహితు డైన ధృతరాష్ట్రునకు రాజ్య మొప్పించి పాండురాజు పృథ్విపై జరింప నారంభించెను. ఆయవ్యయములు, అధికారులను నియమించుట, పా పోషణములు మొదలైన పనులు విదురుఁ డొనర్చెడు వాఁడు. రాజ్య వ్యవహారమ సంధి విగ్రహాదులు మొదలైన వానిని భీష్ముఁడు విచారించుచుండెను. సింహాసనమ ధృతరాష్ట్రుఁడు గూరుచున్నాఁడు."

పై పలుకులు ద్రోణాచార్యు లాడినవి. ధృతరాష్ట్రునకు సంక్రమించిన యీ రాజ్యము పాండురాజు దయవలననే వచ్చినది. కాని శాశ్వతముగ ధృతరాష్ట్రుఁడే రాజ్య మేలవలెనని దాని యర్థముగాదు. ధార్తరాష్ట్రులదే రాజ్యమనియు గా-

అన్నదమ్ముల కున్న యొద్దికను బట్టి పాండవు లెక్కివచ్చు వఱకును జేసికొన్న యొక యేర్పాటు మాత్రమే యది. ధర్మరాజు రాజ్యమునకు వారసుఁడనుటలో నెవ్వరికిని విప్రతిపత్తి లేదు. రాజ్యమునకు ప్రముఖుఁడైన సూత్రధారి భీష్ముఁడు గదా! అతఁడే యొకసారి యుద్యోగపర్వమున నిట్లు దన నిర్ణయమును జెప్పెను.

"రాజా తు పాండు రభవ న్మహాత్మా లోక విశ్రుతః (39 శ్లో)
స రాజా తస్య తే పుత్రా! పితు ర్దాయాద్యహారిణః ॥
(భా.ఉ. ప. అ. 149)

"లోక విశ్రుతుఁడైన పాండుమహారాజే సింహాసనమున కర్హుఁడు. కనుక నతని యనంతరము ధర్మరాజు రాజ్యమునకు వారసుఁడు. ఇది నిర్వివాదమైన విషయము." ప్రజాభిప్రాయ మిట్లుండ బట్టియే అధ్యయనానంతరము ధృతరాష్ట్రుఁడు ధర్మరాజును యౌవరాజ్యమున బట్టాభిషేకించెను. యువరాజైనదే తడవు యుధిష్ఠిరుఁడు దన గుణములచే జనులకెంతయో ప్రియుఁడై నాఁడు. ఆతని బంధువు లతని యాజ్ఞలను మన్నించిరి. రాజ్య విస్తృతి నొనర్ప నారంభించిరి. నానాటికిని యుధిష్ఠిరుని తేజస్సు బెరుగ నారంభించెను. ఆతని గుణములు లోక ప్రియములయ్యెను. న్యాయదృష్టి ప్రసిద్ధమయ్యెను. ధర్మజుఁ డెదుగు కొలఁదియు ధృతరాష్ట్రుని కతనిపై యకారణ మగు నసూయ బ్రారంభమైనది. పుట్టలో పామువలె నాంబికేయుని హృదయమున దుష్టభావము బ్రోది చేసికొనెను. ఈ విషయము భారతమున నిట్లు గలదు.

"తత స్సంవత్సరస్యాంతే యౌవరాజ్యాయ పార్థివ!
..... ..... ..... ....
తతో బలమతిఖ్యాతం విజ్ఞాయ దృఢధన్వినాం ॥
(భా. ఆది ప. అ. 139)

"ఒక సంవత్సరము గడచినది. ధృతరాష్ట్రుఁడు ధర్మజాని యౌవరాజ్యమునం దభిషేకించెను. ధైర్య స్థైర్యములు, సహిష్ణుత, దానము, అనృశంసము, ఆర్జవము మొదలైన గుణములు సమృద్ధిగ గల వాఁడు ధర్మజుఁడు. సేవకులపై నాతని కమితమైన దయ! మిత్రుల కతఁ డన్న ప్రాణము! ధర్మజుఁడు సద్గుణములలో పాండురాజును మించెను. ధర్మజుఁడు వృకోదరుని బలరామున కొప్పించి యుద్ధ మర్మముల నేర్పించెను. బలరాముని కడ సర్వవిద్యలు గ్రహించిన భీముఁడు కీర్తివంతుఁడైనాఁడు. అర్జునునితో సమానమైన వీరుఁ డయ్యెను! గదా యుద్ధము, ఖడ్గ యుద్ధము, రథ యుద్ధము, అన్నిటిలో నాతఁడు మేటి! ధనుస్సున నాతని మించినవాఁడు లేఁడు. సముఁడును లేఁడు. సహదేవుఁడు నీతివంతుఁడు. న్యాయ శాస్త్రమున బృహస్పతితో సమానుఁడు! నకులుఁడు ద్రోణుని కడనే ముఖ్యముగ విద్యల నభ్యసించి మహాశూరుఁడైనాఁడు. అర్జునుఁడు శత్రువుల గెల్చి కురురాజ్యమున కెంతయో ధనము సంపాదించెను. ఈ రీతి సమర్థులైన పాండవులతో కురురాజ్యము సంపన్నమైనది. రాజులందరును వీరిని జూచి భయపడ నారంభించిరి. వీరి బలము, పరాక్రమము, లోకప్రియత్వము మొదలైన గుణములను గాంచి ధృతరాష్ట్రున కసూయ జనించినది. వీరిని నాశన మొనర్పవలెనని ధృతరాష్ట్రుఁ డాలోచించెను. అట్లయినచో రాజ్యము శాశ్వతముగ తనకును తన కుటుంబమునకును దక్కును. ధృతరాష్ట్రుఁడు కణికుఁ డను కూటనీతిజ్ఞునితో రహస్యముగ సంభాషించి వాని సహాయము బడసి తన దుష్క్రియల నారంభింపఁ జొచ్చెను. మహా భారతము ఆది పర్వము 140 వ అధ్యాయమున కణికుఁడు ప్రవేశించును. **141** వ అధ్యాయము మొదలుకొని కణికునితోఁ జేరి ధృతరాష్ట్రుఁడు దన కపటోపాయము లల్ల నారంభించును. కణికనీతి జదివినచో ధృతరాష్ట్రుని హృదయ మెంత కలుషితమైనదో మన కర్థమగును. ఆ కణికుఁ డొనర్చిన నీతి యేదో జూతముగాక!

# కణికుని యుపదేశము

వైశంపాయన ఉవాచ:-

"ధృత్వా పాండుసుతాన్ వీరాన్ బలోద్రిక్తాన్ మహౌజసః
పశ్చాత్తాపో యథా న స్యా త్తథా నీతి ర్విధీయతాం ॥"
(భా. అది. ప. అ. 140)

"పాండు పుత్రులు వీరులు, అత్యంత బలవంతులు, తేజస్వులు, అగుటచే ధృతరాష్ట్రున కమితమైన చింత బొడమెను. అతఁ డొక నాఁడు మంత్రియైన కణికుని బిలచెను. కణికుఁడు నీతిశాస్త్ర కోవిదుఁడు. కణికునితో ధృతరాష్ట్రుఁడన్నాడు. "పాండవులు దినదినమును తేజోవంతులై పోవుచున్నారు. నాకు వారిపై యసూయ జనించినది. నీవు సంధి విగ్రహాదికమైన నీతి శాస్త్రమున గొప్పవాఁడవు. నే నెట్లు కార్యమును సాధించికొనవలెనో జెప్పుము! నీ వాక్యప్రకారము నడిచికొందును. నాకు లాభకారకమైన విషయమేది?"

ఈ మాటలకుఁ గణికుఁ డెంతయో సంతసించెను. కఠోరమైన తన నీతిప్రకారమును - ధృతరాష్ట్రునితో నిట్లు జెప్పమొదలిడినాఁడు!" రాజా! నీయొక్క లోపములను, ఛిద్రములను యెవ్వరికిని గనుపరపకుము! చాల జాగ్రత్త గలవాఁడవై వానిని గుప్తముగ రక్షించికొనుము! తన శరీరమును సర్వదా రక్షించికొను కూర్మమువలె, నీవు నీ రహస్యములను రక్షించికొనవలెను. నీ వెవరిని నాశన మొనర్పఁ దలచికొన్నను వారి కీ విషయ మణు మాత్రమును దెలియరాదు. నీ వన్వేషించు మార్గములు గూడ గుప్తములుగ నుండవలెను. కాని శత్రువుల రహస్యములను మాత్రము సర్వమును గమనింపవలెను. ఒకసారి శత్రువినాశమునకు ప్రారంభించితివా? మఱి యా కార్యమును మధ్యలో నిలుపరాదు. కాలిలో ముల్లు విరిగిన దనుకొనుము! ఆ ముల్లును సగము వరకు దీసి తక్కిన

సగము నట్లే మిగిల్చినచో నే మగును? మరల నది కాలికి బాధను గలిగించును గదా! శత్రువు గూడ నంతే! దాయాది యున్నత్తుఁడైనను, పరాక్రమి యైనను యుద్ధకుశలుఁ డైనను వాని నెట్లో యొకరీతి మాయోపాయమున నంతలో ద్రోయవలెను. త్రోసి దయాలేశమును లేక వానిని సంపూర్ణముగ నాశమొనర్పవలెను. దయాలేశ మైనను మనసున మెదలాడినచో అది నీ వినాశమునకు మార్గమగును! శత్రువు దుర్బలుఁ డైనపుడు "వీఁడేమి చేయునులె" మ్మని యుపేక్షింపరాదు. నిప్పురవ్వ కొంచెమైనను మండి మండి కడ కొక మహారణ్యమునే దహించివేయును. అనుకూలమును బట్టి యొకప్పుడు గ్రుడ్డివాఁడుగ నటింపవలెను. మఱి యొకప్పుడు చెవిటివానిగ గమనింపవలెను. చెవులు సరిగా వినపడినను వినపడనట్లు వెఱ్ఱిచూపులు చూడవలెను. వేఁటగాఁడు గడ్డిని జూపి మృగమును వంచించును. నీవు నట్లే సాంత్వనవచనములతో మోసముతో శత్రువులకు విశ్వాసము గలిగింపవలెను. నమ్రత జూపి యశక్తతను బ్రకటించి యిఁక నెన్నియో యుపాయములచే నెదుటి వారి మనస్సులో విశ్వాసము నుప్పతిల్లఁజేసి వారిని లోఁబరచికొనవలెను. లోఁబడిన వెంటనే నాశన మొనర్పవలెను. నీ యుపాయము లెప్పుడును గడ్డితోఁ గప్పఁబడిన ధనుస్సు వలె నుండుట మంచిది. కాని, లోన(బ్రాణముల హరించు బాణము లుండును. శత్రువు శరణు జొచ్చెనని వానిపై నెప్పుడును దయజూపరాదు. మఱల కొంచెము బలము సేకూరిన వెంటనే వాఁడు విజృంభించును. ఒక్కసారిగ వానిని వధించినచో మరి భయమెక్కడిది? కార్యసాధకుఁడు లోకము తన్ను మంచి వాఁడని విశ్వసించుటకు తగిన పనులన్నియుఁ జేయవలెను. యజ్ఞ యాగాదికము లైన కోలాహలము లొనర్పవలెను. కాషాయములు ధరింపవలెన జడలు బెంచవలెను. మృగాజినములు ధరింపవలెను. పూజోపవాసాదికము నటింపవలెను. ఈ క్రియలతో మంచి వాఁడని భ్రాంతిని గల్పించి లోకమ వంచింపవలెను. తోడేలు వలె కపటభీషణముగఁ గార్యసాధకుఁ డుండకున్న

పనులు జరుగవు. ఏ శత్రువుపైఁ దనకు జూపున్నదో వానిని లాలింపవలెను. తనకుఁ గాల మనుకూలము గానప్పుడు వానితో మైత్రిఁ బాటింపవలెను. కాలము కలిసి వచ్చిన వెంటనే నిండకుండను బండపై వేసినట్లు వాని జీవితమును హఠాత్తుగ నాశన మొనర్పవలెను. వాఁడెంత ప్రార్థించినను కదలరాదు. చంపియే తీరవలెను. దయ ప్రబలమైన దౌర్బల్యము. శత్రువులు పుత్త్రులే యగుదురు గాక! మిత్రులే యగుదురు గాక! తండ్రి యౌ గాక! శత్రుత్వము వచ్చినపు డుపేక్షింపరాదు గురుహత్యకు జంకరాదు. లేనిచోఁ దనకు క్షేమము గలుగదు. ఎవనిపైఁ దనకుఁ బగ గలదో వానిపై నెంతయో ప్రేమ యున్నట్లు నటింపవలెను. ధర్మములు పలుకవలెను. సమ్మానింపవలెను. ఈ గుణములతో వానిని వంచించి సమయమును జూచి నఱుకవలెను. ధర్మ ప్రతిచ్ఛన్నుఁడైన వాఁడు యెంత ఘోరపాపము లొనర్చినను వానిని లోక మపరాధియని నమ్మదు. మహామేఘములు బర్వతముల గప్పునట్లు వాని కపట ధర్మము అపరాధములను పూర్తిగాఁ గప్పి వేయును. మన కెవనిపై పగ యున్నదో వాఁడు మనలను సంశయించునట్లు వర్తింపరాదు. ఆహారవిహారములతో వాని నాదరింపవలెను. అవసర మైనచో ధనము గూడ నొసఁగవలెను. ఈ రీతి విశ్వాసమును గలిగించి వానిని సర్వనాశన మొనర్చుట మంచిది. పలుకెంతయో మృదువుగ నుండవలెను. మనసు కత్తివాదర గావలెను. హృదయమున నెంత విషమున్నను పైకి స్నేహ పూర్వకముగ మాటాడుట మంచిది. చిఱునగవును మొగముపై నెప్పుడును వదలరాదు, చేతులు జోడించుట, సాంత్వనములు బల్కుట, ప్రతిజ్ఞ యొనర్చుట, పాదములకు నమస్కరించుట మొదలైన యీ యుపాయము లను సమయానుసారముగ వాడుచు గార్యమును సాధించికొన వలెను. తన కనుకూలములైన యుపాయములలో దేనిని జెప్పుట కైనను మానవుఁ డణుమాత్రమైనను జంకెనా! వాని కార్యము సఫలము గా నేరదు. ఇతరులను హింసింపనిది, వంచింపనిది, దారుణ కర్మ లొనర్పనిది

ప్రపంచమున నెవ్వడును నైశ్వర్యవంతుడు గాలేదు. అట్లగుట యసంభవము. గూఢములైన తన యుపాయములను శత్రువులకు దెలుపనట్లే మిత్రులకును దెలుపరాదు. ఫలకాలముననే తన ప్రయత్నము లితరుల కర్థము గావలెను. ఇంతటి చాతుర్యము లేనిది మానవుఁడు గార్యసాధకుఁడు గానేరఁడు. పాండు పుత్రులు నీకంటెను ప్రబలు రగుచున్నారంటివి. వారిని గూర్చి నీ విట్లు తలపోయుచున్నచో యేమి సాధింతువు? నే నింతవఱకు చెప్పిన నీతి నవలంబింపుము. వారిని జయింపగలవు."

ఈ సందర్భమున నేను కణికుఁ డొసఁగిన యుపదేశము నంతయు నుద్ధృతీకరింపలేదు. కొంత భాగమును మాత్రము దడవితి నంతే! ఈ యుద్ధృతీకరణముతో ధృతరాష్ట్రుని చిత్తవృత్తి యెట్టిదో పాఠకులకు బోధపడి యుండునని తలఁతును. ఈ విషయములను మనసున నుంచికొని చూచినచో ధృతరాష్ట్రుని స్వభావ మెట్టిదో గమనించుటకై మనమెక్కువ పరిశ్రమింప నవసరము లేదు. అదెట్టిదో చూతము గాక!

## ధృతరాష్ట్రునియొక్క స్వభావము

గడచిన యధ్యాయమున కణికుఁ డొనర్చిన కూటనీతిలోని సారభూతములై కొన్ని భాగములను దెలిపితిమి. ఈ నీతి రాజకీయజ్ఞులైన సర్వమహాపురుషులును బ్రయోగించినదే! మన చరిత్రలో నీ నీతిని బ్రయోగించుట గ్రొత్త విషయము గాదు. మహాపురుషులుగ మనము భావించు నాయకు లెల్లరును నీ నీతిని బ్రయోగించి యశస్సును సాధించినవారే! దీనివలనఁ దెలియు విషయమేమి? ప్రతి గొప్పవాఁడును నేదో యొక ఘట్టమున నీ పద్ధతి ననుసరించినవాఁడే! అట్లైనచో నీ కూటనీతిని బ్రయోగించిన వాఁడంతయు నీతిమంతుఁడు గాఁడనుటకు వీలులేదు గదా! అధార్మికుఁ డనుట బొసఁగదు. అధః పతితుఁడని వంచించుటకును సాధ్యపడదు.

ఇప్పటివరకును వారి నట్లు భావించు నాచారము లేదు. మన పురాణములలో శ్రీకృష్ణుఁడు చాల గొప్పవాఁడు గదా! అతనిని బూర్ణావతారుఁ డంటిమి. కృష్ణుఁడు గూడ తన జీవితమున నొకటి రెండు సారులు యీ కూటనీతినే బ్రయోగించెను. నందవంశమును నాశన మొనర్చిన చాణక్యుని పేరు విననివా రుండరు. అతఁడు రచించిన యర్థశాస్త్ర మమూల్యమైన గ్రంథము. ఆతని నొక శ్రేష్ఠపురుషునిగ రాజకీయ ధురంధరునిగ, మన జాతి విశ్వసించుచున్నది. ఆతఁ డనుసరించినది కూటనీతియే! కూటనీతి ననుసరించిన శ్రీకృష్ణుని పూర్ణావతారుఁ డందురు. పూజ సలుపుచుందురు. ఆ నీతినే యనుసరించిన ధృతరాష్ట్రుని ధర్మదూరుఁ డందురు. ఇందులో మన న్యాయ మేమున్నది? భారతమునందలి శాంతి పర్వమున విశుద్ధమైన రాజనీతి వర్ణింపఁబడి యున్నది. ఆ రాజధర్మము రాజుల కందఱకును శిరోధార్యము. ఆ గ్రంథముననే యీ నీతి గూడ వచింపఁబడినది. ఒక రాజ్యమును సృష్టించి పోషింపవలసిన బాధ్యత గల రాజున కీ ధర్మము అపరిహార్యమని గూడ కణికుఁడు దెలిపెను. మఱి యీ మార్గము ననుసరించిన ధృతరాష్ట్రుఁడు దోషి యెట్లైనాఁడు? ఇది విచారింపఁదగిన విషయమే! శ్రీకృష్ణుని వంటివారు గూడ కణికుని మార్గమైన యీ కూటనీతి ననుసరించినది అపరిహార్యములైన విషయములందే! ఆపద్ధర్మముగ మాత్రమే వారు దీనిని వాడుకొన్నారు. అంతేగాని క్రమప్రాప్తమైన ధర్మముగ దీనిని వా రంగీకరించి యనుష్ఠింపలేదు. ఇంతమాత్రమే గాదు. వ్యక్తిగతమైన లాభములకు వారీ మార్గము నవలంబించి యెఱుఁగరు. సామాజికమైన మహా శాంతిని సంపాదించు సమయములందే, యితరోపాయములన్నియు వ్యర్థమైనప్పుడే కాక, సాగవని తోఁచినప్పుడే వా రీ వక్రమార్గమును ద్రొక్కినారు. ఈ ప్రపంచమున యే కాలముననను నే దేశముననను దుష్టులెక్కువ! వాస్తవ మిట్లున్నప్పుడెవఁడైన నొక మహా పురుషుఁడు లోకకల్యాణము సాధింప సమకట్టుచో వానికిఁ గంటకు లెక్కువ యేర్పడుదు రనుటలో కించిత్తు సందేహము లేదు. వారు దుర్మార్గులే గాక

మాయాదక్షులు గూడ నయి యుందురు. అట్టివారిని జయించుటకు మాయోపాయ మొక్కటే శరణ్యము. ధర్మము రెండు తెఱఁగులు. అది విధి నిషేధరూపమైనది. "దినమును సంధ్య యొనర్పుము. ప్రతి వసంత ఋతువునను సోమయాగము సేయుము. పరస్త్రీలను గౌరవింపుము. సత్యమును వచింపుము." ఇత్యాదులు విధి రూపములైన ధర్మములు. "అబద్దము లాడకుము. ఇతరులకు విషప్రయోగ మొనర్పకుము. ఇతరుల ధనమును దొంగిలింపకుము." మొదలైనవి నిషేధ రూపములు. అసత్యము లాడుట, యితరుల యిండ్లను గాల్చుట మొదలైనవి యుపాదేయములని యే నీతిశాస్త్రమునూ వచింపదు. కాని యొక్కొక్కసారి యవి గూడ ధర్మములే! ప్రబలమైన అపాయములనుండి తన్ను తాను రక్షించుకొనవలసి నపుడు మానవుఁడు వీని నవలంబించును. ఇట్టి వాని కాపద్ధర్మములని పేరు. ఒకఁ డొనర్చిన పని ధర్మమా? కాదా? యనుట దాని బాహ్య స్వరూపమును బట్టి కాదు. ఆ పనికి ప్రేరకమైన హేతువును బట్టి! ఆర్య చాణక్యుఁడు కూటనీతి ననుసరించి నందవంశమును నాశన మొనర్చెను. కాని యంతతో నాతఁ డూరకుండలేదు. ఆస్థానమున చంద్రగుప్తుని వంటి మహా సమర్థుని నియమించినాఁడు. ఆ మహా సామ్రాజ్యమునుండి యాతఁ డొక చిల్లిగవ్వయైనను దనకై గోరలేదు. తాను నూతనముగ నిర్మించిన సామ్రాజ్యబలముచే భారతదేశము పైకెత్తి వచ్చుచున్న గ్రీకు యవనుల నరికట్టినాఁడు. అతఁడు భారతదేశ సుఖము బండించెను. చంద్రగుప్త మహా సామ్రాజ్యమునకు ప్రధాన సూత్రధారియై నడిపించెను. ఇంత పని యొనర్చినను ఆ మహాతపస్వి కణుమాత్రమైనను సుఖాపేక్ష లేదు. సామ్రాజ్యమును చంద్రుగుప్తుని వశమొనర్చి యితఁ డరణ్యములకుఁ బోయెను. ఆ పోవుట తపశ్చర్య యొనర్చికొనుటకు. ఇందుకే చాణక్యుఁ డార్యుఁడై నాఁడు. ఆతనిని గొప్పవాఁడని భారతచరిత్ర గౌరవించుట ఈ యాసక్తినిబట్టియే! అట్లుగాక నందుల నోడిఁ యాతఁడు సామ్రాజ్యమును తనకైవస మొనర్చికొని యుండినను లేక చంద్రగు

కీలుబొమ్మగ జేసికొని జలగవలెఁ బ్రజల రక్తమును బిండుచు మరణించువరకును ప్రధాన మంత్రిగనుండి యున్నను భారతచరిత్రలో నాతని కిప్పుడు గల్గిన ప్రశస్తి యబ్బి యుండదు. చాణక్యుఁ డొనర్చిన యీ త్యాగము అతని కజరామరమైన కీర్తిని సంపాదించిపెట్టినది. కావ్యజగత్తున గూడ నాతఁ డాదర్శపురుషుఁడుగ వెల్గుచున్నాఁడు. విశాఖదత్తుఁ డొనర్చిన ముద్రారాక్షస మాతని కీర్తి పతాకగ నున్నది. ఆ నాటకమున కంచుకి యార్య చాణక్యుని స్వరూపము నిట్లు వర్ణించు చున్నాఁడు.

"అహో! రాజాధిరాజ! మంత్రిణో విభూతి: తథాహి
ఉపలశకల మేతత్ భేదకం గోమయానాం
వటుభి రుపహృతానాం బర్హిషాం, స్తూప మేతత్
(ముద్రారాక్షసం. 3 వ అంకము. 15 వ శ్లో.)

ఇట్టి జీవితము నందున్నది చాణక్యుని గొప్పతనము. అందుకే కూటనీతిని బ్రదర్శించినను యాతఁడు మహాపురుషుఁడే యైనాఁడు. భగవంతుఁడైన శ్రీకృష్ణుని విషయముగూడ నింతే! ఆతని కాలమున రాజకులములలో నృశంసులు బయలుదేరిరి. వారు తమకే గాక రాష్ట్రములకును కష్టనష్టములను గలిగింపఁ జొచ్చినారు. కుల ధర్మములు, జాతిధర్మములు అడుగంటి పోవు ప్రమాదమేర్పడినది. చిన్న పెద్ద యను తారతమ్యములు నశించినవి. జాతి కరిష్టదాయకము లైన యీ దుర్మార్గముల నణచుటకే కృష్ణుఁ డాపద్ధర్మమైన కూట నీతిని జేపట్టెను. చౌహాణ వంశమునకు జెందిన పృథ్వీరాజును ధర్మాత్ముఁడే! తన చేతికి దొరికిన మహమ్మదుఘోరీ నాతఁడు వదలిపెట్టెను. లేనిపోని ధర్మములతో శత్రువుల కనుకూలములు గల్పించెను. కడకు జరిగిన పరిణామమేమి! తాను భీకరముగ వధింపఁబడెను. అంతమాత్రమే గాదు. నాటి భారతదేశమును గూడ అష్టకష్టముల పాలొనర్చినాఁడు. అతనిది ధర్మముగాదు. ధర్మమను పేరిట నేర్పడిన గ్రుడ్డితనము. వైయక్తికమైన ధర్మమున కాతఁడు బ్రాధాన్యము నొసఁగి జాతిధర్మమును నాశన

మొనర్చినాఁడు. మహాఫలమునకు గాక దమసామర్థ్యమునకు కూటనీతి ననుసరించినచో నది యధర్మమే! శాశ్వతధర్మమైన జాతిధర్మమును మానవ కల్యాణమును రాష్ట్రక్షేమమును సాధించునప్పు డీ కూటనీతి ధర్మమే యగును. ఇది విధిరూపమున శాస్త్రములలో నేర్పడలేదు. ఆపద్ధర్మముగఁ బ్రవేశించినది. ప్రతి రాజునకును మహాపురుషునకును నిది యావశ్యకమైన నీతి గాదు. కాని విధిలేనప్పుడు దీని నుపయోగింతురు. చాణక్యుఁడును, శ్రీకృష్ణుఁడును అట్లే యొనర్చిరి. ఇఁక ధృతరాష్ట్రుఁ డెందుకు వాడుకున్నారో విలోకింతముగాక!

## ధృతరాష్ట్రుని కూటనీతికిఁ గారణము

భారతమునందలి శాంతిపర్వమున రాజధర్మ ప్రకరణమునందు రాజకర్తవ్యములుగ నీ విషయములు చెప్పఁబడినవి.

"నాధర్మేణ మహీం జేతుం లిప్సేత జగతీపతి!

..... ..... ..... ....

సాధయ త్యేష రాజానం, మహీంచ భరతర్షభ!

"రాజైనవాఁ డధర్మముతో భూమిని గెలువరాదు. ఈ విషయము మనస్సునందును దలఁపరాదు. అధర్మముచే సంపాదింపఁబడిన సంపద లెవ్వనికి గౌరవము నాపాదించును? అధర్మార్జితమైన విజయము చాల కాలము నిలువనేరద అధర్మపరుఁడు పరలోకమునందును బాధనొందును. ఇంతమాత్రమే గాఁ ఇహలోకమునను వాని సుఖములు త్వరలో నశించును." యుధిష్ఠిర యౌవరాజ్యమున నభిషేకించుచు ధృతరాష్ట్రుఁ డీ మాట లన్నాఁడు ఒక యుధిష్ఠిరుని సింహాసమునఁ గూర్చుండబెట్టెను. మఱియొకవైపు తనిపై మాత్సర్యము బెంచుకొనుచు వచ్చెను. ఈ హృదయముతో నున్న ధృతరాష్ట్రుఁడే జెప్పిన వాక్యములను బల్కెను. ఇందులో నేకవాక్యత యున్నదే

యోచింపుడు. ఆ కాలము నందలి న్యాయము ననుసరించి వికలాంగుఁడు సింహాసనార్హుఁడు గాడంటిమి. ఆ కారణముననే దేవాపి ధీరోదాత్తుఁడై శంతనుని సింహాసనముపై గూర్చుండ బెట్టి తా నరణ్యములకు వెళ్ళెను. ధృతరాష్ట్రుఁడు జన్మించిన దా వంశములోనే! ఇతఁ డందుకు విరుద్ధముగఁ బ్రవర్తింపఁ దలఁచెను. తిన్నతిన్నగా నధికార సూత్రములను దన చేతిలోనికి లాగికొన్నాఁడు. నలుగురు చూచునట్లు ధర్మరాజును యువరాజుగ నొనర్చెను. ఈ యొనర్చుట నలుగురినీ దృప్తిపరచుటకే! రహస్యముగ ధర్మరాజుయొక్క నాశ మన్వేషింపఁ దొడఁగెను. ఇది ధృతరాష్ట్రుని శీలసంపదలో రెండవ యధఃపతనము. తన మనస్సునందు భావములు పాప భూయిష్ఠములని ధృతరాష్ట్రుఁడు స్పష్టముగ నెఱుఁగును. ఆ తలఁపుల నితరులకు వెల్వరించుటకు గూడ నాతనికి భయమే! తన్ను అధర్మపరుఁ డందురని యీ విషయము నాతఁడే స్పష్టముగఁ జెప్పెను. ఆ ఘట్ట మిది.

"దుర్యోధన, మమా ప్యేతత్, హృది సంపరివర్తతే

..... ..... ..... .....

కథం న వధ్యతాం తాత! గచ్ఛామో జగత స్తథా!

(భా. ఆ. ప. అ 142)

పై శ్లోకముల యర్థమిది. వృద్ధరాజు కుమారునితో ననుచున్నాఁడు. సుయోధనా! నాకును గూడ మనస్సున నీ తలఁపే గలదు. కాని యీ యభిప్రాయము పాపమయమని నే నెఱుఁగుదును. అందుచే నలుగురి యెదుట జెప్పుట లేదు. నీవు పాండవుల కపకారము జేయదొరకొనుట వినిరేని భీష్మద్రోణు లాపనికి సమ్మతింపరు. విదురుఁ డంగీకరింపఁడు. కృపాచార్యుఁ డొప్పుకొనఁడు. వారి దృష్టిలో కౌరవ పాండవు లిర్వురు నొక్కటే! పైగా వారి మనస్సు ధర్మనిష్ఠమైనది. కనుక వారు నీకు మాత్రము హితము గలిగి పాండవుల కహితములగు పనుల ౦దు కంగీకరింతురు. ఇంత మాత్రమే గాదు. కౌరవ వంశములోని

పెద్దలుద్రోణాదులైన ధర్మవిదులు వీరి మార్గమునే యనుసరించిన ప్రజలు మనలను మహాదోషులుగ నిర్ణయింతురు. ఆ నిర్ణయముతో వారు మనలను వధించుటకు గూడ జంకరని నా భయము.''

దుర్యోధనుఁడు తండ్రికి తా నవలంబింపఁదలఁచిన వ్యాయోపాయములను వివరించి చెప్పినాఁడు. ఇవి ఫలోన్ముఖములు గావచ్చు నని ధృతరాష్ట్రునకుఁ దట్టినది. పుత్రులనియు, సఖులనియు, దండ్రు లనియు, గురువులనియు స్వకార్యపరులు గౌరవింపరాదన్నది ధృత రాష్ట్రుఁడు నేర్చికొన్న నీతియే! అందుకై పాండవులను వధించు యత్నమున కాతఁడు సమ్మతించినాఁడు. సుయోధనునియభిప్రాయముల కెంతయో సంతసించెను. పాండవులను వారణావతమునకు బంపుటకే నిశ్చయించికొన్నాఁడు. కాని సరళమైన మార్గముతో కౌంతేయులను వారణావతమునకుఁ బంపుటకు సాధ్యపడలేదు. అక్కడ గూడ నతఁడు కూటనీతినే యాశ్రయించెను. ఆశజూపి పాండవులను వారణావతమున కంపెను.

## ధృతరాష్ట్రుని యూహలు

హస్తినాపురము నుండి ధర్మరాజును పంపివేయవలెను. చాలాకాలము వఱకును అతనిని వెనుకకు రానివ్వరాదు. ఇంతలో ప్రజ లాతని వృత్తాంతమును మఱచి పోదురు. దుర్యోధనుఁడు ప్రజలలో పలుకుఁబడిని సంపాదించికొన వచ్చును. "ఇవన్నియు ధృతరాష్ట్రుని మనస్సులోనున్న యూహలు. ఇందుపై పాండవుల నతఁడు వారణావతమున కంప నిశ్చయించికొన్నాఁడు. కాని వారి నెట్లు బొమ్మని చెప్పుట? వారణావతమున వారికిఁ గొన్ని యాశలు జూపవలెను. అందుకై ధృతరాష్ట్రుఁ డొక చక్కని పథక మల్లినాఁడు. భారతమును బట్టి దాని స్వరూప మిది.

"ధృతరాష్ట్ర ప్రయుక్తా స్తే కేచి త్కుశలమంత్రిన:

..... ..... ..... ....

ఇదం వై హాస్తినపురం సుఖిన: పున రేష్యథ!

(భా. ఆ. ప. 143)

ధృతరాష్ట్రుఁడు కొందరు మంత్రుల నీ కార్యమునకు వినియోగించెను. వారు వచ్చుచు బోవుచు పాండవులకు వారణావతమును గుఱించి చెప్పఁదొడఁగిరి. అది రమ్యమైన పట్టణమని వర్ణించినారు. ఆ పట్టణమున శివునియొక్క గొప్ప క్షేత్రమున్నది. ఆ దేవుని ధర్శనమునకై దినమును వచ్చు యాత్రికులకు లెక్కలేదు! ఆ నగర మత్యంత సమృద్ధమైనది. అచ్చట గల యనుకూలములకు లెక్కలేదు. ఈ రీతి వర్ణనము గడియ గడియకు సాగెను. పాండవుల కా పట్టణము చూడవలె ననిపించెను. వారి యభిప్రాయమును ధృతరాష్ట్రుఁడు పసివట్టినాఁడు. ఆతఁ డొకనాఁడు వారితో నన్నాఁడు. "మంత్రుల యభిప్రాయము ననుసరించి వారణావత పట్టణము మీకు నివాసయోగ్యమైనదని దలఁచితిని. దాని సౌందర్య మపూర్వమైనదని వింటిని. మీ కక్కడికిఁ బోవలెనని యిచ్ఛయున్నచో మీ పరివారములతోఁ గూడ యచటికి వెళ్ళవచ్చును. దానికైన యేర్పాటులన్నియు నే నొనర్తును. దేవతలవలె మీ రచ్చోట విహరింపుడు. మీకిష్టము వచ్చినట్లు బ్రాహ్మణులకు రత్నాదికములు దాన మొసఁగుఁడు. గీతాదికములు వినుఁడు మీకిష్టము వచ్చినన్ని దినము లక్కడ సుఖముల ననుభవించుచుండుడు. కొన్ని దినము లచ్చోట గడపి మరల హస్తినాపురమునకు వత్తురుగాక."

ఎంత చమత్కారమైన మాటలు! అల్లిన జాల మెంత బాగుగా నున్నది. అమాయకులైన పాండవులు ధృతరాష్ట్రుని వలలోఁ బడినారు. పరిజనులతోఁ గూడ వారణావతమునకు బోవుటకై సమ్మతించిరి. పాండవులు వారణావతమునకు బోవుటనగా మరణమును వరించుటన్న మాటే! అందుకు దగిన యేర్పాటు

లన్నియు దుర్యోధనుఁ డాలోచించుచునే యుండెను. పురోచనుఁ డను దుష్టుఁ డొకఁడు వీనికిఁ దోడైనాఁడు. లాక్షాగృహము నిర్మింపఁబడెను. సపరివారముగ కౌంతేయులను వధించుటకు గావలసిన యత్నము లన్నియు సిద్ధమైనవి. పాండవులు పాపము! ధృతరాష్ట్రుని సంపూర్ణముగ నమ్మిరి. వారి కతనిహృదయము దెలియదు. ఆతని మనస్సులోఁ బాములు పారాడుచునే యుండెను. యుధిష్ఠిరుఁడు ధృతరాష్ట్రుని నమితముగఁ బ్రేమించెను. ఆతఁడు పరిజనులతో నిట్లన్నాఁడు.

"పితా మాన్యో గురుశ్శ్రేష్ఠో యదాహ పృథివీపతిః
అశంకమానై స్తత్కార్య మస్మాభి రితి నో వ్రతం"

"ధృతరాష్ట్రుఁడు మాతండ్రి! గురువు. మాకన్నను శ్రేష్ఠుఁడు ఆతఁడు మాకు, హితమునే జెప్పును. అందులో సందేహమే లేదు. ఆతఁడు జెప్పునట్లు నడచుకొనుటయే మావిధి!"

## రాజశక్తి, సచివశక్తి, వీనికిఁ దమలోఁ బోరాటము

ధృతరాష్ట్రుఁడు గుప్తముగ మాయోపాయము లెన్నియో యొనర్చెను. విదురుఁ డాతని మంత్రి. ఆతఁడు విచక్షణుఁడైన ధార్మికుఁడు. విదురుఁ డీ రహస్యమును దెలిసికొన్నాఁడు. ఆతఁడు పాండవులను రక్షింపఁదలఁచెను. రాచరికము జక్కగా నడువవలె నన్నచో రాజునకును మంత్రికిని సమైక్యత గుదురవలెను. విదురుఁడు ధార్మికుఁడు. ధృతరాష్ట్రుఁ డధార్మికుఁడు. కడకు ధర్మదూరమైన రాజశక్తిని ధర్మశక్తిగల సచివశక్తి గెలిచినది. ఈ సందర్భము భారతమున నిట్లు గ

"తేషా మింగితభావజ్ఞో విదుర స్తత్వదర్శివాన్
..... ........ ........ ......
పలాయనే మతిం చక్రే కుంత్యాః పుత్రైః సహానఘః !"

"విదురుఁ డింగితము లెఱిఁగినవాఁడు. తత్వదర్శి! కౌరవుల ముఖలక్షణములఁ బట్టియే వారి భావముల నాతఁ డెఱిఁగెను. విదురుఁడు కర్తవ్యాకర్తవ్యములయందు నిపుణుఁడు. అతఁడు పాండవులకు సాయపడఁదలచెను. వారణావతమునుండి పరుగెత్తి పోవలసిన దని వారికి సంకేత మొనర్చినాఁడు."

హస్తినాపురము నుండి వారణావతికిఁ బోవుచున్న పాండవులను సాగనంపుట కనేకులు వెడలిరి. వారందరు వెనుకకు సాగిపోవు వఱకును విదురుఁ డక్కడనే నిలచెను. గుంపు తగ్గిన వెనుక నాతఁడు యుధిష్ఠిరునకు సాంకేతికభాషలో రానున్న కష్టమును గూర్చి సూచించినాఁడు. యుధిష్ఠిరున కా భాష యర్థమైనది. ఆతఁడును సాంకేతికమైన భాషలోనే వాని కుత్తరమును దెల్పెను. రానున్న కష్టము నుండి తప్పించుకొందునని దెలిపెను. భారతమున పై సందర్భమున నిట్లున్నది. ధర్మజుఁడు దెల్పినాఁడు.

"పౌరేషు వినివృత్తేషు విదుర స్సత్యధర్మవిత్

..... ...... ...... .....

విజ్ఞాన మితి తత్సర్వం ప్రయుక్తో విదురో మయా!"

(భా. ఆ. ప. అ. 145)

"పాండవులను సాగనంప వచ్చిన జనులందరును మరలిరి. సత్యధర్మ విదుఁడైన విదురుఁ డంతవరకు నచ్చటనే యున్నాఁడు. అందరు వెడలిపోయిన మీద, కష్టముః రానున్నదని విదురుఁడు ధర్మజునకు సంకేత మొనర్చినాఁడు. ధర్మజున కా భాష యర్థమైనది. ఆతఁడును సముచితముగ నుత్తర మొసఁగెను. ఈ సన్నివేశమును జూచిన కుంతీదేవి జరిగిన విషయ మేమని కొడుకు నడగినది. అతఁ డామె కిట్లు బదులు సెప్పినాఁడు. "మీరు నివసింపఁబోవు గృహమున కగ్నిభయ మున్నది. కాని దానినుండి మీరు దప్పించుకొనుటకు గావలసిన యేర్పాటు లొనర్పఁబడును. మీరు వారణావతమునకుఁ బోయినప్పటి నుండియు యీ

రహస్యమును దెలిసికొన్నట్లు నటింపకుఁడు. అన్ని కష్టములును తీరును" అని విదురుఁ డనెను. నేనును సముచితముగ నాతనికి సమాధాన మొసఁగితి."

పాండవులు నిర్వికారముగ వారణావతమునకు జనుదెంచి లాక్షాగృహమున నివసింపఁదొడఁగిరి. ధర్మరా జా యింటిని రహస్యముగ బరిశీలించెను. అది లక్కయిల్లని దేలినది. విదురుని యాదేశము ననుసరించి యాతఁ డా విషయమున గుప్తుఁడై యుండెను. పురోచనుఁడు సేవామిషతో నొక్క నిముసము గూడ వీరిని వదలియుండెడి వాఁడు గాఁడు. యుధిష్ఠిరుఁ డిప్పుడు సాధించవలసిన కార్యములు రెండు! మొదటిది; తాము లాక్షాగృహము నుండి బయటపడవలయును. రెండవది; పాండవులు లక్కయింట నాశనమై పోయిరను భ్రాంతిని ధృతరాష్ట్రాదులకుఁ గల్పింపవలెను. యుధిష్ఠిరుఁడు భీమునితో ననుచున్నాఁడు.

"జుఘ్రాణోస్య వసాగంధం సర్పిర్జతువిమిశ్రితం

..... ...... ......

పౌరో వాపి జనః కశ్చిత్ తథా కార్య మతంద్రితైః!"

(భా. ఆ. ప. అ. 146)

"భీమా! యీ యింటి గోడలు జతువిమిశ్రితమైన వసాగంధమును సూచించుచున్నవి. నేయి గూడ దీనిలోఁ జేరినట్లున్నది. ఈ యింటి నగ్నిచే దహింపవచ్చును. కౌరవు లీ మాయోపాయ మొనర్చిరి. కాని, యీ విషయము మనకు దెలియనట్లే నటింపవలెను. ఇంగితములచేఁగాని దీనిని సూచింపరాదు. కాని, జాగ్రత్తగ మెలఁగ వలెను. దీనినుండి బయటపడవలెను. ఎవ్వరికిని దెలియకుండునట్లు దీనినుండి బయటి కొక సొరంగమును దయారుచేయుదము. దాని నుండి మనము బోవచ్చును. కాని, యీ గుప్తమార్గముయొక్క పొలకువ పురోచనున కే మాత్రమును దెలియరాదు. ఇతర నగరవాసులకును దెలియరాదు."

పాండవులు గుప్తద్వారమును త్రవ్వ నిశ్చయించికొన్నారు. ఈ పనిని రహస్యముగ సాధించుటెట్లు? వారి యీ కష్టమును విదురుఁడు దీర్చెను. భారతము నందలి యాఘట్ట మిది:

"విదురస్య సుహృ త్కశ్చిత్ ఖనకః కుశలో నరః

..... ...... ......

స తస్య తు గృహద్వారే వస త్యశుభధీ స్సదా!

(భా. ఆ. ప. అ. 147)

"విదురున కొక మిత్రు డుండెను. ఆతఁడు సమర్థుఁడైన ఖనకుఁడు. వాఁ డొక్కసారి రహస్యముగ పాండవులతోఁ గలిసెను. తాను సొరంగములఁ ద్రవ్వువాఁడ ననియు, విదురునియాజ్ఞచే రహస్యముగ కౌంతేయులకు సాయపడ వచ్చితి ననియు వాఁడన్నాడుఁ. ధర్మజుని యాజ్ఞచే వాఁడు లాక్షాగృహమునుండి యొక పెద్ద సొరంగమును దయారుచేసెను. ఈవిషయము పురోచనునకు దెలియ రాదని ఖనకుఁ డా గుప్తద్వారము యొక్క కవాటములను మూసి యుంచెను. దాని ద్వారములు భూమట్టముకే మట్టసముగా గుదిరెను. ఒకానొక యనుకూలసమయమున పాండవులు లక్కయింటికిఁ దామే నిప్పంటించిరి. పురోచనుఁ డందులో భస్మమైనాఁడు. ఆ యింటి కా రాత్రి యొక భిల్లకాంత యేతెంచెను. ఆమె కైదుగురు కొడుకులు. ఆ భిల్లకాంత మద్యపానముచే నొడలెఱుఁగక యుండెను. ఆమె గూడ నందులో దహింపబడినది. పాండవులు సొరంగమునుండి బయటఁబడిరి. కుంతిని భీముఁడు మోసికొన్నాఁడు. త్రోవలో వారి కొక నది యడ్డు దగిలినది. విదురుఁ డంతకుముందే యచట నావికులను సిద్ధపరచెను. వారు కౌంతేయులను నదిని దాటించిరి. పాండవు లెవరికిని గనుపడక యటనుండి నిష్క్రమించిరి. ఈ విషయము భారతమున నిట్లు గలదు.

"ఏతస్మి న్నేవ కాలే తు యథా సంప్రత్యయంకవా:

...... ...... ......

గంగా ముత్తీర్య వేగేన జగ్ముర్గూఢ మలక్షితా:

(భా. ఆ. ప. అ. 149)

"ఈ సమయమునకు ముందే నిశ్చయించికొన్న ప్రకారము విదురుఁడు దన మనుష్యులను నది కడ కంపియుండెను. పాండవులు వారిని గమనింపలేదు. నదిని దాటుటకు సాధ్యమగునా? కాదా? యని లోతు చూచుచుండిరి. పాండవులను గుర్తించి నావికులు వారి కడ కేతెంచి విదురు నాజ్ఞను దెలిపినారు. పాండవులు నావలలో నెక్కిరి. యంత్రయుక్తములై ధ్వజములు రెపరెపలాడుచున్న పడవలు గదలినవి. కౌంతేయులు నది నుత్తరించిరి. నావికులు సెలవు దీసికొన్నారు. పాండవులు రహస్యముగఁ దమ మార్గమును బట్టిరి. పాండవులు లాక్షాగృహమునుండి గడ్డకు వచ్చిరని, యెవరైన గ్రహింతురేమో యని విదురుని భయము. అతఁడా రహస్యము బయట పడకుండుటకై దగిన కట్టు దిట్టములన్నియు నొనర్చినాఁడు. భారతమున నీ శ్లోకము గలదు.

"ఖనకేన తు తేనైవ వేశ్మ శోధయతా బిలం
పాంసుభి: పిహితం తచ్చ పురుషై స్తై ర్న లక్షితం

(భా. ఆ. ప. అ. 150)

"విదురుఁడు దయారుచేయించిన సొరంగము వెంటనే మూసివేయింపబడినది. గుర్తు దెలియరాకుండున ట్లది పూడ్పింపఁ బడెను."

పాండవులు దగ్ధమైరన్న వార్త హస్తినావతిలోఁ దెలిసినది. ప్రజలు శోకసాగరమున మునిగిరి. కుట్రదారులకు గలిగిన యానందమునకు మేరలేదు. కాని యీ యానందమును వారు బయటబెట్టలేదు. ప్రజాదృష్టిలో నది యపరాధమని వారి భయము. ధృతరాష్ట్రుఁ డీ నటన నింకను చాతుర్యముగ నడిపించినాఁడు

పాండవులను దలఁచికొని యాతఁడు సభలో గోలుగోలున నేడ్చినాఁడు. పాండవుల శ్రాద్ధములు, తర్పణములు జరిగిపోయినవి. విదురన కీ రహస్య మంతయు దెలియునుగదా! అతఁడును దన యానందమును గన్పఱుపలేదు. ఏడ్చుచున్నట్లు నటించుచున్నవారితోఁ జేరి, తాను గూడ నేడ్చుచున్నట్లు నటించెను. భారతమున ధృతరాష్ట్రుని శోకమిట్లు వర్ణితము.

"అద్య పాండు ర్మృతో రాజా! మమ భ్రాతా మహాయశాః!

..... ..... ..... .....

విదుర స్త్వల్పశ శ్చక్రే శోకం వేదపరం హి సః

(భా. ఆ. ప. అ. 150)

"మహాయశుఁడైన పాండురాజా నాపాలికి నిజముగా నేఁడు చచ్చినట్లున్నది నా తమ్ముఁడు చచ్చినను వాని రూపురేకలు నేను కౌంతేయులలోఁ గనుచుంటిని. నేటి కా భాగ్యముగూడఁ బోయినది. ఇప్పుడే పరివారము వారణావతమునకుఁ దరలిపొండు. అత్యంత వైభవముగఁ గుంతికిని పాండవులకును శరీర సంస్కారము లొనర్పుఁడు." ఇట్లు విలపించుచు జ్ఞాతి బంధువులతోఁ గూడి ధృతరాష్ట్రుఁడు పాండవులకుఁ దర్పణాదికార్యములు జరపెను. బంధువు లందరును కౌంతేయులను దలఁచి దలఁచి యేడ్చిరి. అందరు విధి విహితముగ పాండవులకు సంస్కారము లొనర్చినారు. విదురుఁడు సత్యవేది. కాని, నిజముగ తనకు దెలియునని యాతఁడు బయటపడ లేదు. కొంతసే పతఁడును దుఃఖించినాఁడు. ఈ సన్నివేశముల కర్థమేమి?

రాజశక్తి మంత్రి శక్తులకు నడుమ ద్వంద్వయుద్ధ మేర్పడినది. ఆ యుద్ధమున రాజశక్తికిఁ బరాజయము గలిగినది.

# ధృతరాష్ట్రుని నటన

పాండవులు మరణించిరని విని గ్రుడ్డిరాజు నాఁడు సభలో విలపించెను. కాని యాతనిహృదయ మేమనుచున్నది. అతనికి నిజముగ శోకము గలదా? లేదు! అంతేగాదు! ఆ మనమునిండ నిబిడీ కృతమైన సంతోషము! ఈ విషయము మనకెట్లు దెలిసినది. ధృతరాష్ట్రుని మాటలతోనే! ఆ సన్నివేశ మిది! ద్రౌపదీ స్వయంవర సమయమున పాండవులు బయటఁబడినారు. ఈ విషయము నాతనికి విదురుఁడు దెలిపెను. ద్రౌపది పాండవులను వరించినదనియు నెఱుక పరచెను. ఆ యెఱుకపరచి నప్పుడు ధృతరాష్ట్రుఁడు పాండవుల నత్యంతముగఁ బొగడినాఁడు. ధృతరాష్ట్రుఁ డిట్లనెను.

"యథైవ పాండోః పుత్రాస్తు తథైవాభ్యధికా మమ
యథా చాభ్యధికా బుద్ధిః మమ తా న్ప్రతి త చ్ఛృణు!"
(భా. ఆ. ప. అ. 200)

"పాండవులు పాండుమహారాజుయొక్క పుత్రులు మాత్రమే గాదు. నా పుత్రులపై కంటెను వారిపై నాకు గొప్ప యాదరము గలదు. ఈ విషయము నీకు దెలియునో లేదో."

నాటి రాత్రి దుర్యోధన కర్ణు లాతేనికడకు జేరిరి. వారితో మంత్రాంగము జరగినది. అపుడు వారితో ధృతరాష్ట్రుఁడు తన చిత్త వృత్తి నిట్లు బయటపెట్టినాఁడు.

"అహ మప్యేవ మేతై స్త చ్చికీర్షామి యథా యువాం
రాధేయ! మాన్యసే యచ్ఛ ప్రాప్తకాలం వదాశు మే!
(భా. ఆది. ప. అ. 201)

"మీ యభిప్రాయములు నాకు బరమసమ్మతములు. కాని విదురునికడ నే నతిజాగ్రత్తగ మెలఁగుదును. నా కీ భావమున్న దని యాతని కెప్పుడు

దెలుపను. ముఖమున సూచింపను. అతనికి నా యభిప్రాయము దెలియనేరాదని నా యూహ. అందులకుఁ దగినట్లు విదురునికడ పాండవుల నెంతయో పొగడుదును. వారిపై ప్రేమయున్నట్లు నటింతును. కనుక, పాండవులను నాశ మొనర్చు యత్నమున, మీరెట్లు నిర్ణయించిన నా కది సమ్మతమే!" ఒకే దినమున విదురునితో నొకరీతిగను కర్ణాదులతో నొకరీతిగను భాషించిన ధృతరాష్ట్రుని హృదయ మెట్టిదో మీకు వేరుగఁ దెలుప నక్కఱలేదుగదా! తొలుత గ్రుడ్డిరాజు వారిని మాయోపాయమున మట్టుబెట్ట నెంచెను. అది సాధ్యము గాలేదు. యుద్ధముతో జయింతుమని ధృతరాష్ట్రునికి గలిగిన రెండవ యూహ! భీష్మ ద్రోణులే నిజముగ విక్రమించినచో వారి నెవ్వరూ జయింపలేరని ధృతరాష్ట్రునకు స్పష్టముగ దెలియును. కాని, పాండవులను నాశన మొనర్చు విషయమున భీష్మద్రోణు లెంతవరకు సమ్మతింతురో యని యాతనికి సందేహము! ఈ విషయము నాతఁ డొకసారి భీష్మునితో సన్నగా సూచించినాఁడు. అపుడు భీష్ముఁ డిట్లు జవాబు చెప్పెను.

"యథా ప్రభృతి దగ్ధా స్తే కుంతిభోజసుతా స్సుతాః
..... ..... ..... .....
యథా త్వాం పురుషవ్యాఘ్ర లోకే దోషేణ గచ్ఛతి!
(భా. ఆ. ప. అ. 203)

"కుంతి, పాండవులు వీరి మరణవార్త విన్న దినము నుండి నాకుఁ గన్నులు దిరిగి పోయినవి. చిత్త చాంచల్య మేర్పడినది. ఈ విషయమున ప్రజలు పురోచనుని గూడ నెక్కువ నిందించుట లేదు. నిన్నే ప్రధానదోషిగ వారు నిశ్చయించి యున్నారు. ఈ సంగతిని నేను వారినుండి గ్రహించితిని." ఇంతతో భీష్ముని కథ దేలిపోయినది. ఇఁకఁ గర్ణు నొక్కనినే నమ్ముకొని యుద్ధమునకు దిగునంతటి సాహసము ధృతరాష్ట్రునకు లేదు. తన హృదయములో నున్న భావముల నమాత్యులు గాని, ప్రజలు గాని పసిపట్టినచో తన్ను సర్వనాశన మొనర్తురను భయము గూడ

గ్రుడ్డిరాజునకుఁ గద్దు! పైగా నిప్పుడు పాండవులు ముందటివలె నసహాయులు గారు. క్రొత్తగ నేర్పడిన వివాహముతో వారికిఁ బాంచాలు రందరును బందుగులైనారు. యాదవులు దొలుతటినుండియు వారిని బ్రేమించువారు. ఇవన్నియు యోచించుకొని ధృతరాష్ట్రుఁడు వారిపై బ్రీతి నటింప మొదలు వెట్టినాఁడు. ద్రౌపదీ వివాహమైన వెంటనే వారిపై నెంతయో ప్రేమ గలవానివలె, విదురు నంపి పాండవులను హస్తినావతికిఁ బిలిపించెను. అపు డాతఁ డాడినమాటలు ప్రేమస్వభావ పరిణద్ధములై యున్నవి. కాని, యంతయు నటనే! కణికుఁ డుపదేశించిన నీతిలోనొక వాక్యమున్నది. హృదయము కత్తివాదరవలె నుండవలెను. పలుకుఁదనము మెత్తగ నుండవలెనని యాతఁడు నిర్దేశించెను. నవ్వుచునే రౌద్రకర్మము లొనర్పవలెననియు వాఁ డొనర్చిన మహోపదేశము. ఈ యుపదేశము గ్రుడ్డిరాజెంతయో జక్కగ ననుసరించినాఁడు.

## అర్ధరాజ్యము - దట్టివేసినాఁడు

ధృతరాష్ట్రుని యాజ్ఞానుసారము పాండవులు హస్తినావతికి వచ్చిరి. వచ్చిన వెంటనేవారికి న్యాయముగ రాజ్యము సంక్రమింప వలె ననుటలో నాశ్చర్యములేదు. అది వారికిఁ గ్రమప్రాప్తమైన యధికారము! లాక్షాగృహ నిర్మాణమునకు ముందే ధర్మరాజు యౌవరాజ్యమునం దభిషిక్తుఁడు. కనుక నేఁడు గూడ ధర్మజుఁడు యువరాజే! ఈ విషయ మంతయు ధృతరాష్ట్రునకుఁ దెలియును. తా నూరుకున్నచో రాజ్య మంతయు న్యాయము ననుసరించి ధర్మజునిదే యగునని యాతనిబాధ! అందుకై యాతఁ డొక గొప్ప తతంగమును బన్నినాఁడు. దాయాదులు బరస్పరము గలహించుకొను చున్నారనియు, దాని నాపవలెననియు ధృతరాష్ట్రుఁ డొక పెద్ద ప్రచారమొనర్చెను. అందు కుపాయము? రాజ్యము నాతఁడు విభాగించినాఁడు. అర్ధరాజ్యము పాండవుల కొసఁగి, తక్కిన యర్ధమును కుమారుల కొప్పఁ జెప్పెన

పాండవులను హస్తినావతి నుండి ఖాండవ ప్రస్థమునకుఁ బంపినాఁడు. ఒకచోట నున్న పోట్లాడుకొందురని యితని వాదము! కౌంతేయులు ఖాండవమున కేగిరి. అప్పు డది యంతయు నొక గొప్ప యరణ్యము. పాండవు లచట నొక నగరము గట్టవలెనని తీర్మానించికొన్నారు. ఈ యుపాయముతో ధృత రాష్ట్రుఁడు గృతకృత్యుఁడయ్యెను. కురుజాంగలము వంటి సమృద్ధమైన ప్రాంత మాతనికి దక్కినది. సువ్యవస్థితమైన రాజ్యమంతయు నతనిదై పోయెను. పాండవు లిఁక మొదటినుండి రాజ్యమునకు శ్రీకారము జుట్టవలెను. ఈ విషయము భారతముననే గలదు.

ధృతరాష్ట్ర ఉవాచ:

"భ్రాతృభి స్సహ కౌంతేయ! నిబోధ వదతో మమ

..... ..... ..... .....

నగరం మాపయామాసుః ద్వైపాయనపురోగమాః!

(భా. ఆ. ప. అ. 207)

పై శ్లోకముల యర్థ మిది. ధృతరాష్ట్రుఁ డన్నాడు.

"ధర్మజా! నా మాటలను సావధానముగా వినుము. దాయాదులైన మీరు పలుమారు గలహించుకొనుట నా కిష్టము లేదు. మీరు ఖాండవ ప్రస్థమున నుండుట నా యభీష్టము! అచ్చట నున్నచో, మిమ్మెవరును బాధింపనేరరు. సర్వసంకటముల నుండి యర్జునుఁడు మిమ్ము రక్షింపగలఁడు. వాఁడు సమర్థుఁడు. దేవేంద్రుఁడు దేవతలను రక్షించినట్లు మిమ్ము వాఁడు రక్షించును. మీ కర్ధరాజ్య మొసంగు చున్నాను. ఖాండవమున కేఁగుఁడు."

ధర్మరా జత్యంతవినీతుఁడు. ఈ మాటల కాతఁడు సమ్మతించెను. వినయముతో నాతఁడు తండ్రికి నమస్కరించి శ్రీకృష్ణసహితుఁడై తమ్ములతో

పరివారముతో ఖాండవారణ్యమునఁ బ్రవేశించినాఁడు. అనంతరము వ్యాసాదుల యాదేశానుసార మతఁడు నగరరచనార్థమై భూమిని శుభ్ర మొనర్పజేసెను. దానిని కొలిపించెను.

కులద్వేష మను మిషతో ధృతరాష్ట్రు డర్ధరాజ్యమును సులభముగఁ గొట్టివేసినాఁడు. కణికుని యుపదేశము నాతఁడు సమర్థతో నిర్వహించెను. కాని దైవ మందుకు విరుద్ధముగ నున్నాఁడు. రాజనీతి విశారదుఁడైన కృష్ణుఁడు పాండవులకు రక్ష! ధృతరాష్ట్రుఁ డనుసరించిన కపటనీతినే యాశ్రయించి కృష్ణుఁడు ధృతరాష్ట్రుని పన్నాగములఁ గట్టించినాడు.

## మోసము తనపైకే వచ్చినది

చీకురా జర్ధరాజ్యమును బంచి యిచ్చుటలో నెంతయో మాయా దక్షతను బ్రకటించినాఁడు. కాని, యది కౌంతేయుల కొక యుపకారముగనే బరిణమించినది. పాండవులు హస్తినావతియందే యున్నచో ధృతరాష్ట్రుఁడు బ్రతికియున్నంతవఱకును ధర్మజుఁడు యువరాజే! సౌమ్యుఁడైన ధర్మజుఁడు తండ్రిని సింహాసన మడగడు. ధృతరాష్ట్రుఁ డివ్వఁడు. దాని ఫల మేమగును? పాండవులు కష్టపడి సంపాదించిన విజయము లన్నియు ధృతరాష్ట్రునకే యగును. కపటియైన కురురాజున కింతటి కీర్తి యబ్బుట కాలమున కిష్టములేదు. ధర్మరాజు జీవితమున వైభవములఁ దొంగిచూచు సుయోగ మేర్పడినది. ఖాండవమున కేఁగుటతో పాండవులు పూర్తి స్వతంత్రులైరి. ధృతరాష్ట్రుని రాజ్యముతో వారి కే సంబంధము లేదు. వారు సాధించుకొను వైభవములు వారికే! పాండవులు బాహుబలముచే దిగ్విజయము లొనర్చిరి. కృష్ణుఁడు వారికిఁ బలుకుతోడు. వారి రాజ్యము బెరిగినది. బంధు జనులలో వారు ముఖ్యులైనారు. యుక్తితో కురుజాంగులము సాధించి కృతార్థుల మైతి మనుకొన్న దుర్యోధనాదులు జూచుచుండ గనే ధర్మరాజు భారత చక్రవర్తి యైనాఁడు.

పాండవుల రాజ్యముపై ధృతరాష్ట్రునకు గవ్వ యధికారము లేదు తాను చూచుచుండగనే వైభవశిఖరముల నందికొన్న పాండవులపై దుర్యోధనున కసూయ ముమ్మరమైనది. యుధిష్ఠిరుని ఖడ్గముతో జయించుట యసాధ్యమని దుర్యోధనుఁడు నిశ్చయించెను. ఇఁక నెట్లు గెలుచుట? దుర్యోధనుఁడు జూదమాడదలఁచినాఁడు. ధృతరాష్ట్రుఁడు గూడ నందులకు సమ్మతించెను. వానిని బ్రధానముగ బీడించుచున్నది రాజ్యలోభము. రెండవది పుత్త్రలోభము. విదురుఁ డిందున కెదురుదిరిగెను. కాని, యా మంత్రిని మన్నించిన వా రెవ్వరును లేరు. విదురుని యిచ్ఛకు విరుద్ధముగ పాండవు లాహ్వానింపఁ బడిరి. ధృతరాష్ట్రుఁ డపుడు సమ్మతింపకున్నచో జూదము జరిగెడిది గాదు. బలవంతులను జయించుటకు మాయోపాయ మొక్కటే మందని వైచిత్రవీర్యుఁ డెరుగును. యుద్ధమున జయము గల్గునో లేదో యెవ్వరును జెప్పలేరు. పాండవు లందరూ అసాధారణమైన బలవంతులు. ఇఁక జూదమున జయము నిక్కము. ఇన్ని యాలోచనలతో [illegible]రాజు పాండవులను జూదమునకై బిలిపించినాఁడు. ఈ కార్యమునకు విదురుఁడే బోవలసివచ్చినది. విదురునితో ధృతరాష్ట్రుఁ డన్నాఁడు.

"నేహ క్షత్తః కలహోస్తప్యతే, మాం న చే దైవం
ప్రతిలోమం భవిష్యత్
..... ..... ..... .....
క్షిప్ర మానయ దుర్ధర్షం కుంతీపుత్రం యుధిష్ఠిరం ।
(భా. స. ప. అ. 57)

"విదురా! దైవమే ప్రతికూలముగ నున్నది. కుల వినాశనమున కిది మూలమని యెఱుగుదును. కాని విధిలేదు. ఈ జగమంతయు దైవమునకు స్వాధీనమైనది. ఎవ్వడును స్వతంత్రుఁడు గాఁడు. కనుక నీవు వెంటనే బోయి నా యాజ్ఞగా కుంతీ పుత్త్రుల నిటకు దోడితెమ్ము!"

## జూదము ధృతరాష్ట్రున కిష్టములేదా?

విదురభీష్ములవలె ధృతరాష్ట్రుఁడు జూదమునకు ముమ్మాటికిని విముఖుఁడు గాదు. గూఢముగ నాతని కది సమ్మతమే! యుధిష్ఠిరుఁడు ద్రౌపది నొడ్డెను. ఒడ్డి యోడిపోయినాఁడు. శకుని విజయగర్వమునకు మేర లేకపోయినది. వాఁడు మాటిమాటికిని మదముతో గర్జించు చున్నాఁడు. సభయంతయు "ఛీ ఛీ" యనుచున్నది. భీష్మ ద్రోణాదులు భయకంపితులై చలించి పోవుచున్నారు. విదురుఁడు శవమువలె నిశ్చేష్టుఁ డైనాఁడు. ఈ సమయమున ధృతరాష్ట్రుఁ డెట్లున్నాఁడు? వాఁ డానందముతో మాటిమాటికిని విదురుని వీఁపు దట్టుచు "ఎవరు గెలిచిరి? ఎవరు గెలిచిరి?" యని యడుగుచున్నాఁడు. ధృతరాష్ట్రు డెంత కపట నటనాదక్షుఁడైనను ఆ సమయమున వాని భావగోపనము సాధ్యముగాలేదు. సులభముగ సకలరాజ్యమును చేత జిక్కెనను యానందమును వాఁడు దాఁచికొనలేక పోయినాఁడు. ద్రౌపదిని గెల్చికొన్నందుకు సంతోషపడిన వ్యక్తులెందఱుగురే! వారిలో గూడ మిక్కుటముగ సంతోషపడినవాఁడు ధృతరాష్ట్రుఁడు. వాడా సమయమున నిట్లనెను.

"ధృతరాష్ట్రస్తు తం హృష్టః పర్యపృచ్ఛ త్పునః పునః

..... ..... ..... .....

జిత మిత్యేవ తా నక్షాన్ పునరేవాన్వపద్యత

(భా. స. ప. అ. 65)

ఆనందితుఁడైన ధృతరాష్ట్రుఁడు మాటిమాటికి "ఏమి గెలిచిరి? ఎవరు గెలిచిరి?" యని యడుగ నారంభించెను. వాఁ డానందమును దాచికొనలే పోయినాఁడు. కర్ణున కత్యంత సంతోషము గలిగినది. దుశ్శాసనుని యానందమునకు మేరలేదు. ఈ సన్నివేశమున సంతోష పడిన వారైదుగురే. వారు ధృతరాష్ట

దుర్యోధనులు, కర్ణ దుశ్శాసన శకునులు. వీరుదప్ప తక్కిన యందఱును బిగ్గరగ నేడ్చిరి. జయోద్రిక్తుఁడైన శకుని మాటిమాటికి "గెలిచితి! గెలిచితి" నని యరచు చుండెను. అనాయాసముగఁ బ్రాప్తించిన రాజ్యముతో ధృతరాష్ట్రున కెంతయో ముదము గలిగినది. ఈ సంపద కంతయు దుర్యోధనుఁ డేక యధికారి యగునని ధృతరాష్ట్రుఁడు వాని యదృష్టమున కెంతయో మురిసెను. వాని హృదయము పాండవుల విషయమున యొక శిలయై పోయినది. లోపల యున్న యశుద్ధరక్తము దాగదు. అది యెట్లో యొకరీతి బయటఁబడును. రోగ రూపమున నది గడ్డకు వచ్చును. ధృతరాష్ట్రుని స్థితి గూడ నట్లేయుండెను. వాని యానందము లోన నిముడలేదు. అప్పుడప్పు డది గడ్డకు వచ్చుచునే యుండెను. ధృతరాష్ట్రుని యానందమును విదురుఁడు పసిగట్టినాఁడు. అతఁ డన్నకు నీతిజెప్ప నారంభించెను. లోభాంధుఁడైన ధృతరాష్ట్రుఁడు నీతులను వినునా? వాఁడు విదురు నూరు విడిచి పొమ్మనెను. ఈ ప్రకరణము భారతము వనపర్వమున నిట్లున్నది.

> "ఏతద్వాక్యం విదుర యత్తత్ సభాయా మిహ ప్రోక్తం పాండవాన్
> ప్రాప్య మాంచ ..... ...... .....
> ..... ..... ..... .....
> ఏతావ దుక్త్వా ధృతరాష్ట్రోఽన్వపద్యదంతర్వేశ్మ
> సహసోత్థాయ రాజన్. (భా. వ. ప. అ. 4)

"విదురా! యీ పలుకులు పాండవసభలో నాడిన బాగుండును. అక్కడ నాడితివని గూడ వింటిని. అట్లే నా యెదుట గూడ నీవు బలుకజొచ్చితివి. నీ వెప్పుడును పాండవులకే హిత మెంతువు! నా కుమారులు నీ పాలి కహితులు. నీ వాక్యముల వలన నాకుఁ దోఁచు నర్థమింతే! కనుకనే నీవు నా కహితములైన వచనములను మాటి మాటికి నాయెదుటనే నుడువుచున్నావు. పాండవుల కొఱకునై

నేను నా కుమారుని వదలుకోఁగలనా? కౌంతేయులు నాకు పుత్త్రసమానులే గావచ్చును. కాని దుర్యోధనుఁడు నేరుగా నా రక్తమును బంచికొని పుట్టినవాఁడు. ఇతరుల మంచికై యెవ్వఁ డైనను దన దేహమును గోసికొన యత్నించునా? నీవేమో దిన దినమును నా కహితముగఁ జెవి నిల్లు గట్టికొని పోరెదవు. నేను నిన్నింతవఱకు నమ్మితిని. వ్యర్థముగ నిన్ను గౌరవించితిని. ఇఁకమీఁద నట్లు జరుగదు. నీకిష్టమైనచో నిట నుండవచ్చును. కాకున్న వెడలి పోవచ్చును. ఎంత బోధించినను వ్యభిచారిణి పతివ్రత యగునా? నీవును నట్టివాఁడవే!" ఈ మాట లనుచూ ధృతరాష్ట్రుఁడు కోపముతో నంతఃపురములోనికిఁ బోయెను.

పై మాటలవలన ధృతరాష్ట్రుని చిత్తవృత్తి యెట్టిదో స్పష్టముగఁ దెలియుచునే యున్నది. కౌరవులు జూదముతో నాగినారా! ద్రౌపది జుట్టుపట్టి యీడ్చికొని వచ్చిరి. నిండు సభలో వస్త్రాపహరణము జరగెను. దుర్యోధనుఁడు తొడఁదట్టి జూపెను. ఈ సన్నివేశము లన్నియు కురురాజు నెదుట జరిగినవే! వీని నాతఁడు నిల్పుటకై యత్నింపలేదు. ఆతఁడు దలఁచికొన్నచో నీ దురాచారముల నరికట్ట గలఁడు. ఆతఁ డడ్డగింపలేదు సరిగదా! అపరిమితమగు నానందముతో వీని నన్నిటిని సాగిపోనిచ్చెను. ఈ దురాచారముల నాపుట కతఁ డేమియు కష్టపడవలసినది లేదు. ఆతని యొక్క మాట జాలును. దీనివలనఁ దెలియునదేమి? సాక్షికముగ నివియన్నియు ధృతరాష్ట్రునకు సమ్మతములే! కడకు గాంధారి యంతఃపురమునుండి గడ్డకు వచ్చినది. భారతములోని యా వర్ణన మిది.

"తతో గాంధారీ విదుర శ్చాపి విద్యాం స్త ముత్పాతం
ఘోర మాలక్ష్య రాజ్ఞీ
నివేదయామాసతు రార్తవ త్తదా తతో రాజా వాక్య
మిదం బభాషే: (భా. స. ప. అ. 91)

“అనంతరము గాంధారీ విదురులు కల్లోలమున గలుగ జేసికొనిరి. వారీ దురాచారము నాపవలసినదని ధృతరాష్ట్రు నెచ్చరించినారు. ఆతఁ డాజ్ఞ యొసఁగెను. ఆ ప్రకరణ మంతతో ముగిసినది. ఇంత కథ జరిగినపుడు ధృతరాష్ట్రునకుఁ గొంత భయమే యైనది. ఆయన దన త్యాగమును బ్రదర్శింప నెంచెను. గెలిచికొన్న రాజ్యమును మరల వారికి వెనక కిచ్చినాఁడు. దుర్యోధనుఁ డంతతో వదలునా? తండ్రి కొడుకులకు మంతనములు సాగెను. ధృతరాష్ట్రుఁ డొనర్చినది పొరపాటని దుర్యోధనుఁడు హుంకరించినాఁడు. ధృతరాష్ట్రుఁడు మరల నొకసారి పాండవుల జూదమున కాహ్వానించెను. ఈ యాహ్వానము తండ్రి కొడుకులకుఁ దప్ప మరెవ్వరికిని సమ్మతము గాదు.

## ధృతరాష్ట్రుని వ్యవహార దక్షత

ధృతరాష్ట్రుఁ డెంతయో సూక్ష్మబుద్ధి గలవాఁడు. ఆతని ప్రతిభ కందరి యెత్తులును గ్రిందే! ధృతరాష్ట్రుని యీ బుద్ధికుశలత ఉద్యోగపర్వమున నడుగడుగునను గన్పడును. అందులో నొక ఘట్టము ద్రుపద పురోహిత రాయబారము. రాజులు పరస్పరము దమ కార్యములు సాధించుకొనుటకై దూతల నంపెడువారు. బుద్ధి మంతులైనవారినే దూతలుగాఁ బంపుచుండిరి. దూతలు దూరాలోచనాపరులు. వీరి పని రాజంపిన సందేశమును వివరించుటమాత్రమే గాదు. ఇంకను గొన్ని సమర్థములైన పనులను వీరు నిర్వహించు చుండిరి. పాండవుల వివాహమైన వెంటనే ద్రుపదుఁడు వారికి బంధువై నాఁడు గదా! ఆతని పురోహితుఁడు దీర్ఘదర్శి; ప్రతిభాశాలి. ధృతరాష్ట్రు నర్ధరాజ్య మడిగిరమ్మని పాండవు లాతని పెద్దతండ్రి కడ కంపిరి. అతనితో ద్రుపదుఁడు మఱికొన్ని విశేషములగూడ నెఱిఁగించెను. అవి యీ క్రిందివి:

"మనాంసి తస్య యోధానాం ధ్రువ మావర్తయిష్యతి
విద్యమానేషు చ స్వేషు లంబమానే తథా త్వయి
(భా. ఉ. ప. అ 116)

"బ్రాహ్మణశ్రేష్ఠ! నీ విక్కడనుండి బయలుదేరిపోయి, కౌరవులలో భేదమును గల్పింప యత్నింపుము. విదురుఁడు గూడ నీకు సాయపడును. భీష్మ ద్రోణ కృపాచార్యాదుల మనస్సులను కౌరవుల యెడ విముఖములుగ నొనర్పుము. వీరిలో పరస్పరము భిన్న భావములు మొలకెత్తినపుడు మఱల వారి నందరిని నొక కొలికికి గొనివచ్చుటకు కౌరవులకుఁ గొంతకాలము పట్టును. అంతలోఁ బాండవులు సర్వప్రయత్నములతో సైన్యములఁ జేర్చికొందురు. యుద్ధపు ఖర్చులకుఁ గావలసిన ద్రవ్యమును గూర్చికొందురు. కౌరవులెంత యాలస్యముఁ జేసిన మన కంత సుకరము."

ధృతరాష్ట్రుఁ డావులించిన ప్రేవులు లెక్కబెట్టువాఁడు. ద్రుపద పురోహితుని వంటి సమర్థుడైన రాయబారి యెందుకరుదెంచు చున్నాఁడో యాతఁ డాకళించికొనెను. ఆ ప్రయత్నములను విఫలము లొనర్చుటకై గాఁచికొన్నాఁడు. ద్రుపద పురోహితుఁడు వచ్చిన వెంటనే యేమియు నాలస్యము చేయక రాజాతనికి దర్శన మొసఁగెను. ప్రేమ ముట్టిపడ నాతనితో సంభాషించెను. తాను తొందరలో పాండవుల కడకు రాయబారి నంపుచున్నానని సమాధాన మొసఁగి యాతనిని వెనుకకుఁ బుత్తెంచినాఁడు. ద్రుపదరాజెంతయో యాలోచించి వేసిన పథకము ధృతరాష్ట్రునెడ దమ్మిడీకిఁ గొఱగాలేదు. ఆతఁడు ద్రుపద పురోహితునితో నీ రీతి వాక్రుచ్చెను.

"చింతయిత్వా తు పార్థేభ్యః ప్రేషయిష్యామి సంజయం
..... ..... ..... .....
సభామధ్యే సమాహూయ సంజయం వాక్య మబ్రవీత్.
(భా. ఉ. ప. అ 21)

"విప్రోత్తమా! మీ రాయబారమును మేము వింటిమి. శీఘ్రముగనే మా దూతయైన సంజయుని పాండవుల కడ కంపుచున్నాము. నీ విఁక నాలసింపక కౌంతేయుల కడఁకు బొమ్ము!" ఈ రీతిగఁ బల్కి, ద్రుపద పురోహితుని సత్కరించి ధృతరాష్ట్రుఁడు వెన్కకంపినాఁడు.

## ధృతరాష్ట్రుని మాయ

ఆ రాత్రి ధృతరాష్ట్రుఁడు సంజయునితో వివరములు మాటాడెను. ఆతనికి పాండవులతోఁ జెప్పవలసిన విషయము లన్నియు నెఱిఁగించెను. పెద్ద తండ్రికి ధర్మరాజు చిత్తవృత్తి బాగుగ దెలియును. ధర్మజుఁడు దయావంతుఁడు. ఆ గుణము నవకాశముగఁ జేసికొని ధృతరాష్ట్రుఁడు ధర్మరాజును నాశనమొనర్పఁ దలచెను. విక్రమ భాషణములతో వీరులైన పాండవులు లొంగరు. ఇఁక న్యాయమును వచించి ధర్మరాజును లోఁబఱచుకొనుటయు సాధ్యముగాని పని. కౌరవుల దన్యాయమనియు పాండవులది ధర్మమనియు లోకమంతకుఁ దెలియును. ముఖ్యముగ ధృతరాష్ట్రునకును దెలియును. పాండవులకు యుద్ధము సమ్మతము గాదనియు ఆపద్ధర్మముగనే వారు దానిని స్వీకరించుచున్నారనియు ధృతరాష్ట్రునకు దెలిసినదే! కులనాశము కౌంతేయుల కే మాత్రము సమ్మతముగాని పని! యుద్ధము తప్ప మఱియే యుపాయమున నైనను కార్యము సాధింపఁబడునో వారందులకు సిద్ధము! వారి యీ యభిప్రాయము లన్నియు ధృతరాష్ట్రునకు స్పష్టముగఁ దెలియును. ఈ గుణములనే యవకాశపఱచికొని ధృతరాష్ట్రుఁడు వారిని నాశనమొనర్పఁజూచినాఁడు. వారిచేతితో వారి కన్నునే బొడిచినట్లు! సంజయున కాతఁ డీ విషయము లన్నియుఁ జెప్పెను. పాండవుల కడ నాతఁ డెంతయో జాగ్రత్తగ మాటాడవలెనని బోధించినాఁడు. సంజయుఁడు కురురాజునకు తగిన దూత! వాఁడు కౌటిల్యముయొక్క స్వరూపము. ఆనాటి నుండి లోకమున

"సంజయుని మంచితన" మను సామెత యేర్పడినది. సంజయుఁడు ధృతరాష్ట్రుడు పంపిన వర్తమానము నెంతయో పక్వముగఁ బాండవులకు వినిపించినాఁడు. పాండవసభలో సంజయుఁ డన్నమాట లివి.

శమం రాజా! ధృతరాష్ట్రోఽభ్యనందన్నయో జయ, త్వరమాణో
రథం మే ..... ..... ..... .....
ఏత ద్రాజ్ఞో భీష్మపురోగమస్య మతం యద్యః శాంతి రిహోత్తమా
స్యాత్ : (భా. ఉ. ప. అ. 25)

సంజయ ఉవాచ:

"ధర్మనీత్యా పాండవ! తేని చేష్టాలోకే శ్రుతా దృశ్యతే చాపి పార్థ!
..... ..... ..... .....
అపక్రామేః సంప్రదాయైవ తేషాం మాగాస్త్వం వై దైవయానాత్
పథోద్య. (భా. ఉ. ప. అ. 27)

సంజయుఁడు పాండవులతో ననుచున్నాఁడు. "ధృతరాష్ట్రునకు సంధి యెంతయో ప్రియమైనది. అందుకే యాతఁడు నన్నిట కంపెను. కౌరవ పాండవులు తమలోఁ బొంది పొసఁగి మనవలెనని మీ పెద్దతండ్రి హృదయపూర్వకముగ వాంఛించుచున్నాఁడు. నీ ధర్మనిష్ఠ, దయాశీలత, అకాపట్యము, అక్షుద్రత మొదలైన గుణము లాతఁడు చక్కగా యెఱుఁగును. మీరెన్నఁ డకృత్యము లొనరింపరని, దానశీలురని, నిశ్చయాత్ములనియు మిమ్మెపుడు సభలలో నాతఁ డగ్గించుచుండును. తన కొడుకులకన్న మీరెన్నియో రెట్లు సుగుణవంతులు అని ధృతరాష్ట్రుని విశ్వాసము. ఇంతమాత్రమే గాదు, మీకున్న సైన్యబల మమూల్యమైనదని యాతనికిఁ దెలిసినదే! కాని, సద్గుణములకు మూల స్తంభములైన మీ చేయి మీదుగా యే హీనకార్యములైన నడచినచో నది మీకు గాదు. లోకమునకు గొప్ప దురదృష్టము. ధర్మము నాదరింపవలసినవారు లోకమున మీరు గాక మఱెవ్వరు? కౌరవులు

హీనకార్యము లొనర్చుటలో నాశ్చర్యములేదు. వారి స్వభావ మందరకు దెలిసినదే! రన్యాయ మొనర్చినను లోకము దానికి గొప్పగా వెలకట్టదు. శుభ్రమైన వస్త్రముపైననేకొంచెము మరక యేర్పడినను ఆ మరక యెంత చిన్నదైనను అది యందరి దృష్టి నాకర్షించును. స్వభావమలినమైన వస్త్రమునందెంత మాలిన్యమున్నను దాని నెవ్వరు గమనింపరు. పాండవులు శుభ్రవస్త్రమువంటివారు. ఈ మాటలు నేను గాదు, ప్రపంచమే యనుచున్నది. కనుక ధార్మికులకు మూర్ధన్యశిరోమణులైన మీవంటివారినుండి యే చిన్న దొసఁగు గలిగినను దానిని ప్రపంచ మనేక రీతుల వ్యాఖ్యానించును. ధీరోదాత్తులైన మీరు దాని కవకాశమొసఁగరాదు"

యుద్ధ మనగా సామాన్యము గాదు. అది మహాభయంకరము. యుద్ధమైనచో సర్వనాశనము తప్పదు. యుద్ధమునకుఁ గారణ భూతులైనవారికి యీ లోకమున గొప్ప యపకీర్తి గలుగుట మాత్రమే గాదు, పరలోకమునను ఘోరనరకయాతన వారి కొఱకై గాఁచియుండును. యుద్ధరంగమునందు జరగు ఘోరములకు నన్యాయములకు మితి యుండదు. ఇంతటి ఘోరములతో సాధించిన జయముగూడ నత్యంతజాగుప్సాకరమై ధీరహృదయములకు పరాజయమువంటిదిగనే భాసించును. కనుక నిట్టి కార్యము లొనర్చుటకు విజ్ఞులైనవారు తెలిసి తెలిసి పూనుకొందురా? కౌరవ కులము నిట్టి యపాయమునుండి తప్పించువా రెంతయేని ధన్యులు. ప్రాణములను పణములుగ నొడ్డియైనను నిలుపవలసినంతటి గొప్ప చేటిది. మీరు శత్రువు లని దలఁచుచున్న కురునందనులు మీకుఁ బగవారు గారు. మీ వంశమున మీ రక్తమును బంచికొని పుట్టినవారే! వారిని వధించి మీరు విజయము సాధించికొన్నను వారు లేక మీరు జీవించుట మీ మనస్సులకు భయంకరముగఁ దోఁచును. పుత్రులను, మిత్రులను, బంధువులను జంపి మీ రేమి సాధింపగలరు? ... 

మీకు బలము తక్కువనిగాదు. కృష్ణునివంటి రాజకీయవిదులు సాత్యకివంటి మహాయోధులు మీకడ నున్నారు. ధృష్టద్యుమ్నుని వంటివాఁడు సేనాపతియై నడపించుచుండ మీతో నెదిరి దేవసైన్యసహితుఁడైన యింద్రుఁడును జయమును సాధించికొనలేఁడు. ఇఁక నా వైపు జూతమా! భీష్ముఁడు, ద్రోణుఁడు. అశ్వత్థామ, కర్ణుఁడు, శల్యుఁడు, కృపాచార్యుఁడు వీరొక్క రొక్కరే సమస్త ప్రపంచమును జయింపఁజాలుదురు. పైగా దుర్యోధనుఁడే స్వయముగ మహాయోధుఁడు. ఇట్టివారి వైపు దేరి చూచుటకు దేవతలకు సాధ్యమగునా? నాకు జూడ నిందులో మీకుఁ గలుగు జయముగాని పరాజయముగాని యొక్కటే! స్వార్థము నొక్కదానినే దృష్టిలోఁ బెట్టికొని యధర్మబహుళములైన యుద్ధములు సాగించి జ్ఞాతివధ మొనర్చుట మీవంటివారు జేయదగిన పనిగాదు. ఎవరో హృదయ హీనులైన రాక్షసులు జేయఁదగిన పని! "పాండవులు ఎన్నడు నిట్టి ఘోరకార్యమునకుఁ బూనికొనరు" అను విశ్వాస ముండఁబట్టియే ధృతరాష్ట్రుఁడు నన్నిట కంపెను. నేను శ్రీకృష్ణునకును పాంచాలురకును ద్రుపదరాజునకును చేతులు జోడించి మనవిసేయుచున్నాను. ఇఱుదెఱఁగులకును క్షేమకరమైన పద్ధతినే వా రనుసరింప వలెనని నా మనవి. యుద్ధరూపమైన సర్వనాశనమునకు వారు పాండవులను బ్రేరేపింపరాదు. నా మనవిని కృష్ణుఁ డాదరించునను విశ్వాసము నాకున్నది. అర్జునుఁడు గూడ నా యెత్తికోలును మన్నించు నను నమ్మకముతో నిక్కడికి వచ్చితిని. ప్రత్యేకముగ ధర్మరాజును గుఱించి నే నొనర్చు మనవి యిది. మీ పేరునందే ధర్మపరుఁడను నర్థమున్నది. మీవంటివారు యుద్ధ మొనర్పరాదు. లోకము మిమ్ము ధర్మరాజని ప్రశంసించుచున్నది. ఈ ప్రశంస కన్యథాత్వము గలుగరాదని నేను మిమ్ము వేడికొందును. జీవనము పవిత్రమైనది. శ్రేష్ఠమైనది. దానిని నాశన మొనర్చికొనుట మహా పాపము. యుద్ధ మొనర్పక కౌరవులు మీ దాయభాగ మివ్వ సమ్మతింపకున్నచో భిక్ష యొనర్చికొని బ్రతుకుటయైనను

మీ పాలిటికి ధర్మము! అంతే గాని మీవంటి ధర్మపరులు యుద్ధరూపమైన పాపమున కొడిగట్టరాదు. జీవితమే చంచలము! అందున దుఃఖము లనేకములు! సుఖ భాగ్యమత్యల్పము! ఇట్టి చంచలమైన జీవితముకొఱకై మహాపాపము నార్జించికొనుట, కీర్తి కళంకిత మొనర్చికొనుట పాండురాజు సుతులవంటివారు చేయఁదగిన పని గాదు. రాగమే మనుష్యునకు భయంకరమైన శత్రువు. అదియే ధర్మమునకు విఘ్నము. మీరు శత్రువులను జయించుటకంటెను రాగమనెడు రోగమును నాశన మొనర్చుటయే నిజమైన విజయము. తృష్ణను జయించినవానికి శత్రు లెవ్వ రుందురు? అపుడు మీ కీర్తి చంద్రసూర్యులవలె జగత్తునఁ బ్రకాశించును. సంపదలయందలి తృష్ణయే సర్వదుర్మార్గములకును బ్రేరకము. దీని కెవ్వఁడు లోఁబడెనో వాని కిఁక ధర్మము లేదు. దీనికి లోఁబడనివానికి ధర్మము సదా సన్నిహితము. తృష్ణకు లోఁబడిన వాఁడొనర్పని దుర్మార్గ ముండదు. దాని ఫలమేమి? లోకమున శాశ్వతమగు నింద. మీ ధర్మబుద్ధి లోకమున ప్రసిద్ధమై యున్నది. సూర్యుని వెలుఁగువలె సర్వదా మెఱయుచున్నది. దానిని మీరు నాశన మొనర్పరాదు. అధర్మమున సర్వప్రపంచమును సాధించినను దానివలన కలుగు ఫలము కడకు క్లేశమే! ఇహమున మన మొనర్చు పని పరమున సత్ఫలమును సంపాదించునదిగ నుండవలెను. పరలోకమున కర్మ మొనర్చుటకే వీలులేదు గదా! ఇంతవఱకును మీరు పుణ్య సంపాదకములైన కార్యములనే యొనర్చుచు వచ్చితిరి. అందుకే మిమ్ము మహాత్ములుగూడ శ్లాఘించుచున్నారు. అట్టివారు హఠాత్తుగ నేఁడు యుద్ధమువంటి పాపకర్మము సేయుటకు దొరకొన్నచో నంతకన్న నాశ్చర్యముండదు. వనవాసక్లేశముల కోర్చితిరి. అజ్ఞాతముగ బ్రతికితిరి. విక్రమప్రదర్శనమే మీకుద్దిష్టమైనచో నింత పని యెందుకొనర్చితిరి? అంతకుముందదే యుద్ధమునకుఁ బూనికొనియుండవచ్చునే! కాని, ధర్మమునకై యీ సిలుఁగుల నన్నిటిని బడితిరి. ఆ మార్గము నిప్పుడు తప్పుట మంచిదేనా? ఇప్పుడు మీకున్న బంధుజాలమంతయు

మీకప్పుడు గూడ నుండెను. కృష్ణుఁడు సాత్యకి, విరాటుఁడు, ద్రుపదుఁడు మొదలగు వారందరు నాఁడు గూడ మీ బంధువులే! మీ రగ్గిని పుడిసలింతమన్నను కానిమ్మను వారే! నాఁడే కృష్ణార్జునులు గలసి పరబలముల నెందుకు వధింపలేదు. మీ రింతవఱకును దుర్యోధనాదులను బెరుగనిచ్చితిరి. వారు క్రమ క్రమముగ సైన్యసంపత్తిని నొడగూర్చికొనిరి. మీ కష్టములన్నియు జూచి మీ బంధువులెంతయో దుఃఖించిరి. ఇన్నికష్టము లేల యనుభవించితిరి? మీ దృష్టిలో వీని యన్నిటికంటెను, ధర్మము గొప్పది గనుక అట్టి మీరు నేఁడు చేతులార నా ధర్మమునే బలిపెట్టఁదగునా?

ఇప్పుడు యుద్ధము జరగినచో, దానివలన లోకశాంతి గలుగదు. ధర్మము నిలువదు. ధర్మరాజన్న పేరు నేతిబీరకాయయైపోవును. నీ వట్టి పని యొనర్పవు. నాకు స్పష్టముగఁ దెలియును. నీవు పూన్కి గలవాఁడవై తృష్ణను జయింపుము. దానితో నీకే గాక సమస్తప్రపంచమునకును గల్యాణ మగును. మహాపురుషు లనుసరించు మార్గమునుఁ బట్టుము. ఓర్పు, సుఖము యీ రెంటిలో క్షమ గొప్పదని పెద్దలందురు. యుద్ధమే జరిగినచో మీ చేతులారా భీష్ముని జంపవలసి వచ్చునుగదా! ఆచార్యుఁడైన ద్రోణుని, ఆతని పుత్త్రుని జంపవలసిన యవసర మేర్పడును. కృపాచార్యుఁడు, శల్యుఁడు, సౌమిదత్తి, వికర్ణుఁడు మొదలైనవారి నందరిని జంపవలసివచ్చును గదా! వీరిలో మీకెవ్వరు పరాయివారు? ప్రాప్త్యానుసారము మానవునకు సుఖదుఃఖములు గల్గును. జయాపజయములు, సుఖదుఃఖములు, వీనిని గొని తెచ్చుటలో మానవుఁడు సర్వస్వతంత్రుఁడు గాఁడు. అవి దైవాధీనములు. చతుస్సముద్ర వలయాంకితమైన భూమియంతయు నీకు యుద్ధముచే దక్కినను ధర్మరాజా! నీ వనుభవించునది రక్తాన్నమే యగును. రక్తాన్నము గుడుచుట పాండవులవంటి వారికిఁ దగునా?"

ఈవైపునకు "యుద్ధము! యుద్ధమ"ని కలవరించు వీరులు గొంద రుండవచ్చును. వారు నీకు మాటి మాటికిని విక్రమబోధ లొనర్చుచుండవచ్చును.

కాని యుధిష్ఠిరా! వానినన్నిటిని నీవు చెవిలో వేసికొనరాదు. ఇంతవరకు నీకు గలిగిన కీర్తిని నాశనమొనర్చు కొనుట కంటెను ఆత్మహత్య యొనర్చికొనుట మేలు!"

ధర్మరాజు చిత్తవృత్తి ధృతరాష్ట్రుడు బాగుగా నెఱుఁగును. ఆతఁడు జెప్పి పంపిన పలుకులింతమాయోపాయదక్షములుగ నున్నవి! సంజయ రాయబార సన్నివేశమున కృష్ణుఁడక్కడ లేకున్నచో తండ్రి మాటలకు ధర్మరాజు చెవులు వ్రేలవేసెడివాఁడే! కాని, కృష్ణునిముం దీ యాటలు సాగిరాలేదు. కణికుని యుపదేశములో నేమున్నది? యజ్ఞాది కర్మములచేతను, కాషాయధారణాదుల చేతను జడలు మొదలైన వానిని బెంచియు లోకులను వంచింపవలెను. కార్యసాధకుఁడు తోడేలువలె మెలఁగవలెను. ఈ యుపదేశమును ధృతరాష్ట్రుఁడు బాగుగా ననుసరించినట్లే గదా! ఇతని కన్నివిధములఁ దగిన దూత సంజయుఁడు. యుధిష్ఠిరుని ధర్మబుద్ధి, దయ వీనిని, దలఁపున నుంచికొని ధృతరాష్ట్రుఁ డీ పాచిక నెత్తినాఁడు. ఆవేళ కతఁ డచట నుండుట పాండవుల యదృష్టమే!

ధృతరాష్ట్రుని మాటలోని యర్థమును ధర్మరాజు గ్రహింపకపోలేదు. ధర్మజుఁడు కృష్ణునితో నన్నాఁడు.

"శ్రుతం తే ధార్త రాష్ట్రస్య సపుత్ర స్పచికీర్షితం

..... ..... ..... .....

మిథ్యా చరతి లుబ్ధస్సస్ చర న్ప్రి ప్రియ మాత్మనః!

(భా. ఉ. ప. అ. 72)

"కృష్ణా! సంజయునితో ధృతరాష్ట్రుఁడు చెప్పి పుత్తెంచిన సందేశమును వింటివి గదా! ఇది మా పెద్ద తండ్రి యొక్క అభిప్రాయంబు. ఈ మాటలలో నతఁడు తన హృదయమునే వెల్వరించెను. సంజయుని కవిత్వ మిందులో

నేమియులేదు. దూతలు కేవలము సందేశహారులు! వారు స్వతంత్రించి యొక మాటయును జేర్ప వీలులేదు గదా! అన్యథా వచించు దూత వధింపఁబడును. ఇంతవఱకును ధృతరాష్ట్రుఁడు మనస్సులో నుండుమాటను నేటికి బయటఁ బెట్టినాఁడు. అంగుళము భూమి నివ్వక, మమ్ము శాంతిపఱుప వలెనని యాతని తలఁపు. అతని యాజ్ఞతో మేము పండ్రెండు వర్షములు వనములలో గడపితిమి. ఒక్క సంవత్సర మజ్ఞాతవాస మొనర్చితిమి. మేము మా మాటను నిల్పికొంటిమి. కాని మా తండ్రిమాత్రము తన వచనమును నిల్పికొన సమ్మతించుటలేదు. అతనికి తన మనస్సుపై నధికారమే శూన్యము. పుత్రలోభమున కాతఁడు వశుఁడు! దుర్యోధనుఁ డెట్లు జెప్పిన ధృతరాష్ట్రుఁడట్ల నడచును. ఆతఁడు లోభితనముల పుట్ట! తన మాటయేదప్ప యితరుల యభిప్రాయము గాఁబట్టదు. కాపట్యముల గూ డతఁడు. దుర్యోధనుని వచనములచేతఁ బ్రేరితుఁడై ధృతరాష్ట్రుఁడు మా కపకారము సేయఁదలచినాఁడు."

పెద్ద తండ్రి తలఁపులోని విషయము ధర్మరాజు గ్రహించినాఁ డంటిమి! అయినను తండ్రిపలుకులలోని ప్రభావ మాతని చిత్తముపైఁ బడకపోలేదు. ఇంతమాత్రమే గాదు, సంజయుని యీ నక్కవినయము మహారథియైన అర్జునుని మనస్సును గూడ జయించినది. ఈ భావముల ప్రభావము భగవద్గీత ప్రథమాధ్యాయమున కవ్వడి పడిన వేదన! అర్జునుఁడు కృష్ణునితో నిట్లన్నాఁడు.

"దృష్ట్వేమం స్వజనంకృష్ణ! యుయుత్సుం సముపస్థితం

..... ..... ..... .....

ధార్తరాష్ట్రా రణే హన్యుః త న్మే క్షేమతరం భవేత్.

(భా. భీష్మ. అ. 25)

"కృష్ణా! నా స్వజనులందరును యుద్ధమునకు వచ్చినారు. వారు పోరుటకుఁ దెగఁబడి వచ్చిరి. కాని నాకు మాత్రము వారిని జూచిన వెంటనే చెమటవోయుచున్నది.

మానవుఁడు సంపదలను గోరుట తనకును బంధులకునే గదా! బంధువులు లేని రాజ్యమెందుకు? సుఖమెందుకు? ఆ యెదుటఁ జూడుము! వచ్చినవారందును నా బంధుసంతతి! ధనప్రాణములను లెక్కింపక వారు యుద్ధమునకు నడచివచ్చిరి. వీరందరిని జంపి నేను పాముకొనున దేమున్నది? త్రిలోకరాజ్యములు లభించునట్లున్నను నేను వీరిపై గాండీవమెత్తను. వీరు నన్ను వధింతురే గాక! నేను వీరినిఁ జంపను. వారినిఁ జంపినచో నాకేమి ఫలము? పాప మొడిగట్టుకొనుటయే! వీ రపరాధులే గావచ్చును. లోభోపహతచేతస్కులే! మిత్రద్రోహులే! కుల క్షయమునకుఁ బూనికొన్నవారే! వీరిని వధించుట నాకిష్టము లేదు. అయ్యో! ధనాశకు లోఁబడి మే మెంత ఘోర మొనర్చుచున్నాము! అన్నదమ్ములు పరస్పరము తలలుత్తరించికొనుటయా! కృష్ణా! నాచేత నిపుడు గాండీవము లేదు. వారిపై బాణమును ప్రయోగింపఁ దలఁపలేదు. ఇపుడు నన్నెవఁడైన హఠాత్తుగ జంపిన నెంత బాగుండును! ఎంత క్షేమమగును!

సంజయుని దౌత్యము ముగిసినది. కృష్ణుఁడు కౌరవుల కడకు రాయబారిగ వచ్చునని నిర్ణయమైనది. ధృతరాష్ట్రుని నోటిలో కరక్కాయ పడినది. ధృతరాష్ట్రుఁడు మహాఘటికుఁడు. వాఁ డప్పటికిని దన పూనిక వదలలేదు. తన కపటోపాయములతో కృష్ణుని గూడ లొంగఁదీసి కొనుటకై యత్నించినాఁడు! కాని యీ యెత్తులన్నియు జనార్దనునకు దెలియును. అతఁడు వీని కొక్కదానికిని లోఁబడలేదు. వేయి కణికులను మించిపోగల మేధ కృష్ణపరమాత్మునిది! ధృతరాష్ట్రుని మనస్సులోని యీ కాపట్యమును తక్కిన మంత్రులు గ్రహించిరో లేదో కాని విదురునికిమాత్ర మిది స్పష్టముగఁ దెలిసినది.

కృష్ణుఁడు హస్తినావతి కరుఁగుదెంచుచున్నాఁడు అను వార్త విని కురురాజు నిండుసభలో నిట్లు పలికెను.

"ఏకవర్ణై: సుకుష్టాంగై: బాహ్లిజాతై ర్హ యోత్తమై:
..... ..... ..... ......
యద్య దర్హతి వార్ష్ణేయ: త త్త ద్దేయ మసంశయం!
(భా. ఉ. ప. అ. 86)

"నేను శ్రీకృష్ణునకు బాహ్లిక దేశమునందుఁ బుట్టిన సువర్ణా లంకృతములైన హయములను కొల్లల కిత్తును. బాహ్లిక హయములను గట్టిన రథములను పదునాఱింటి నొసంగెదను. గొప్పవైన యేనుఁగులను యెనిమిదింటి నాతని కర్పించుకొందును. ఒక్కొక్క యేనుఁగు నకును యెనిమిదిమంది సంరక్షకులు! బంగారు తొడవులు ధరించి రుచిరాంగములు గల దాసీజనములను నూఱుమందిని కృష్ణున కివ్వఁ దలచితిని. ఉత్కృష్ట వస్త్రముల వేయింటిని, చీనాదేశమం దుత్పన్న మైన వస్త్రములను కొన్ని వేల నాతనికిఁ గాన్క పెట్టెదను. సర్వ కాలములయందు సూర్య చంద్రుల కీడుగాఁ బ్రకాశించు నా రత్నముతో నాతనికిఁ గై సేతును. ఆ రత్న మాతనికిఁ దగినది. ఒక దినమునందే చతుర్దశయోజనములఁ బరువెత్తగల గుఱ్ఱములతోఁ గూడిన రథము నిత్తును. ఆతని పరివారమున కెనిమిది రెట్లు భోజనమును సర్వకాలము నొసఁగుదును. ఉత్కృష్టాలంకారము గలిగి నిగనిగ మెఱయు వేశ్యలను వేల కొసఁగెదను. దుర్యోధనుని సౌధమున కంటెను దుశ్శాసనుని నగరు గొప్పది. దానిని చక్కగా నలంకరింపఁ జేయుదును. నా యింటను సుయోధను నింటను గల రత్నముల నన్నిటి నక్కడఁ జేర్తును. ఏ వస్తువు పై నాతనికిఁ జూపు పడునో దాని నంతయు నాతఁడు గ్రహింపవచ్చును."

చీఁకు రాజు మాటలలోని కాపట్యమును విదురుఁడు స్పష్టముగ గ్రహించెను. స్పష్టమైన మాటలతో నాతని కిట్లు బదులు పల్కెను.

"మాయైషా సత్య మేవైత చ్ఛద్మైతత్ భూరి దక్షిణ!

..... ....... ..... ........

అన్యో ధనం జయా త్కర్తు మేత త్తత్వం బ్రవీమి తే

(భా. ఉ. ప. అ. 89)

"రాజా! నీ యాదర మంతయుఁ గపటము! నీ హృదయమునే నెఱుఁగుదును. పాండవులు నిన్నయిదూళ్ళు మాత్రము గోరిరి. వాని నిచ్చుటకే నీ కిష్టము లేదు! అట్టివాఁడవు. కృష్ణుని కొఱకై యింతధనమును ఖర్చువెట్టఁదలఁచు చున్నావు. దీనిలో కపటము లేదని యెవఁ డనుకొనఁగలఁడు? దీనితో నీవు కృష్ణుని జయించుట సాధ్యముగాదు! అతఁడు పాండవులను వదలి రాఁడు! ఎన్ని సంపదలైనను కృష్ణుని కర్జుననితో సాటిరావు."

ధృతరాష్ట్రుఁ డెంతో పెద్దయెత్తు వేసినాఁడు! కణికుని కూటనీతిని అడుగడుగునను నాతఁడు వినియోగించికొనుచు వచ్చెను. ఎదుటి వారిలో నున్న కామాదికములను రెచ్చగొట్టి, తన స్వార్థమును సాధించికొనునంత దుష్ప్రయత్నమునకు గూడ ధృతరాష్ట్రుఁడు జంకలేదు. కృష్ణుని చిత్తము వీని నన్నిటికిని దప్పి నిలచినది. ఆతఁడు కౌరవుల భోజనమును నిరాకరించెను. వారి సత్కారములు వలదన్నాఁడు. విదురుని యింటిలో రాత్రి గడపినాఁడు. ధార్త రాష్ట్రు లెంతకైనను దగుదురని దేవకీసుతనకు దెలియును! ఆతఁడు తన సైన్యముతోనే వచ్చెను. కృతవర్మాది యోధులు కృష్ణునివెంట నుండిరి. అందుచే కౌరవుల కాతని నేమిజేయుటకును సాధ్యపడలేదు. కాని వారు కృష్ణుని బంధించుటకై యత్నించిరి.

ధృతరాష్ట్రునకు యుద్ధము సమ్మతమే! తన వైపు గల యోధులపై నాతనికి నమ్మకము గూడ నుండినది. ఈ విషయమున దుర్యోధనునితో నాతఁడు సంపూర్తిగ నేకీభవించినాఁడు! అందుకే భీష్మద్రోణులు యుద్ధము హానికరమని యెంత బోధించినను ముసలి రాజు వినలేదు. భారత మిట్లనుచున్నది.

"అనాదృత్య తు త ద్వాక్య మర్థవ ద్ద్రోణభీష్మయోః

..... ....... ..... ........

భీష్మద్రోణే యదా రాజా న సమ్య గనుభాషతే!

(భా. ఉ. ప. అ. 49)

"కి మసౌ పాండవో రాజా! ధర్మపుత్రోఽభ్యభాషత

..... ....... ..... ........

కే వాస్య భ్రాతృపుత్రాణాం పస్యన్త్యాజ్ఞేప్సరోముఖం

(అ. 50)

భీష్మద్రోణుల మంగళకరములైన పలుకులను ధృతరాష్ట్రుఁ డెప్పుఁడనాదరించెనో యప్పుడే భారతవీరులు ప్రాణములపై నాశ వదలుకొన్నారు. ధృతరాష్ట్రుఁ డడిగెను. "మనవైపు గల సేనలను ధర్మరాజునకు వివరించితివి గదా! వీరుల కొలఁదులను గూడ జెప్పితివా? ఇవన్నియు విని ధర్మరాజేమనెను? చెప్పుము. ఆతని యుద్ధముకై బురికొల్పు వారక్క డెవ్వరు? ఎవరిం గొని యాతఁడు మనపై నెత్తివచ్చును? యుద్ధమునుండి మరలించునట్టివారు ఆ వై పెవ్వరును లేరా? ఇంత సైన్యము నెదిర్చుటకు వారికెంత ధైర్యము వచ్చినది?"

ధృతరాష్ట్రున కున్నది పుత్రలోభ మొక్కటియేగాదు! రాజ్యలోభము గూడ! పుత్త్రునిపై నాతనికి ప్రీతి యొక్కటియే యన్నచో నింతలేసి యకృత్యము లాచరించి యుండఁడు దుర్యోధనుఁడు కుల స్త్రీల నవమానించెను. ధర్మము నుల్లంఘించెను. కాపట్యమూర్తి వాఁడు. రాష్ట్ర క్షేమమునకై ధృతరాష్ట్రుఁడు వీనిని వదలుకొనవలసి యుండెను. ఆర్యావర్తమున పుత్త్రుల కన్నను ధర్మము నెక్కువగా బ్రేమించు రాజు లెందరో గలరు. వారు ధర్మమునకై పుత్త్రులను వదలుకొనిరి. పుత్త్రలోభముతో రాష్ట్రమునకు నష్టము గలిగింప నెంచిన ధృతరాష్ట్రుఁడు వధార్హుఁడు. తండ్రి కన్నను తల్లికి సంతానముపై నెక్కువ ప్రీతి యందురు. కాని భారతమున

మాత్రము ధృతరాష్ట్రుని కన్నను గాంధారియే మెలకువగ వర్తించినది. ఆమె ధృతరాష్ట్రునితో స్పష్టముగ నిట్లు జెప్పినది. "నీవే పుత్త్రులకు మంచిమార్గమును జూపవలెను. నీవు వారిని నాశన మొనర్పరాదు. దుర్యోధనుని నేను నవమాసములు మోసి కంటిని. తల్లినైన నేనే స్పష్టముఁగ జెప్పుచున్నాను. వాఁడు కులమున కగ్గివంటివాఁడు. వానిని వదలిపెట్టుము." గాంధారి యన్న యీ మాటలు ధృతరాష్ట్రుని చెవుల కెక్కనేలేదు. వాని పుత్త్రలోభ మంతటిది! వాని కంటిన రాజ్యాశకు పారమే లేదు. అందుకే వ్యాసుఁడు ధృతరాష్ట్రుని గంధర్వుల యొక్క మాయామయమైన సృష్టియని వచించెను. మహాభారత యుద్ధమనెడు అనర్థవృక్షమునకు మూలభూతమైన వాఁడు ధృతరాష్ట్రుఁడే! ఉద్యోగపర్వమున నీ మాటలు శ్రీకృష్ణుఁడననే యనెను.

భారతయుద్ధము ముగిసిన పిదప కృష్ణుఁడు హస్తినావతికి వచ్చినాఁడు. ఆ వచ్చుట ధృతరాష్ట్రు నోదార్చుటకు! ఆ మాటల సందర్భమున జరగిన యనర్థమున కంతయు నీవే కారణమని కృష్ణుఁడు ధృతరాష్ట్రునితో నన్నాఁడు. ఆతని మాట లివి. "నీవు కాలమున కధీనుఁడ వైతివి. లోభమునకు లోఁబడితివి. నీ దోషముచే సర్వక్షత్రజాతి నాశనమైనది."

యుద్ధానంతరము పాండవులు ధృతరాష్ట్రుని దర్శనమునకు వచ్చినారు. వారి నాతఁడు కౌఁగిలించుకొనెను. భీముని కౌఁగిలించి కొనఁబోవునపుడు కృష్ణుఁ డాతని యెదుట లోహమయమైన భీమ విగ్రహమును బెట్టించెను. ధృతరాష్ట్రుని కౌఁగిలింతలోనా విగ్రహము చూర్ణమై పోయినది. అప్పుడు కృష్ణుఁడు నవ్వుచు గ్రుడ్డిరాజు నిట్లు మందలించినాఁడు. "ధృతరాష్ట్రా! యుద్ధము జరిగినది నీ యపరాధముతో! భీమునిఁ జంపనెంచెదవు. కోపమును కుదించికొమ్ము. నీ వొనర్చిన దుష్కృత్యము నొక్కసారి జ్ఞాపకమునకుఁ దెచ్చికొమ్ము."

భారతమునందు నిజముగా ప్రతినాయకుడు ధృతరాష్ట్రుడే! రాజ్యసంస్థయొక్క యధఃపతనమునకుఁ బ్రతీకముగ వ్యాసమహర్షి వానిని దిద్ది తీర్చెను. ఈ వర్ణనముతో దుర్యోధనుని వ్యక్తిచిత్రమును గూడ కలిపికొని మనన మొనర్తుమేని నాఁడు జరగిన రాజ్యసంస్థ యొక్క యధఃపతన మెంతటిదో మన కర్థమగును.

## దుర్యోధనుఁడు

ఆదిపర్వము మొదటి యధ్యాయమందే దుర్యోధనునిచిత్తవృత్తి రేఖామాత్రముగ సూచింపఁబడెను. వాఁడు మన్యుమయమైన మహా ద్రుమమట! ఈ వాక్యమే ఉద్యోగపర్వ మందును బునరావర్తింపఁ బడినది. ఈ యభిప్రాయమును గృష్ణుఁ డొసఁగెను. సుయోధనుఁడు ప్రబలమైన మాత్సర్య స్వరూపము. వాని నఖశిఖపర్యంతమును క్రోధమే! ఆ గర్వమున కంతులేదు. ముందువెనుక లారయని తీవ్రమైన యుద్రేక మాతనిది. వాని యాత్మగౌరవాకాంక్ష ప్రబలమైనది. అట్టిదే వాని ప్రభుత్వాకాంక్షయును. భారతములోని దుర్యోధనుని స్థూలరూప మిదియే! ఈ పునాదిపైననే వాని జీవిత మనెడు మహాసౌధము నిర్మితమైనది. తనకు జరగిన యవమానమును అదెంత చిన్నదైనను విస్మరించుట యన్నది దుర్యోధనుని జీవితముననే లేదు. నిరంతరమును హృదయమున జ్వలించుచున్న ప్రతిహింస వాని యనేక సాహసములకుఁ గారణభూతమైనది. స్పర్ధయే వాని జీవధర్మము. చిన్ననాఁడును యీ గుణము వానిని విడచినది గాదు. అప్పటి కింకను రాజ్యకాంక్ష దుర్యోధనుని హృదయమునఁ బెరిగి యూడలు వేయలేదుగదా. ఆ వయస్సున గూడ వానికిఁ గౌంతేయులతో క్రీడాస్పర్ధ యుండెడిది. దాని పోకడ యెంతవఱకుఁ బోయిన దనఁగా భీముని విషము పెట్టి చంపుటకై వాఁడు యత్నించెను.

వేదవ్యాసు లిట్లన్నారు

"జవే లక్ష్యాభిహరణే భోజ్యే పాంసువికర్షణే

..... ....... ..... ........

మృతకల్పం తదా వీరం స్థలా జ్జల మపాతయత్

(భా. ఆ. ప. అధ్యా. 128)

పై శ్లోకముల యర్థ మిది. "వేగము, వృక్షవిహారణము, బోజనాదులు, పాంసుక్రీడ మొదలగు నన్నిటియందును భీముఁడు దుర్యోధనాదులను మించిపోవుచుండెను. అందుచే వానిపై గౌరవులకు స్పర్ధ యేర్పడినది. ధార్తరాష్ట్రుల కందఱకును వాఁ డక్రియుఁ డయ్యెను. భీమసేనునకు వారిపై క్రోధము లేదు. అతఁ డట్లు వారి విషయమున వర్తించుట కేవల బాల్యచాపల్యమే! భీముని యీ బలమును జూచి దుర్యోధనున కసూయ రేగినది.కపటముతో వాఁడు భీముని మద మణఁగింపనెంచెను. సమయమునకై గాచికొన్నాఁడు. ఒకానొకనాఁడు భీమసేనుని తిండిపదార్థాములలో కాలకూటవిషమును గలిపెను. కత్తిపదును వంటి మనస్సుగల ధార్తరాష్ట్రుఁడు తియ్యని మాటలతోవృకోదరు నొప్పించి యా భక్ష్యములను దినిపించినాఁడు. భీమునకు సుయోధనుని కాపట్యము దెలియదు. వాఁడు కడుపునిండుగ నా యన్నమును, భక్ష్యములను దినెను. విషము శరీర మంతయు వ్యాపించినది. భీమునకుఁ దట్టుకొనరాని నిద్ర వచ్చినది. వాఁ డొకచో నేగి గాఢనిద్రలో మునిగెను. వాని శరీరమును శీతవాతములు ముంచుకొన్నవి. అతఁ డప్పుడు మృతకల్పు డయ్యెను. ఆ సమయమునకై గాచికొన్న దుర్యోధనుఁడు భీముని కరచరణములను లతాపాశములతో బంధించి నీటఁ ద్రోయించెను.

ఇందంతయు బాల్యక్రీడ. ఆటలలో గలిగిన స్పర్ధ. ఇంతటి చిన్నని కారణమునకు దుర్యోధనుడు భీముని ప్రాణమే దీయఁదలఁచెను. ఇట్టి చిత్తవృత్తి గలవాఁడు పెరిగి పెద్దయైనమీద ననేకములు దురంతములు గావించెననుటలో నాశ్చర్య మేమున్నది? పాండవులను వాఁడు జూదమున గెలిచెను. ధర్మస్వరూపుఁడైన

ధర్మరాజు దాసుఁడ నైతినని యొప్పికొన్నాఁడు. ఆ సమయమున పాంచాలి రజస్వల. ఏక వస్త్ర. ఆమెను దుర్యోధనుఁడు బెట్టిన సిలుగులు హృదయమున్న వారల కెన్నఁడును మఱువరానివి. వాని క్రోధము గట్టు లెఱుఁగదు. భారతమునం ధంతయు దుర్యోధనుని పట్టి పీడించిన మూలసూత్రమిదియే యనవచ్చును. దీనికి వశుఁడై వాఁడు పాండవులపై ఘోరాతి ఘోరములైన యత్యాచారము లొనర్చెను. పాండవులు రాజసూయ మొనర్చిరి. ఆ యాగమునకై మయుఁడు మహాసభను నిర్మించి యిచ్చినాఁడు. ఆ సభ విచిత్రమైనది. దానియందుఁ దారాడుచు దుర్యోధనుఁడు గొన్ని తికమకలు పడెను. ఆ పడుట యెవ్వరికైనను నవ్వు గలిగించును. పాండవులు గూడ నట్లే నవ్విరి. వారి నగవు దుర్యోధనుని మనస్సున గత్తియై గ్రుచ్చుకొన్నది. వానికప్పుడు జరగిన యనుభవము వానినోటినుండియే విందము గాక!

"కృతాం బిందుసరోరత్నై ర్మయేన స్ఫటికచ్ఛదాం

..... ....... ..... ........

..... ....... ..... ........

ఇదం ద్వార మితో గచ్ఛ! రాజన్నితి పునః పునః ॥

(భా. స. ప. అ. 50)

మయుఁ డొకచోట బిందుసరోరత్న నిర్మితమైన యొక స్థలము నేర్పరచెను. చలువరాళ్ళచే నా చోటు గట్టఁబడినది. వాని కాంతు లుదకమనెడు భ్రాంతిని గల్పించుచుండెను. నేనా స్థలమును సమీపించి నప్పుడు నీటిలో దడిసిపోవునని కట్టిన పుట్టముల నెత్తికొంటిని. ఆ సన్ని వేశమును జూచిన వృకోదరుఁడు నవ్వినాఁడు. ముందే వారి వైభవమును భావించి నా హృదయ మగ్ని తప్త మైనట్లుండినది. దానికిఁ దోడు భీముని నగవు! నాకు శక్తి యున్నచో నప్పుడే వాని తల నఱకియుందును. కాని నా కచట స్థానబలము లేదు. నే నప్పుడు

విజృంభించినచో శిశుపాలుని వంటి గతియే నాకును బట్టియుండెడిది. శత్రువు లొనర్చిన యీ పరిహాసము నా హృదయము నీనాటికిని వేధించుచున్నది. ఆ సభలోఁ దిరుగుచు నింకొక చోటు దరిసి యటు నడచితిని. నా గుడ్డ లన్నియుఁ దడిసినవి. అది జలపూర్ణమైన సరస్సు. అప్పుడు కృష్ణుఁడు పార్థసహితుఁడై 'ఫక్కు' మని నవ్వినాఁడు. చెలికత్తెలతోఁ గూడి యట దిరుగుచున్న ద్రౌపదియు నన్ను జూచి నవ్వెను. ఆ పరిహాసమును మఱచుటకే నాకు సాధ్యముగాదు. వెంటనే రాజసేవకులు నా కొఱకై క్రొత్తగుడ్డలు దెచ్చిరి. వానిని గట్టికొంటిని. కాని లాభమేమి? నాకు జరిగిన యవమానము మాత్రమట్లే మిగిలిపోయినది. ఇట్టిదే మరియొక సన్నివేశమును జరగినది. ఆ సభ యందొక కుడ్యమున్నది. ఆ గోడ వాకిలియనెడు భ్రాంతిని యావైపు నడచితిని. ఇంకేమున్నది? ఆ కుడ్యము నా ఫాలమునకుఁ దగిలెను. అల్లంతదూరమున నిల్చియున్న కవల లిర్వురును నా శోచనీయస్థితిని జూచి యల్ల నవ్విరి. వారు దమబాహువులచే నన్నుఁ బట్టికొనిరి. సహదేవుఁడు నవ్వుచు "ఇది ద్వారము గాదు మీరు పొరబడితిరి. ఇదిగో! ద్వార" మని నాకు మార్గమును జూపినాఁడు. ఈ సన్నివేశములను నేను మఱచుటకు సాధ్యమా?"

ఇవన్నియు నాఁడు దుర్యోధనునకు మయసభలో జరగిన యనుభూతులు. అప్పుడచ్చటనున్న వారందరు దుర్యోధనునివంటి కులీనులే! హీనజాతు లెవ్వరును లేరు. దుర్యోధనునకు జరగినదానివంటి సన్నివేశము అప్పు డందులో నెవ్వరికి జరగియున్నను తక్కినవారందరును నవ్వియుండెడివారే! ఆ నగవు తాత్కాలికమైనదే. ఏదో విషయము మనసులో నుంచికొని యదేపనిగఁ జేయు వెక్కిరింత గాదు. ద్రౌపది దుర్యోధనుని పొరపాటునకు నవ్వినది. ఆ నవ్వుట వాని నదేపనిగ హాస్యముసేయుటకే సేయవలెనని గాదు. అది యొక తాత్కాలికమైన మనోవికాసము

మాత్రమే! పైగా దుర్యోధనుఁడు ద్రౌపదికి మఱఁది. కృష్ణుఁ డొకరీతిగా బావమఱఁది. నవ్వును గలిగించు సన్నివేశములు గల్గినప్పుడు వారే గాదు, లోకములో నెవ్వరైనను నవ్వుదురు. నవ్వినంత మాత్రముచేత వారి కెదుటివారిపై పగయున్నదని యర్థము గాదు. అది సన్నివేశ ప్రభావము. అంతే! దాని నాధారముగ గొని దుర్యోధనుఁడు బగ సాధింపనెంచుటలో నర్థములేదు. కాని, యసలు కీలక మది గాదు. వాని మనస్సులో నింతకుముందే పాండవులపై నసూయ యున్నది. ఆ యసూయతో వాఁ డనేకములైన యపకారములు అంతకుముందు నుండియే జేయుచువచ్చెను. వయస్సుతోబాటు వానికి గౌంతేయులపై ద్వేషమును ముదిరినది. వాడు రాజసూయమునకు సదభిప్రాయముతో వచ్చియుండలేదు. నిరంతరమును పాండవులను నాశనముసేయు టెట్లనియే వాని యూహ. చాలనిదాని కిది యొక క్రొత్త కారణము దొరకినది. మూల్గుచున్న నక్కపై తాటికాయ పడినట్లు! ఈ దొరకిన కారణమును విడువక వాఁడు గట్టిగాఁ బట్టుకొన్నాఁడు. నాటి నుండి వానికి పాండవులపైఁ బగ రెండింతలయ్యెను. వారి కిష్టుఁడని విదురునిపై గూఁ సుయోధనుఁడు కక్ష గట్టెను. పాండవులను జూదమున గెలిచినాఁడు. ద్రౌపదినిఁ గూడ గెలిచెను. ఇక వాని కెదురేమున్నది? మయసభలో నామె నవ్విన దానికిఁ బ్రాయశ్చిత్తముఁ జేయవలె ననుకొన్నాఁడు. వాఁ డామెను నిండుసభలో 'దాసి' యని పిలచెను. దుర్యోధనుఁడు విదురునివైపు దిరిగి యిట్లు బలికెను.

"ఏహి క్షత్త! ద్రౌపదీ మానయస్వ
ప్రియాం భార్యాసమ్మతాం పాండవానాం
సమ్మార్జతాం వేశ్మపరైతు శీఘ్రం
తత్రాస్తు దాసీభి రపుణ్యశీలా!"

(భా. సభా. అ. 66)

"ఓయి విదురా! పాండవుల ప్రియభార్యయయిన ద్రౌపది నిచటికిఁ గొనిరమ్ము! అది శీఘ్రముగ బయలుదేరి తక్కిన దాసీ గణముతోఁ జేరి మా యిండ్లు కసువూడ్చునుగాక! దానికి శీలమెక్కడ యున్నది?"

విదురుఁడు దుర్యోధనుని మాటలను మన్నింపలేదు. అతఁడు ద్రౌపది కడకుఁ బోలేదు. అపుడు సుయోధనుఁడు దుశ్శాసనుని బిలిచి యిట్లన్నాఁడు. 'ఓయి! దుశ్శాసనా! మూర్ఖుఁడు, సూతవంశ సంభూతుఁడైన యీ విదురుఁడు భీమునకు భయపడుచున్నాఁడు. నీవే పోయి ద్రౌపది నీడ్చికొని రమ్ము! వారు మనకు దాసులైరి. శత్రువులైన పాండవులు నేఁడు మనల నేమిసేయగలరు?' దుర్యోధనుఁడు ద్రౌపది నొనర్చిన యీ పరిహాసమునకుఁ గర్ణుఁ డెంతయో సంతోషపడెను. దుశ్శాసనుఁడు తల వెండ్రుకలనుఁ బట్టుకొని ద్రౌపది నీడ్చికొని వచ్చినాఁడు. త్రోవ పొడుగునను ఆమెనుఁ దిట్టుచు వచ్చెను. ఈ వేడుకను దుర్యోధనుఁ డెంతయో యుత్సాహముతోఁ జూచినాఁడు. తనకుఁ బాండవు లొనర్చిన యవమానమునకుఁ బ్రతీకారమైనది. ఇంతమాత్రముతో దుర్యోధనుఁడు శాంతింపలేదు. ద్రౌపది కాతఁ డింకను గుణపాఠము నేర్పఁదలఁచెను. ఆమె వాని దృష్టిలో బంధకి. బంధకికి శీలము లేదు. తన భోగదాసి కంటెను వాఁ డామె కెక్కువ గౌరవ మొసఁగుటలేదు. ఈ విషయ మందఱకునుఁ డెలియఁ జేయవలెనని వాని సంకల్పము. అందుకై చేసిన ప్రయత్నమే యామె వస్త్రాపహరణము. తన తొడనుఁ జూపించి నవ్వుటకునుఁ గూడ దుర్యోధనుఁడు సిగ్గుపడినవాఁడు గాఁడు. భారతమున నీ సన్నివేశ మిట్లున్నది.

"భీమసేనవచశ్శ్రుత్వా రాజా దుర్యోధన స్తదా!

..... ...... ..... ......

ద్రౌపద్యాః ప్రేక్ష్యమాణాయాః సవ్య మూరుమదర్శయత్

(భా. స. భా. అ. 71)

"భీమసేనుని మాటలు విని ధర్మరాజు నిశ్చేష్టుఁడైనాఁడు. అపుడు దుర్యోధనుఁడు ధర్మరాజుతో నిట్లు బలికెను. "ధర్మరాజా! భీమసేనుఁడు, అర్జునుఁడు, నకులసహదేవులు వీరందరును నీ యాజ్ఞకుఁ లోఁబడినవారే గదా! ద్రౌపది యోడిపోయినదో లేదో చెప్పుము! ఆమె యోడిపోలేదని నీవు దలఁచినచో యా మాటను స్పష్టముగ వచింపుము." యుధిష్ఠిరునితో నిట్లనుచునే దుర్యోధనుఁడు దన తొడపై నున్న వస్త్రమును దెమలించి, నవ్వుచు ద్రౌపదివైపు జూచినాఁడు. వాని తొడ సర్వలక్షణ సంయుతమైనది. కదళీదండ సదృశమైనది. గజహస్త ప్రతీకాశము. వజ్రముతో సమానమైనది. రాధేయునకు సంతోషమును, భీమునకు దుఃఖమును గలిగించుచు దుర్యోధనుఁడు దన యెడమ తొడను ద్రౌపదికిఁ జూపి సైగ యొనర్చెను.

మానవుని యనాగరకత యంతకన్నను పైకి పోలేదు. వస్త్రాపహరణ సందర్భమున దుర్యోధనుని ప్రవర్తనమునుబట్టి వాని క్రోధ మెంత భయంకరమైనదో, ఆ సమయమున వాఁడెంత నీచముగ బ్రర్తించెనో, మనము గ్రహింపవచ్చును. వస్త్రాపహరణ సన్నివేశమున దుర్యోధనుని మానవత్వ మెన్నడో మంటగలిసె. వాని యప్పటి వర్తనము పశువులకును లజ్జ గొలుపునట్టిది. సామాన్యుఁ డొనర్చు యపరాధమునే రాజు సేసినప్పుడు సామాన్యునకంటెను వేయిరెట్లధికముగ రాజునకు శిక్ష విధింపవలెను. ఇది ధర్మశాస్త్రకారు లొనర్చిన నిర్ణయము. దుర్యోధనుఁడు ద్రౌపదియెడ నొనర్చిన యపరాధము మహాఘోరమైనది. సామాన్యపౌరుఁ డీ యపరాధము నొనర్చినను వానికి విధింపవలసినశిక్ష మరణదండనమే! అంతకుఁ దక్కువ శిక్ష లేదు. మఱి దుర్యోధనున కెట్టి శిక్ష వేయవలెను? కాని వేసిన వారెవ్వరును లేరు. దుర్యోధనుని క్రోధ మింతటి భయంకరమైనది. అందుకే వాని నుద్దేశించి కృష్ణుఁడు "వాఁడు కోపమయమైన మహావృక్షమని" పలికెను. ఇది యెంతయు సముచితము.

# వాఁడు మాత్సర్యముయొక్క ప్రత్యక్షమూర్తి

దుర్యోధనుని మూలతత్త్వము క్రోధమే గాదు. అసూయ గూడ. ఇతరుల యధికారమును, సుఖమునుఁ జూచి వాఁడు సహింపనే లేఁడు. వెంటనే దాని కేదైన విరుగుడు దేవలసినదే! ఇఁక దానికి సాధ్యముగాకపోయెనా? వాని యాతన వర్ణించుటకు సాధ్యము గాదు. కుటుంబకలహ మనెడు మిషతో ధృతరాష్ట్రుఁడు రాజ్యమును విభాగించెను. న్యాయముగఁ దాను వారసుఁడైనను, గాకున్నను దుర్యోధనునకు రాజ్యము సంక్రమించినది. అంతటితో వాఁ డూరకుండునా? కురుపాండవ మహాసంగ్రామము లేపువఱకును దుర్యోధనునకు నిద్దుర బట్టునా? చాలనిదానికిఁ బాండవులు దినదినము నెదుగుచుండిరి, మిత్రుల సాహాయ్యముతో వారి రాజ్యము పెరుగఁ జొచ్చినది. వారి వైభవమున కంతులేకపోయెను. పలుకుబడి హెచ్చినది. వీని నన్నిటినిఁ జూచిన కొలఁదియు ధార్తరాష్ట్రున కొకటే యసూయ. ఏవిధమునైనను బాండవులను వైభవవంచితులను గావించి వారి జీవితములను భ్రష్టము లొనర్పవలెను. అంతవఱకు వానికి నిద్దురయే లేదు. వాఁడు శకునితో నిట్లనెను.

"శ్రియం తథా గతాం దృష్ట్వా జ్వలంత మివ పాండవే
...... ...... ...... ......
అపోవాపి ప్రవేక్ష్యామి న హి శక్ష్యామి జీవితుం.
(సభాపర్వము, అ. 47)

"దేదీప్యమానమైన పాండవుల సంపత్తినిఁ గాంచి నా యంతః కరణము మండిపోవుచున్నది. ఇట్లు నేను బ్రదుకలేను. వహ్నిలో నైననుఁ జొత్తును. నీటఁ బడియైన జీవమును వదలుదును. విషము నైనను భక్షింతును. బ్రదికి యుండుటకు నా కిష్టములేదు. వారిని నిర్జింపనిది నాకు జీవనమే దుర్లభమైనది."

మరల ధృతరాష్ట్రునికడ పాండవుల సంపత్తిని గూర్చి ప్రస్తావించి దుర్యోధనుఁ డీ రీతి వచించినాఁడు.

"అశ్నా మ్యాచ్ఛాదయామీతి ప్రవశ్యన్ పాపపూరితః

..... ...... ..... .......

స్థిరోఽస్మి యోఽహం జీవామి దుఃఖా దేత ద్బ్రవీమి తే॥

(భా. సభా. అ: 50)

"నే నాహారమునుఁ దినుచున్నాను, త్రావుచున్నాను, అని మనస్సులోఁ దృప్తిపడుచు పరుల యాధిక్యమును సహించి జీవించు వాఁ డధమపురుషుఁడు. ఇతరుల వైభవాధిక్యమునుఁ గాంచి సహించుచుఁ దన యల్పసంపత్తితోఁ దృప్తి నందియుండువాఁడు మనుష్యుఁడా? వాఁ డధముఁడు. తండ్రీ! చేతఁ దొరకిన సామ్రాజ్యముతో నాకుఁ దృప్తిలేదు. పాండవుల రాజ్యవైభవమును గాంచి నా హృదయము దహించికొని పోవుచున్నది. సమస్త ప్రపంచమును యుధిష్ఠిరునకు లోఁబడినది. ఇట్టి సన్నివేశమును దుర్యోధనుఁడు చూచి బ్రదికియున్నాఁడు. ఇంతకన్నను మించిన దుఃఖము నాకేమి గావలెను?

ఈ రీతి దినదినమును దుర్యోధనుని మనస్సులోని మాత్సర్యము విషము గ్రక్కుచుఁ బెరిగినది. వాఁడు ఘోషయాత్రకు సమకట్టినాఁడు. పాండవులపుడు ద్వైతవనమం దుండిరి. వారిని వీఁడు బరిహసింపనెంచెను. తన వైభవమును వారికిఁ జూపింపఁ దన సేన లన్నియు సమకూర్చికొని ఘోషయాత్ర యనెడు వ్యాజముతో దుర్యోధనుఁడు ద్వైతవనమునకుఁ దరలెను. నియతి వానికి విరుద్ధముగఁ బనిచేసినది. పరిహసింపఁబోయిన దుర్యోధనుఁడు చదికిలఁ బడి వారిచేతనేఁ బరిహసింపఁబడినాడు. "చెఱపకురా చెడెదవు" యనెడు సామెత వాని యెడల సార్థకమైనది. చిత్రసేనుఁడను గంధర్వునితో దుర్యోధనునకు యుద్ధము గలిగెను. ఆ యుద్ధమునఁ గర్ణాదులగు వీరులు యింటిదారి బట్టినారు.

చిత్రసేనుఁడు దుర్యోధనుని జీవగ్రాహముగ గ్రహించి రథమునకు గట్టికొని పోవుచుండెను. ఈ వృత్తాంతము ధర్మరాజునకుఁ దెలిసినది. అతఁడు దుర్యోధనుని విడిపించికొని రావలసినదని తమ్ముల నంపెను. వారాతనిఁ గొని వచ్చిరి. ఈ యవమానము నోర్చికొనుట దుర్యోధనున కతి కష్టముగ నుండెను. ఇంతకన్నను వానికి మరణమే మేలనిపించినది. అతఁడీయభిప్రాయమునే గర్ణునితో ననుచున్నాఁడు.

"స్త్రీ సమక్ష మహం దీనో బద్ధ శ్శత్రువశంగత:

..... ...... ..... .......

..... ...... ..... .......

ప్రశాధి పృథివీం స్ఫీతాం కర్ణ సౌబలపాలితాం ॥

(భా. వన ప. అ. 149)

"స్త్రీ సమక్షమందు నేను దీనుఁడనై పోతిని. శత్రువులకుఁ జిక్కితిని. ఆ గంధర్వులు నన్ను బంధించిరి. యుధిష్ఠిరుని పరివారము నన్ను విడిపించికొని వచ్చి ధర్మజునకు నివేదించెను. ఇంతకన్నను దుఃఖకరవిషయము నా కిం కేదిగలదు? పాండవు లింతకుముందు నాకు శత్రువులు. వారు నాచే జయింపఁబడిరి. వారి యెదుటనే ఘోరావమానమా? వారే నాకు ప్రాణదానమొసఁగుటా! అబ్బా! ఇంతకంటెను శిక్ష నాకేమి గావలెను? గంధర్వులతో జరగిన యుద్ధమున నాకు మరణము సంఘటిల్లినను బాగుండెడిది! యుద్ధ భూమియందు బోరుచు దుర్యోధనుఁడు మరణించెనను కీర్తియైన నాకుఁ దక్కియుండెడిది. వీరులై మరణించెడి వారికిఁ గలుగు పుణ్యలోకములు నాకు సిద్ధించెడివి. నేటి కీ రెండును నాకుఁ దప్పినవి. శత్రువులకుఁ జిక్కి యోడిపోయిన యీ ముఖమునుఁ బెట్టికొని హస్తినావతి కెట్లు వత్తును? ఊరికి వచ్చుట నా కిష్టము లేదు. ఇచ్చటనే ప్రాయోపవిష్టుఁడనై మరణింతును. కర్ణాదులైన నా మిత్రులు, బంధువులు దుశ్శాసనుని ముందు నిలిపికొని హస్తినావతికిఁ జేరుదురుగాక! శత్రువుల

కపకారమును, మిత్రుల కుపకారమును జేయుటయే నియమముగాఁగల నేను శత్రు నిర్జితుఁడనై హస్తినాపురమునకు రాలేను. నేటి నాయవస్థ నా మిత్రులకు శోకకారకము. శత్రువులకు హర్షమునుఁ గలిగించునది. నా దుర్బుద్ధితో నేను చెడితిని. నా మోహము నన్నుఁ జెఱచినది. శత్రువులచేత నొసఁగఁబడిన యీ జీవితము భరించి నేనెట్లు బ్రదుకుదును? ప్రాయోప వేశమొనర్చి ప్రాణములఁ ద్యజింతును. ఈ నిశ్చయము నేనొనర్చితిని. దీనికిఁ దిరుగులేదు. నాకింతవరకును 'అభిమానధనుఁ' డన్న పేరుండెడిది. శత్రువులతో నింతటి యవమానమునుఁ బొంది, మానవంతుఁ డైన యే పురుషుఁడు లోకమున జీవించును? "తీవ్ర చింతావిష్టుఁడైన దుర్యోధనుఁడు దుశ్శాసనుని బిలిచి యిట్లు వచించెను. "తమ్ముఁడా! నా రాజ్యము నీ కొసఁగితిని. నీవే స్వయముగ నభిషేకించికొమ్ము! కౌరవులకు రాజగుము. కర్ణ శకునులు దోడుగా కురురాజ్యమును విస్తరించికొమ్ము."

దుర్యోధనుఁడు పైని బలికిన యీ మాటలన్నియు వాని యంతులేని కోపాసూయల యుత్తాలతాండవములే.

ఈ నడుమ నొక వింతయైన తర్కము చదువుకొన్న వారిలో బ్రవేశించుచున్నది. వారిలో గొందఱు పతితుల నుద్ధరించుటకు గంకణము గట్టికొన్నట్లున్నది. ఇంతకుముందు మనము దుష్టు లను కొనుచున్న వారి నందఱిని యీ పండితప్రకాండులు రక్షింపఁ బూనుకొన్నారు. వీరి దృష్టిలో నింతకుముందు పవిత్రముగ భావింపఁ బడిన యెందరో పురుషులు పతితులై పోయిరి. పతితు లెందరో పుణ్య శ్లోకులై గూర్చొనుచున్నారు. వీరుముఖ్యముగ నవలంబించినది శబ్దచమత్కారము. దీని సాయమున నందిని పందిని, పందిని నందిని జేయుటకై యీ పండితప్రకాండులు ప్రారంభించిరి. ఈ నడుమనే యిట్టి గోల యొకటి నారాయణరావుపీష్వా యొనరించికొన్న యాత్మహత్యపై జరగినది. కొందరు దానిని

సమర్థించిరి. మఱి కొందఱు నిందించిరి. ఇందరు పతితు లుద్ధరింపఁబడుచుండగా దుర్యోధనుఁడు మాత్ర మేమి పాపముజేసినాఁడు! అతనికిని సహాయమునుఁ జేయఁబూనుకొన్నారు వీరు. ఇట్టి మాయ కబురులకు మనము లోఁబడినచో మన పురాణము లన్నియుఁ దల్లక్రిందులు గావలసినదే! వీనినిఁ జదువుటకు ముందు దుర్యోధనుని శీలసంపత్తి యెట్టిదో మనము స్పష్టముగఁ దేల్చికొనవలెను. లేకున్నచో మనకుఁ గూడ బుద్ధి చలించిపోవు ప్రమాద మేర్పడును. ఇట్టి కుతర్కములలో దుర్యోధనుఁడు మాత్రము తక్కువ వాఁడా? వానికే యొక వింత తర్కము కద్దు. వాని తర్క మిది. "ధృతరాష్ట్రుఁడు పెద్ద కొడుకు. కాని యాతఁడు గ్రుడ్డివాఁడు. అగుటచే రాజ్య మాతనికి రాలేదు. హీనాంగుఁడు సింహాసనస్థుఁడు గాకుండు టానాటి యాచారము. పోనిమ్ము! ధృతరాష్ట్రుని కుమారుఁడైన దనకు రెండు కన్నులును బాగుగనే యున్నవి గదా! మఱి తన కెందుకు రాజ్యాధికారము రారాదు?" ఇది దుర్యోధనుని వరుస. "పాండురాజు రాజ్యము, అతని యనంతరము యుధిష్ఠిరునకుఁ బ్రాప్తించినది. అతని తరువాత? అతని కొడుకులకే గదా! మఱి తన సంతానము గతి?" ఇవి యన్నియు సుయోధనుని హృదయమును బాధించు నాలోచనలు, తన యీ బాధలన్నియు నొక్కపారి ధృతరాష్ట్రునితోఁ వాఁడు జెప్పికొనియే యున్నాఁడు. ఆ సందర్భ మిది.

> "శ్రుతా మే జల్పతాం తాత! పౌరాణా మశివా గిరః
> ...... ..... ..... ......
> ధ్రువం ప్రాప్స్యామ చ వయం రాజ్య మప్యవశే జనే"
> (భా. ఆది. అ. 141)

దుర్యోధనుఁడు తండ్రితో ననుచున్నాఁడు. "నాయనా! మన కమంగళము నాపాదించు వాక్యము లెన్నియో నేను పౌరుల నుండి వింటిని. వారు నిన్ను

ధిక్కరింపబూనుకొన్నారు. భీష్మునిఁ గూడఁ దూలనాడఁజొచ్చిరి. పాండురాజునే సింహాసనముపై నుంపఁదలఁచినారు. ఇఁక భీష్ముఁ డందమా? అతఁడు దన ప్రతిజ్ఞ నెన్నటికిని వదలడు కనుక నతఁడు రాజ్యమును ముట్టడు. ఇఁక దుఃఖము గలుగఁబోవున దెవ్వరికి? మాకు మాత్రమే! పాండురాజు సర్వవిధముల సమర్థుఁడు. నీవు హీనాంగుఁడవు. అందుచే రాజ్య మతనికి సంక్రమించి తీరును. అతని పిదప యుధిష్ఠిరుఁడు రాజగును, అతని యనంతర మతని సంతానము. మఱి మాగతి? నీ సుతుఁడైన దుర్యోధనునకు రాజ్యము లేదు. వాని వంశమునకును లేదు. నీకు వాటిల్లిన యాపద నీతో మాత్రమే బోలేదు. మా సంతానముల కందఱకును ననువర్తించును. మేము లోకుల దృష్టిలో నిరంతరము నీచులమై బ్రదుకవలసినదే! ఇతరుల దయపై నాధారపడిన బ్రదుకు మరణానంతరము హీనలోకములు, ఇవే మాకు ప్రాప్యములు. నీ సంతానమున కిట్టి స్థితి బట్టకుండ నీవు జాగ్రత్త వహింపవలయును. ఎట్టైనను నీకు రాజ్యము దక్కినచో మాకును దక్కును. ఇందులో సందేహము లేదు."

ఇది దుర్యోధనుని విచారధార. వాని భావములు నాటి సామాజిక జీవనమునకు విరుద్ధము లైనవి. సమాజక్షేమమున కా రాజ్యతంత్రము నిర్మింపఁబడినది. ఆ తంత్రము గొన్ని నియమముల ననుసరించి నడచును. ఆ నియమము లధికసంఖ్యాకులకు సుఖమునుఁ గలిగించునవిగ నుండును. అవసరము వచ్చినపు డంతయు బుద్ధి పుట్టినట్లు వానిని మార్చుట రాజ్యతంత్రమునకు క్షేమకరము గాదు. సమాజమునకు భద్రత యేర్పడదు. దుర్యోధనుని తర్కము నాశ్రయించినచో నాటి ధర్మముల నన్నిటిని మార్చవలసినదే! ఒక రాజు ననంతరము వాని జ్యేష్ఠపుత్రుఁడు రాజ్యార్హుఁడు. ఇది నాటి సామాన్య న్యాయము. ఏ కారణము చేతనైనను మొదటివాఁడు సింహాసన యోగ్యుఁడు గాకపోయినచో రెండవవా

రాజ్యము బ్రాప్తించును. ఈ నియయము ననుసరించియే పాండుమహారాజు సింహాసన మధిష్ఠించినాఁడు. ఇఁక రాజ్య మా వంశపువారిదే! ఈ విధి దుర్యోధనునకు సరిపడలేదు. నా తండ్రి హీనాంగుఁడైనచో దోషమునకు నే నెందుకు శిక్షననుభవింపవలెనని వాని వాదము. మఱి మీ తర్కము తెగుట యెప్పటికి? భీమార్జును లున్నారు. వారేగదా దమ పరాక్రమముతో దిక్కులను గెలిచి రాజ్యమును విస్తరింపఁజేసినది! "ఈ రాజ్యము నంతయు జయించినది మేము సింహాసనముపైఁ గూర్చుందు" మని వా రడిగినచో ధర్మరాజేమి సేయవలెను? అట్లే వారు నీవు మాకంటె ముందు బుట్టితివి మేము వెనక పుట్టితిమి! వెనుక పుట్టుటలో మా తప్పేమున్నది? నీవు ముందు జన్మించుటలోను నేదో యర్థము లేని ప్రకృతి నియమమే దప్ప నీ గొప్పతన మేమున్నది? కనుక నీకు రాజ్యాధికారమే లేదని వాదించినచో నిఁక ధర్మరాజునకు దిక్కేదీ?" ఇట్టిదే దుర్యోధనుని తర్కము గూడ. హేతువాదమున కుత్తర మెవ్వరును జెప్పలేరు. వీఁ డిట్టి మొండివాఁడు గనుకనే కులనాశమను మారు పేరువెట్టి ధృతరాష్ట్రుఁడు కొంత మాయోపాయమును నడపెను. తండ్రి ప్రతిభా సమున్మేషముతో దుర్యోధనున కర్ధరాజ్యము సంక్రమించినది. కాని యంతటితో వానికి దృప్తియేదీ? వానికి రాజ్యమంతయు దనదే గావలెను. బలపరాక్రమములతో పాండవులను గెలుచుట సాధ్యము గాదు. అందుచే వాఁ డెన్నియో నీచములైన మార్గములనుఁ ద్రొక్కినాఁడు. ఒక్కటియుఁ బనికిరాలేదు. వాని భావములను పెద్దలు హర్షించలేదు. దైవము గూడ విరుద్ధమైనది. కాని యా మనుష్యుఁడు బ్రహ్మాదులు సెప్పినను వినువాఁడు గాఁడు. జూదము నాడెను. శౌర్య ప్రధానమైన క్షత్రధర్మమును వర్జించెను. ఇవేమియు సాఁగిరానప్పుడు గత్తి ఝుళిపించి కదన రంగమున కురికినాఁడు. రాజ్యమునకై వాఁ డాశపడుటలో నణువు ధర్మములేదు. కాని వానిపట్టు వాఁడు వదలలేదు. అందుకే "వాఁడు పాపము యొక్క రూపు. కలిపురుషుని యొక్క యంశ" యని మహాభారత మన్నది.

## వాని గూఢాలోచనలు

దుర్యోధనుఁ డెంతయో దూరదృష్టి గలవాఁడు. ప్రతి విషయమును గాఢముగ నాలోచించు నలవా టతనిది. ఈ రెండు గుణములా జీవితమున ననేక యెడలఁ గనబడును. యెట్లో యొక రీతి దనకర్ధ రాజ్యము దక్కినదిగదా? దక్కిన దానిని వదలుకొనుట వాని జాతకముననే లేదు. దానిని దృఢమూల మొనర్చికొనుటకై శత విధముల దుర్యోధనుఁడు యత్నించినాఁడు. మంత్రుల నందరినిఁ దన వైపునకు లాగికొన యత్నించెను. పౌరజానపదులనుఁ దన పక్షమునకుఁ ద్రిప్పికొనుటకై యెత్తు వేసినాఁడు. ధర్మరాజు ఋజుత్వము ఔదార్యము మొదలగు గుణములలోఁ బ్రసిద్ధుఁడు. వానిలో నాతని మించుట దుర్యోధనున కసాధ్యమని తోచెను. అంతేగాక యుధిష్ఠిరుఁడు హస్తినావతిలో నుండఁగాఁ దాను మెఱయుట సాధ్యముగాదు. కనుక కొన్ని దినములు 'పౌరజానపదు'ల చూపులనుండి ధర్మజునిఁ దప్పింపవలెను. ఆ యవధిలోఁ దాను జనుల చిత్తవృత్తులను కైవస మొనర్చికొనవచ్చును. మంత్రుల హృదయములను జయింపవచ్చును. ఈ నిర్ణయములు దుర్యోధనుఁ డెంతయో గాఢముగ నాలోచించి తేల్చికొన్నవే! ఇంతమాత్రమే గాదు. తన సభయందున్న ప్రతియొక్కని చిత్తవృత్తిని వాఁడు సూక్ష్మముగ బరీక్షించెను. వాని రంగులను దేల్చికొనెను. తాను గావింపఁబోవు ప్రయత్నములలో నెవ్వరెవ్వరు దన కనుకూలురో యెవ్వరెవ్వరు బ్రతికూలురో వానికి బాగుగఁ దెలియును.

"ఏవ మేత న్మయా తాత! భావితం దోష మాత్మనే
..... ........ ....... ........
శోకపావక ముద్భూతం కర్మణై తేన నాశయ.

**(భా. ఆది. అ. 142)**

"నే నెన్నిరీతులనో గాఢముగ నాలోచించితిని. ధనమును సమ్మానమును నొసఁగి ప్రజలను ప్రసన్నులనుగాఁ జేసికొన్నాను. ఈ యుపాయముతోనే యమాత్యమండలిని గూడ నావైపునకు లాగి కొంటిని. కనుక వీరందఱును నా కండగా నిలుతురనియే నా నమ్మకము. ఇప్పుడు కొన్ని రోజులు పాండవుల నుపాయముతో హస్తినావతి నుండి తప్పింపవలెను. తండ్రీ! ఎట్టైనను నీవు యుక్తి నొనర్చి వారి నిటనుండి వారణావతమున కంపుము. ఆ యవకాశమునుఁ బురస్కరించుకొని నా రాజ్యమును నేను దృఢమూల మొనర్చికొందును. తరువాత వా రిచట కేతెంచినను నాకేమియు బాధ యుండదు. ఈ సభయందున్న వీరుల చిత్తవృత్తుల నన్నిటిని నేను శ్రద్ధతో గమనించినాను. ఎట్లు జూచినను భీష్ముఁడు మధ్యస్థుఁడు. ఆతనికి కురుపాండవు లిరువురును నొక్కటే! పాండవులనుఁ గౌరవులను సమముగ నాతఁడు ప్రేమించెను. అందుచే మన కాతని నుండి యెక్కువ బాధలేదు. ద్రోణుల విషయ మట్టిదిగాదు. ఎందు కందువా! అతని సుతుఁడైన యశ్వత్థామ పూర్తిగా నావాఁడు. ద్రోణునకు బుత్రునియం దపారమైన ప్రేమ. కనుకఁ దనకిష్టమున్నను లేకున్నను ద్రోణాచార్యు లశ్వత్థామను వదలి యుండలేదు. దీన సంశయము గానము. కృతవర్మ ద్రోణుని ననుసరించియే యుండును. కృపాచార్యులు బావను వదలిపోలేడు. ఇఁకఁ దక్కినవాఁడు విదురుఁడు. అతఁడేమి చేయఁగలఁడు? జీవనార్థమై విదురుఁడు మనలనుఁ గనిపెట్టుకొని యున్నాఁడు. అతఁ డట్లుండవలసినదే. కాని విదురుఁడు ప్రచ్ఛన్నముగ పాండవులకు సహాయమొనర్చును. ఆ సహాయముతోఁ దెగునదియుఁ దెల్లవారునదియు లేదు. పాండవులవైపు జేరి మనలను బెదరించు తెగువ విదురునకు లేదు. కనుక నీవిపు డెట్లయిననుఁ బాండవులను వారణావతమున కంపుము. నా హృదయము నందలి చింతాశల్యమునుఁ బెరికివేయుము!'

దుర్యోధనుని పై మాటలను మనము గొంత దృష్టిపెట్టి చదివినచో వాని యాలోచన లెంతటి లోతైనవో బోధపడును. వాని మంత్రాంగ మత్యంతము గుప్తము. తన మనస్సులోని యుద్దేశ్యమును సాధించికొనుటకు వాఁ డే మార్గమునైననుఁ ద్రొక్కును. "ఇది చేయఁ దగినది" "ఇది చేయరానిది" యను వింగడింపే యా మనస్సునకు లేదు. చిన్ననాటినుండి వాని ప్రవృత్తి యింతే! పాండవులు వారణావతమునుఁ జేరిన వెంటనే తండ్రికిఁ దెలుపకయే పాండవులను లక్క యింటిలో మట్టుఁబెట్టవలెనని వాఁ డెంచెను. కౌంతేయులు మరణించి నచో నిక రాజ్యము నిష్కంటకముగ వానికి దక్కును. లాక్షాగృహ ప్రకరణము దుర్యోధనుని మాయోపాయములకుఁ బరాకాష్ఠ వాని నీచత్వమునకుఁ గేతనము.

## వాని మంత్రాంగము దయలేనిది

వారణావతమునకుఁ బోవలసినదని ధృతరాష్ట్రుఁడు పాండవుల కాజ్ఞాపించెను. ఆ సన్నివేశమును భారతమిట్లు వర్ణించినది.

"ఏవ ముక్తేషు రాజ్ఞా తు, పాండు పుత్రేషు భారత!

...... ....... ...... .......

నగర్హయేయు రస్మాన్ వై పాండవార్థాయ కర్హిచిత్

(భా. ఆది. అధ్యా. 144)

ధృతరాష్ట్రుఁ డిట్లు పాండవుల నాజ్ఞాపించిన తోడనే దురాత్ముఁ డైన దుర్యోధనునకుఁ బట్టరాని యానందమైనది. వాఁ డేకాంతమునఁ బురోచనునిఁ బిలిచెను. వాని దక్షిణ హస్తముఁ దన కుడిచేతిలోనికిఁ గైకొని యెంతయో యాప్యాయతనుఁ గనఁబరచుచు సుయోధనుఁ డిట్లన్నాడు. "పురోచనా! ధనధాన్య సహితమైన యీ ధరామండల మంతయు నాదైనది. నాదైనదనఁగా నీదై నదని యర్థము. కనుక చేతికి జిక్కిన రాజ్యమును సంరక్షించికొనుటలో నాకెంతటి

బాధ్యత గలదో నీకును నంతయే యున్నది. నాకు నిన్ను మించిన యాప్తుఁడు లేఁడు. సహాయకుఁడు లేఁడు. అందుచే నా యూహలన్నియు దాపక నీకుఁ దెలుపుచున్నాను. వెంటనే నేను సెప్పునట్లుఁ జేయుము. కాని యీ రహస్య మెన్నఁడును బయటఁబడరాదు. నీవు నా శత్రువులైన పాండవులను నాశమొనర్పుము. నేను వచింపఁబోవు నుపాయము నవలంబింపుము. కుశలుఁడవై సమస్తమును నిర్వహింపవలెను. తండ్రియైన ధృతరాష్ట్రుఁడు కౌంతేయులను వారణావతమునకుఁ బోఁగోరెను. వారతని యాజ్ఞతోఁ గొన్ని దినము లచట నుందురు. నీ విప్పుడే వేగముగ రథమునెక్కి వారణావతమునకుఁ బొమ్ము. శీఘ్రగమనము గల రాసభములు గట్టిన రథముపైఁ బొమ్ము. తొందరగఁ జేరెదవు. వారణావతమున నొక చతుశ్శాలను నిర్మింపుము. దాని నిర్మాణము రహస్యమయముగ నుండవలెను. ఎంత ధనమైనను ఖర్చుపెట్టి దానినిఁ గట్టుము. నేను బాధపడను. దాని గోడలన్నియు నాగ్నేయములై యుండవలెను. శణ, సర్జరస మిశ్రితములైన ద్రవ్యములతో నా చిత్రశాలను నిర్మింపుము. తైలము, ఘృతము మొదలగు వస్తువులతో మట్టినిఁ గలిపి కుడ్యనిర్మాణమును జేయుము. జతుమయములైన పదార్థములతో నా యింటిని నింపుము. కాని యా పదార్థములు అగ్ని ప్రమాదములకు లోనగునని పాండవులకుఁ దెలియనేరాదు. వాని నిర్మాణ మంత సమర్థముగ నుండవలెను. ఇట్టి గృహమును నిర్మించి పాండవుల నందులోని కాహ్వానింపుము. ఆసనములు, యానములు, శయనములు ఒకటేమి? ఆ యింటనున్న పదార్థము లన్నియు నెట్టి వాని హృదయమునైనను లోఁగొనునటు లుండవలెను. నీవు వారి వెంటనే కనిపెట్టికొని యుండుము. ఒక్క నిముసమైనను వారిని వదలి యుండరాదు. వారి హృదయముఁ జూరగొనుము. సమయము వచ్చువరకును పాండవులతోఁ జేరి వారి తలలోని నాల్కవలె మెలఁగుము. ఒకానొక రాత్రి యా యింటికి నిప్పంటించి బయటికిరమ్ము. పాండవులందరు నందు దగ్ధమై పోదురు. అగ్నిని

గృహద్వార పార్శ్వములకుఁ దరికొల్పుము. అట్లొనర్చినచో వారు నడుమ మేల్కొని రేనియు నా యింటిని దాటి పోలేరు. పాండవు లట్లు సచ్చినచో జను లా మరణము ప్రారబ్ధమని దలఁతురు. మన కపవాదు లేకపోవును. శత్రు పీడయుఁ దొలఁగును. "పై వాక్యములను బట్టి దుర్యోధనుని స్వభావ మెట్టిదో మన మూహింపవచ్చును. వాని మంత్రాంగ మత్యంతము గుప్తము. దయయను పదార్థమే వానికి సున్న. వాఁడు కాటు వేయు వఱ కెవ్వరికినిఁ దెలియదు. ఆ కాటు త్రాచుకాటు.

## అదుపులేని గర్వము

అభిమాని యైన పురుషుఁడు శత్రువులతోఁ బోరి మరణించునే గాని వారికి లొంగిపోడని దుర్యోధనుని విశ్వాసము. లొంగిపోరాదనియు వాని తలఁపు. వాని యీ చిత్తవృత్తి భారతమున నడుగడుగుననుఁ గనుపడును. సామాన్య సంభాషణము లందును పాండవులకు దాను భయపడినట్లు వాఁ డితరులకుఁ దోప నివ్వడు. కేవల మితరులకుఁ దోపనీయకుండుటయే గాదు. వాని హృదయతత్త్వము గూడ నంతే. వాని యాకాంక్షయు నదియే! కృష్ణపరమాత్మ దౌత్యము నెఱపుటకై రాబోవుచున్నాఁడన్న వార్త కురుసభలోఁ దెలిసినది. వచ్చినవాని నెట్లు గౌరవింపవలెనని కురువృద్ధులు విచారించుచుండిరి. ధృతరాష్ట్రుఁ డాతనికి లంచము లివ్వఁజూచెను. చీకురాజాయొక్క దురాలోచనను విదురుఁడు పసికట్టినాఁడు. పాండవులనుండి కృష్ణుని వేరుచేయుట యెన్నిరీతులతో నైనను నెవ్వరికి సాధ్యము గాదని విదురుఁడు తెగఁ జెప్పివేసెను. విదురుఁడాడిన యీ మాటలు విని దుర్యోధనునకుఁ గోపము వచ్చినది. అపుడాతఁడు దండ్రితో నీ క్రిందిరీతి వచించెను. ఆ వాక్యములు దుర్యోధనుని చిత్తవృత్తికి ముకురమువంటివి. అవి యివి.

"య దాహ విదుర: కృపే సర్వం త త్సత్యముద్యతే

........ .......... ......... .........

విగ్రహ వృముపారబ్ధో న హి శామ్య త్యనిగ్రహాత్.

(భా. ఉద్యో. అధ్యా. 88)

కృష్ణునిఁ గూర్చి విదురుఁ డన్న మాటలు సత్యములు. ఇందు సందేహము లేదు. యాదవోత్తంసుఁ డైన గోవిందునకుఁ బాండవులపై దృఢమైన యనురాగము. అతనిని వారినుండి వేరుసేయుట యెవ్వరికిని సాధ్యముగాని పని. మీరేమో శ్రీకృష్ణు ననేక రీతుల గౌరవింపవలె నని యెంచుచున్నారు. అతని కనేకవిధములైన పదార్థము లుడుగరలుగ నొసఁగవలెనని మీ యిచ్ఛ. కాని యీ తతంగ మంతయు ననవసరమని నా తలఁపు. శ్రీకృష్ణుఁడు సమ్మానమున కర్హుఁడు గాఁడని నా యభిప్రాయము గాదు. అతఁడు లోకవంద్యుఁడు. అతనిని గౌరవింపవలసినదే. కాని యీ సందర్భము మాత్ర మందుకుఁ దగినది గాదు. మన మొకవేళ సత్కరించినను దాని నతఁడు సరిగా నర్థముఁ జేసికొనునని యెవ్వరు సెప్పఁగలరు? పాండవులనుండి నన్ను వేరుపరుచుటకై కౌరవు లీ యెత్తు నెత్తిరని యాతఁడు భావింపఁగూడదా? అప్పుడు మన ప్రయత్నము లన్నియు వ్యర్థము లైనట్లే గదా! ఇంతకును దూతల కొనర్చు మర్యాద కేవలము లాంఛన మాత్రమే! ఇప్పుడు కృష్ణునకు మనము సత్కార మొనర్చినచో నది మన యవమానమునకే దోహద మొనర్చును. తన కవమానమునుఁ గలిగించు కార్యమును ధీరుఁడైన క్షత్రియుఁ డొనర్చునా? విశాల లోచనుఁ డైన శ్రీకృష్ణుఁడు, మనకేమి మూఁడు లోకములకును గౌరవింపఁదగినవాఁడు. ఇందులో నా కణుమాత్రమైనను సందేహము లేదు. కాని యితనిని గౌరవించుట కిది యదనుగాదు. తీవ్రమైన సంఘర్షము చెలరేగుచున్నప్పుడు దానిని శాంత సౌమ్యములైన యుపాయములతో నణగార్ప యత్నించుట వ్యర్థమైన పనియే గాని వేఱుగాదు.

దుర్యోధనునకు రాజ్య మన్యాయముగ సంక్రమించినది. కాని యంతటితో వానికిఁ దృప్తిలేదు. ఇతరుల యధికారమునుఁ గూడ నాఁడదన్ని లాగికొన వలెనని వాని యాశ. ఈ యన్యాయము నొనర్చుటలో వానికి భయములేదు. ఇన్ని యవగుణము లున్నను, వానిలో మెచ్చుకొనఁ దగినది మాత్ర మొక్కగుణ మున్నది. అది వాని నిర్భీకత. బ్రహ్మాదు లెత్తివచ్చినను వాఁడు లొంగడు. పట్టు వదలఁడు. ఈ సందర్భమున వాని నిర్భీకతకు వ్యాసభగవానుని వాణి, కావ్యమయమైన సౌందర్యము నెంతయో యొసఁగెను. వాని మాట లుదాత్తములై గభీరములై యున్నవి. దౌత్యము ముగియునప్పుడు శ్రీకృష్ణునితో వాఁడిట్లన్నాడు.

ముఖ్య శ్చైవైష నో ధర్మః క్షత్రియాణాం జనార్దన!

...... ...... ...... ......

తావ దస్య పరిత్యాజ్యం భూమే ర్నః పాండవాన్ ప్రతి

(భా. ఉద్యో. ప. అ. 127)

కృష్ణా! సంగ్రామరంగమున మేము మరణించినను, నాకు బాధలేదు. క్షత్రియుల కది ధర్మమే! శరతల్పముపై బడి మరణించుటలో క్షత్రియున కేమి హాని యున్నది? ధీరుఁడైన క్షత్రియుఁ డెన్నడును, శత్రువులకు లొంగకూడదు. అదియే వాని యుత్తమోత్తమ ధర్మము. వాఁడు మరణించినను వీరోచితముగ మరణింపవలెను. ధీరోదాత్తుఁడైన రాజకుమారుఁడు శత్రువులకు, దలవంచునా? ఉదాత్తముగ బ్రతుకుటయే మానవుని పౌరుషము. వాడు మహా వృక్ష స్కంధము వంటివాఁడు. కష్టములకుఁ దునిగి పోవచ్చునే గాని వంగిపోవుట మాత్రము కల్ల. అది పౌరుషవంతున కసహ్యమైన పని. నిజమైన క్షత్రియుఁ డెప్పుడు నిట్లే వర్తించును. క్షత్రధర్మ సముజ్జ్వలితుఁ డైన వీరుఁడు బ్రాహ్మణున కొక్కనికే నమస్కరించును. శత్రువులకు వాఁ డెన్నడును లోఁగఁడు. క్షత్రియవంశోత్పన్నుఁడు

బ్రాహ్మణునకుఁ దప్ప యెవ్వరికిని నమస్కరింపరాదు. నా విశ్వాసము గూడ నంతే! మా తండ్రి భీతుఁడై పాండవుల కర్ధరాజ్యమునుఁ బంచి యిచ్చెను. కాని ముక్కున నావి గలుగువఱకును, దానినిఁ గూడ వారికిఁ దక్కనివ్వను. ధృతరాష్ట్రుఁడు బ్రతికియుండు వఱకును, రాజ్యవిభాగముయొక్క ప్రశ్నయే లేదుగదా! సర్వభూమండలమునకును ధృతరాష్ట్రుఁడే చక్రవర్తి. నా నాయనకుఁ దెలియక యానాడు కౌంతేయుల కర్ధరాజ్యము నంటఁబెట్టినాఁడు. నే నానాఁడు బాలుఁడను. కనుక నానా డది సెల్లినది. ఇప్పుడు పెరిగి పెద్దవాఁడ నైతిని. రాజ్యమునకు సూత్రబాలకుఁడ నైనాను. ఇప్పుడు పాండవులకుఁ దొల్లింటి చాలు గల్గునా! అది యసాధ్యము. సూదిమొన మోపినంత మేర గూడ నేను కౌంతేయులకు భూమి నొసఁగను. ఇఁక నర్ధరాజ్య మిచ్చు టెక్కడ?" దుర్యోధనుని యీ మాటలలో న్యాయము మందునకైనను లేదు. నిజముగఁ జూచినచో ధృతరాష్ట్రుఁడు రాజ్యార్హుఁడే గాఁడుగదా! రాజ్యమంతయుఁ బాండవులదే! కాని "కులనాశమును" సాకువెట్టి వాఁ డొక పథకము నల్లెను. దానికిఁ గౌంతేయులు సమ్మతించిరి. మరి దానికి విరుద్ధముగ బ్రవర్తించు నధికారము దుర్యోధనునకు మాత్ర మెక్కడిది? క్రొత్త నిర్ణయము నొనర్చుటకు వీఁడెవ్వడు గనుక? ఇవన్నియు దుర్యోధనుని చిత్తమునకుఁ దట్టనే తట్టవు. వాని తర్కమే విచిత్రమైనది. వాఁడొక మహోద్ధతుఁడు.

ఆచార్యులవారు పద్నాలుగు భాషాసాహిత్యాలలో ప్రజ్ఞాధురీణులు. ఆయా భాషా సాహిత్యాలలో గతంలోనూ వర్తమానంలోనూ ప్రవర్తిల్లిన సాహితీధోరణులూ, ప్రక్రియలూ, కవితాశైలులూ, కవుల సాహితీ వ్యక్తిత్వాలూ, చారిత్రక విశేషాలై, కళామార్మిక శిల్పాలూ వారికి కరతలామలకాలుగా ఉండేవి. ఆ అనంత పరిజ్ఞానం తులనాత్మక అనుశీలన విధానాన్ని తెలుగులో వెలుగురేఖలు చిమ్మటానికి పుష్కలంగా తోడ్పడేది. అందువలన ఆచార్యులవారు ఏ అంశం మీద మాట్లాడుతున్నా, వ్రాస్తున్నా, భారతీయ భాషా సాహిత్య విజ్ఞాన సర్వస్వం ఆ అంశంలో ప్రతిఫలిస్తున్నట్లు ప్రత్యక్షమౌతుంది. అంతకు ముందు సాహితీవిమర్శకులు దర్శించని ఎన్నో దృక్కోణాలు వారి అనుశీలనతో ప్రత్యక్షమయ్యేవి. పరంపరగా, గతానుగతికంగా విద్వాంసుల మెదళ్ళలో గూళ్ళు కట్టుకొన్న ఛాందస భావాలను వారి విమర్శలు బూజు దులుపుతున్నట్లుండేవి. ఒక జలపాతంలో స్నానం చేసిన క్రొత్తదనం పఠితలకు, శ్రోతలకు అనుభూతమయ్యేది. విశేషమేమంటే గతాన్ని ఈనాటి వర్తమానానికి అనువుగా వ్యాఖ్యానిస్తున్నట్లు తోచేది.

– డాక్టర్. జి.వి. సుబ్రహ్మణ్యం